# చతుర

సంపుటి: 4
సంచిక: 7
ఆగస్టు: 1981

## ఈ నెల సమగ్ర నవల

"సంవత్సరాల తరబడి నా గుండెల్లో చెలరేగుతున్న జ్వాలల్ని ఈనాడు బయట పెడుతున్నాను. నా జీవితంలోని ముఖ్యమైన రహస్యాన్ని నీ ముందు విప్పి చెప్తున్నాను" అంటూ తన జీవిత రహస్యాన్ని బయట పెట్టాడతను. అది విని ఆమె నిర్ఘాంతపోయింది... ఆ పచ్చి నిజాన్ని నమ్మలేకపోయింది.

ఆ గ్రామంలోకెల్లా ధనవంతుడైన కల్నల్‌గారి ఏకైక పుత్రిక ఆమె. ఆ యింట ఆమె అన్నగా అడుగుపెట్టాడతను. వారిద్దరి మధ్యా ఏం జరిగింది ?

అతని గుండెల్లో అన్నాళ్ళుగా నిద్రపోతున్న భయంకర రహస్యమేమిటి? దాని తరువాత జరిగిన పరిణామాలెటువంటివి ?

## మరమనిషి

లా అతన్నాడిస్తున్న అదృశ్యహస్తాలెవరివి? అవి అతన్ని ఎలా ఆడించ గలుగుతున్నాయి? విచిత్ర పరిస్థితుల్లో చిక్కుకున్న ఇరువురు యువతీ యువకుల మానసిక వేదనను సరికొత్త పంథాలో మలచిన ప్రముఖ రచయిత

### గుల్షన్ నందా

నవల 'డర్ పోక్'కు

**అంధాన భగవతిరావు**

సరళమైన అనువాదం 'మర మనిషి' ఈ నెల చతుర సమగ్ర నవల.

ముఖచిత్రం: ప్రభాకర్

2,3 కవర్లు: సూరజ్ ఎన్. శర్మ

# రచయితలకు సూచనలు

* జాతి జీవిత చిత్రాన్ని ప్రతిబింబించే సమగ్ర నవలలను 'చతుర' ఆహ్వానిస్తున్నది. నవల 'చతుర'లో అచ్చులో 100 పేజీలకు సరిపడేదిగా ఉండాలి. 'చతుర'లో అచ్చులో పేజీకి సుమారుగా 260 పదాలు వస్తుంటాయి. ఈ లెక్క ప్రకారం సరిచూసుకున్న తర్వాతనే రచనలు పంపడం మంచిది.
* ప్రస్తుతం వివిధ మాసపత్రికలు వెలువరిస్తున్న 100 – 112 పేజీల పాకెట్ సైజు నవలానుబంధాలలో ప్రచురితమవుతూన్న నవలికలు చతురలో అచ్చులో 60–70 పేజీలు మాత్రమే అవుతాయి. రచయితలు ఈ తేడా గమనించాలి.
* *పై పరిమితులను దృష్టిలో ఉంచుకుని 'చతుర' కొరకై ప్రత్యేకంగా వ్రాసి పంపిన నవలలు మాత్రమే పరిశీలింపబడుతాయి.*
* నవలను ప్రచురించే సమయంలో అవసరాన్ని బట్టి కొంత కుదించవలసి వచ్చేపక్షంలో అందుకు అభ్యంతరం లేనివారే నవలలను పంపాలి.
* అనువాద నవలలు పంపదలిచేవారు మూల రచయిత నుండి ముందే అనుమతి తీసుకుని అనుమతి పత్రంతో సహా నవల పంపాలి.
* ప్రచురణకై ఎన్నిక కాని నవలలను తిప్పి పంపేందుకై నవలతో పాటే తగు పోస్టేజీ తప్పనిసరిగా జతపరచాలి. అలా జతపరచని పక్షంలోనూ, నవలలు పోస్టులోగానీ, ఇతరత్రాగానీ పోయినా మా బాధ్యత ఉండదు. తర్వాత ఉత్తరాలు వ్రాయటం వల్ల ప్రయోజనం ఉండదు.
* 'చతుర'లో ప్రచురించే నవలలకు పారితోషికం రచననుబట్టి రు.1,000 నుండి రు. 2,000 వరకూ ఉండగలదు. ఈ విషయంలో సంపాదకులదే తుది నిర్ణయం.

చతుర

*ఈనాడు కాంపౌండ్, హైదరాబాద్ – 500 004.*

# ఛేజింగ్

రోడ్డుమీద వేన్ వేగంగా పోతోంది. అందులో డ్రయివర్ టిమ్ గాక హెరాల్డ్, జో, రాస్ బ్లేక్‌మేన్, కెన్ వున్నారు. అయిదుగురూ 26–31 ఏళ్ళ మధ్య వయసువారు. ఎదురుగా ఓ లారీ రావడం కన్పించింది వారికి. కన్ను మూసి తెరిచేంతలో లారీ, వేన్ ఢీ కొన్నాయి. వేన్




పక్కకి పడిపోయింది. డ్రయివర్ టిమ్ కళ్ళు తెరవగానే నల్లటి మబ్బుతెర తప్ప మరేమీ కన్పించలేదు. నల్లటి పొగ వ్యాపించినట్లుంది బయట. 'ఝుమ్మని శబ్దం వినిపిస్తోంది. అద్దంలోంచి చూస్తున్న టిమ్‌కి లారీ డ్రయివర్ ఏదో అరుస్తున్నట్లయింది. అది సరిగా విన్పించలేదు. వేన్ ఇంజన్ తగలబడిపోతోందని చెపుతున్నాడనుకున్నాడు. హడావిడిగా తలుపులు తీసి బయటికి రావడానికి ప్రయత్నిస్తుండగా ఆ రణగొణధ్వనిలో లారీ డ్రయివర్ తేనెటీగలు అనడం అస్పష్టంగా చెవినబడింది. బయట కన్పిస్తున్న నల్లటి మబ్బు పొగ కాదని, తేనెటీగల సమూహమని గ్రహించేలోపలే వేన్ తలుపులు తెరుచుకోవడం, తేనెటీగలు గుంపుగా మీద విరుచుకుపడటం క్షణంలో జరిగిపోయాయి.

ప్రమాదంలో భుజం ఎముక, చెయ్యి విరిగిన జో తేనెటీగలు మీదపడి కుడుతోంటే భరించలేక బయటపడి పరిగెత్తడం ప్రారంభించాడు. టిమ్, బ్లాక్‌మేన్‌లు కూడా పారిపోబోతూ కెన్ ప్రమాదంలో స్పృహ తప్పిపోయాడన్న సంగతి గుర్తించారు. అతన్ని తేనెటీగలు కప్పేశాయి. అతనికి స్పృహ తెప్పించడానికి ప్రయత్నించి ఆఖరికి తేనెటీగల బాధ పడలేక, అతని ఖర్మానికి అతన్ని ఒదిలేసి ఇద్దరూ పరిగెత్తడం ప్రారంభించారు. వెంటబడుతున్న తేనెటీగల దాడిని తగ్గించ

దానికి వంకరటింకరగా పరిగెత్తసాగేరు. కాస్సేపటికి జిమ్ ఒంటిమీద వున్న బట్ట లన్నీ తీసేసి నగ్నంగా పరిగెత్తాడు. అంతలో స్పృహ వచ్చిన కెన్ కూడా తూలుతూనే పరిగెత్తడం ప్రారంభించేడు. ప్రమాద స్థలానికి దూరంగా పోయినకొద్దీ తేనెటీగల సంఖ్య తగ్గిపోసాగింది. తేనె టీగలు సాధారణంగా తేనె పట్టునుంచి 500 గజాల దూరం వరకే తరుముతాయి. అయిదుగురూ పడుతూ లేస్తూ ఓ చోటికి చేరారు. ఒక్కొక్కరి శరీరం మీద

# ప్రమాదం




సగటున 200 పైగా తేనెటీగ కాట్లున్నాయి.

ప్రమాదం జరగ్గానే తేనెటీగ లెక్కడ నుంచి వచ్చాయని ఆశ్చర్యంగా వుంది కదూ. వీరు వెళ్తున్న వేన్ ఢీ కొన్న లారీలో 120 తేనెపట్లున్నాయి. వాటిని తేనె తయారుచేసే ప్రదేశానికి తీసుకెడు తున్నారు. లారీని వేన్ ఢీ కొన్నపుడు తేనెపట్లు చెదరడంతో వాటిమీద వున్న 10 లక్షల తేనెటీగలూ కోపంతో ఒకేసారి వీరిమీద 'ది స్వామ్' సినిమాలోలా దాడి చేశాయి.

# నిద్ర-చీటీ

అలసిన శరీరానికి చల్లని గాలి తగిలితే చాలు నిద్ర మైకంలా కమ్ముకువస్తుంది ఎవరికైనా - పని గురించి పట్టించు కోకుండా ఇంట్లో లాగే ఆఫీసులో కూడా టైం ప్రకారం నిద్రకు లోటురానివ్వరు కొందరు. కొంత మందికి వాళ్ళకి తెలీ కుండానే వుండుండీ కునికిపాట్లు వస్తుం హాయి. గవర్నమెంటు ఆఫీసుల్లో ఫైళ్ళతో పాటు సిబ్బంది కూడా హాయిగా నిద్ర పోతుంటారు. కానీ ప్రైవేట్ సంస్థల్లో అధికారుల చూపులు అనుక్షణం అప్ర మత్తంగా కాపలాకాయడం వల్ల కునుకు రాయుళ్ళ పప్పులు బాగా వుడకవు.

ఇటలీలోని ఓ ప్రైవేటు ఫ్యాక్టరీలో పనేస్తున్న లుగియారాసీకి 21 [illegible]

అందంగా, చురుగ్గా వుంటుంది. పైగా తెలివైంది కూడా– పనిపట్ల శ్రద్ధవున్న పిల్ల అని ఫ్యాక్టరీలో అందరికీ ఆమెపట్ల సదభిప్రాయమే వుంది.

కానీ ఓ రోజు మధ్యాహ్నం ఆమె నిద్రపోతూ వుండగా మేనేజర్‌కి పట్టుబడి పోయింది. 'నీతో అర్జంటుగా మాట్లాడాలి చన్నీళ్ళతో మొహం కడుక్కుని వెంటనే నా ఛాంబర్లోకి రా' అని చెప్పి వెళ్ళిపోయాడు. ఉద్యోగానికి ఎసరు తప్పదని భయపడుతూ భయపడుతూ మెల్లిగా మేనేజర్ రూంలోకివెళ్ళి ఆతని ఎదురుగా వున్న కుర్చీలో కూర్చుంది.

"చూడు మిస్ రాసీ! ఆఫీసుపని బా చేయడానికి కావల్సినంత నిద్ర, విశ్రాంతి నీకు ఇంటి దగ్గర దొరకడం లేదను కుంటా – నువ్వు రాత్రి సరిగా నిద్ర పోయినట్లు ప్రతిరోజూ ఉదయం మీ తల్లిదండ్రుల దగ్గర్నుంచి ఓచీటీ రాయించి తీసుకురావాలి' అన్నాడు.

తన కాళ్ళమీద తను నిలబడి స్వతంత్రంగా ఉద్యోగం చేసుకుంటున్న రాసీకి చిన్నపిల్లలా రోజూ చీటి తెచ్చి మేనేజర్ కివ్వడం సిల్లీగా, అవమానకరంగా తోచింది. అయినా నిక్షేపంలాంటి ఉద్యోగం ఒదులు కోవడం ఇష్టంలేక 'సరే'నని ఒప్పుకుంది.

ఆనాటినుంచీ ప్రతిరోజూ క్రమం తప్పకుండా రాత్రి ఎన్నిగంటలకు నిద్ర పోయిందీ, ఉదయం ఎన్ని గంటలకు లేచిందీ నిమిషాలతో సహా తల్లిదండ్రుల చేత నోట్ రాయించుకుని ఉదయం ఆఫీసుకి రాగానే మేనేజర్ చేతుల్లో పెడుతోంది రాసీ.

# కన్నులు చెప్పే కబుర్లు

ప్రథమ వీక్షణంలోనే ప్రేమ పుట్టుకొచ్చిందని రచయిత(త్రు)లు రాస్తే అదో జోక్‌లా నవ్వుకోవడం మనకు అలవాటు. అయితే ఇది అబద్ధం కాదని ఓ ప్రొఫెసరుగారు బల్లగుద్ది మరీ



వాదిస్తున్నారు. కావాలంటే ఎవరితోనన్నా ప్రేమ కబుర్లు చెబుతూ వాళ్ళ కళ్ళను పరిశీలించండి. క్షణంలో నిజం తేలిపోతుంది అంటున్నాడీయన.

కనుపాపలు ప్రేమసిద్ధాంతంలోనే కాదు రుచి, వినికిడి, చూడటం వంటి వాటి విషయాల్లో కూడా ప్రధాన పాత్ర వహిస్తాయి. శ్రావ్యమైన సంగీతం వింటున్నపుడు, చాలా రుచిగల పదార్థాలు తింటున్నపుడు, అందమైన దృశ్యాలను చూస్తున్నపుడు, కనుపాపలు పెద్దవవుతాయి. కనుపాపలు చిన్నవయితే అయిష్టాన్ని, విశాలమయితే ఇష్టాన్ని, ఆనందాన్ని సూచిస్తాయి. స్త్రీలలో బలమైన దేహధారుఢ్యం గల మగవారిని చూసినపుడు, విచారంగావున్న జంతువులు,

పసిపిల్లలు, చిన్న స్పోర్ట్స్ కార్లు, పువ్వులు సూర్యాస్తమయం, దుస్తులు మొదలైన వాటిని చూసినపుడు కనుపాపలు పెద్ద వవుతాయి. ఇక మగవారిలో అర్ధనగ్నంగా వున్న స్త్రీలు, స్పోర్ట్స్ కార్లు, సాహస కార్యాలు చేస్తున్న మనుషుల బొమ్మలు, కుక్కలు, గుర్రాలు, మద్యం, దుస్తులు మొదలైనవి చూస్తున్నపుడు కనుపాపలు పెద్దవవుతాయి.

ఈ సిద్ధాంతాన్ని వైద్యులు 'ప్యూపిలో మెట్రిక్స్' అని వ్యవహరిస్తున్నారు. ఈ సిద్ధాంతం కూడా యథాలాపంగా కనుగొనబడింది. డాక్టర్ 'హెస్' అనే ఆయన పదేళ్ళక్రితం కొన్ని జంతువుల ఫొటోలు చూస్తున్నాడు. అతని భార్య అదేమిటి "మీ కనుపాపలు మామూలుకన్నా పెద్దగా వున్నాయి–" అనడిగింది. అప్పుడు ఆ చిత్రాలు తనకి నచ్చినందువల్లనే కనుపాపలు పెద్దవయి వుంటాయనిపించింది అతనికి. మర్నాడే అందులోని నిజానిజాలు తెల్పడానికి ప్రయోగాలు ప్రారంభించాడు, దానిలో భాగంగా ఓ ఆరు ఫొటోలు ఎంపిక చేశాడు. వాటిలో ఐదు మామూలు దృశ్యాలు ఒకటి మూడొంతులు నగ్నంగా వున్న యువతి ఫొటో. వాటిని తన అసిస్టెంట్ కి ఇచ్చాడు. మిగిలినవి చూసినపుడు ఏమీ అన్పించ లేదుగానీ అమ్మాయి ఫోటో చూస్తున్నపుడు అతని కనుపాపలు బండి చక్రాలంత అయ్యాయట.

పరిశోధనలు సత్ఫలితాలను ఇచ్చాక డాక్టర్ 'హెస్' కనుపాపలపై ప్రభావాన్ని నమోదు చేయడానికి ఓ కెమేరా వంటి పరికరాన్ని డిజైన్ చేశాడు. ఈ సిద్ధాంతాన్ని వ్యాపార ప్రకటనల ఏజెన్సీలు ఎక్కువ ఉపయోగించుకోవాలని చూస్తున్నాయి. అదీగాక మేరేజ్ బ్యూరో వారికి ఈ సిద్ధాంతం వరప్రసాదిని. పెళ్ళి చేసుకోవాలనుకొనేవారికి ఫొటోలు చూపించి వారి కనుపాపలపై వాటి ప్రభావాన్ని గమనించితే చాలు. వారిపని సులభమవుతుంది.

# వింత సరదా

**కొం**డల్లోనూ కోనల్లోనూ ప్రమాదానికి గురయి తిండితిప్పలు లేకుండా మాడి చివరికెలాగో రక్షించబడిన ఉదంతాలు చాలా వున్నాయి. ఆ ప్రమాదానికి గురయిన వారు కలలో కూడా అలాంటి అనుభవాన్ని కోరుకోరు అయితే కొండపు తీరి కూర్చొని సింద్ బాద్ లా సెలవు రోజుల్లో ఇలాంటి అనుభం కోసం ఉవ్విళ్ళూరుతున్నారు. వీరి సరదా తీర్చే కంపెనీలు కూడా వున్నాయి.



టోరంటో ట్రావెల్ ఏజన్సీ వారు

బ్రిటిష్ వెస్టిండీస్ ద్వీపాల్లోని కొన్ని ప్రాంతాల్లోకి తిండి నీరు లేకుండా బ్రతకదలిచే ఉత్సాహవంతులను ఒదిలి పెడతారు. వీరు అక్కడ ఆహారం వెతుక్కొని, సముద్రపు నీటిని శుభ్రపరచి తాగాలి. తిరిగి ఐదురోజుల అనంతరం వీరిని వెనక్కి తీసుకొస్తారు ఏజెన్సీవారు

ఈ ద్వీపాలను బహామాస్ ద్వీపాలంటారు. ఇక్కడ తిండి నీరు సరిగ్గా దొరకవు. పగడపు దుబ్బులు అధికం. ఈ ఏజెన్సీవారు ద్వీపాల మీద వదిలేసే వారితో మరో జత దుస్తులు, రెయిన్‌కోటు, ఈత దుస్తులు, టార్చ్‌లైటు, జేబులో పెట్టుకొనే చిన్న కత్తి, ప్లాస్టిక్ చాప ఒక బకెట్, అగ్గిపెట్టెలు మాత్రమే తీసికెళ్ళనిస్తారు. వేరే వస్తువులేమీ తీసికెళ్ళ కూడదు. అయితే వారిని పూర్తి ఒంటరిగా ఒదిలేయరు. ఏజెన్సీ తాలూకా సర్వైవల్ నిపుణుడు ఒకతను వారితో పాటు వుంటాడు. గత వేసవిలో 26 మంది ఈ ద్వీపాలకు వెళ్ళారట.

## షేక్ హాండ్

ప్రముఖులు వచ్చినపుడు వారి అభిమానులు షేక్‌హాండ్ ఇవ్వటం పరిపాటి. ఒకోసారి షేక్‌హాండ్ కూడా ప్రాణాంతకం అవుతుంది అంటున్నారు వైద్య నిపుణులు. ప్రముఖ టెన్నిస్ ఆటగాళ్ళకు షేక్‌హాండ్ ఇచ్చినపుడు వాళ్ళ ఆటాడేటపుడు చేతులమీద పడేంత ఒత్తిడి కలుగుతుంది. దీనివలన ఆటగాళ్ళ కండరాలకి దెబ్బ తగిలి నరాలకు సంబంధించిన వ్యాధులు వచ్చే ప్రమాదం వుంది.




అమెరికా నిపుణుడు డాక్టర్ ఫ్రాన్సిస్కో, రూజ్వెల్ట్ మరణానికి షేక్‌హాండ్ కూడా ఒక కారణం అని నిర్ణయించాడు. రూజ్వెల్ట్ ఓ సారి వైట్‌హౌస్‌లో 8,513మందికి షేక్‌హాండ్ ఇచ్చి ప్రపంచ రికార్డు సృష్టించాడు. వీటి మూలాన అందర్లోకి ఎక్కువ బాధ పడేది ఇంగ్లండ్ రాణి. అధికారిక కార్యకలాపాల సందర్భంగా ఈమె ప్రతి ఏటా కొన్ని వేలమందికి షేక్‌హాండ్‌లిస్తూ వుంటుంది. అందుకే ఆవిడకు పరిచయం చేయబడే వారికి వీలయినంత సుకుమారంగా రాణి వేళ్ళను తాకమని హెచ్చరిస్తారు.

రష్యన్ నాయకుడు బ్రెజ్నేవ్ టూరు కెళ్ళి వచ్చాక అతని భుజానికి కట్టుకట్టి చేతిని మెడకు తాడుకట్టి వేలాడదీయాల్సి వస్తుంది. అంటే టూర్లో అన్ని షేక్‌హాండ్స్ ఇస్తాడన్నమాట. అమెరికా మాజీ విదేశాంగమంత్రి అయిన హెన్రీ కిస్సింజర్ ఇటలీ వెళ్ళినపుడు ఓ విందు సందర్భంగా రెండువేల మందికి షేక్‌హాండ్ ఇచ్చాడు. తర్వాత అతని చేయి బెలూన్‌లాగా వాచిపోయింది పాపం.

రాత్రి—

చాలా పొద్దుపోయింది.అయినా కల్నల్ గారు హాల్లో కూర్చుని ఆసక్తిగా ఆరోజు వార్తాపత్రిక చదువుతున్నారు. తనకోసం భార్యకాచుకూర్చుందేమోనన్న ఆలోచన కలిగినా, వార్తల మీది ఆసక్తితో నిద్ర నణుచుకుంటూ అక్కణ్ణుంచి కదలలేదు. అనుకోని పనులు తగిలి పగలు పేపరు చూడడం కుదరలేదాయనకు.

బయట నిశ్శబ్దం... అప్పుడప్పుడు ఓ గాలి తెర వచ్చి కిటికీ రెక్కల్ని వొరుసుకుంటూ చిరు శబ్దం చేస్తోంది. కళ్లు పత్రికనే చూస్తున్నా ఎక్కణ్ణుంచో వినవస్తూన్న మాటల్ని కూడా గ్రహిస్తూనే వున్నారాయన.

బయట వరండాలోంచి వినవస్తున్నాయా మాటలు! కొంచెం శ్రద్ధగా విన్నాక అందులో ఓ గొంతు తమ నౌకరు సూరజ్‌దని అర్థమయిందాయనకి అతను ఎవరితోనో గొడవపడుతున్నట్లున్నాడు.

కల్నల్ గారు లేచి, జేబులోని పిస్తోలు తడుముకుంటూ కిటికీ వద్దకు నడిచి, తెర తొలగించి బయటకు చూసారు. నిజమే. సూరజ్ ఎవరితోనో గొడవపడుతున్నాడు.

"సూరజ్" కేకేశారాయన.

"బాబుగారూ!" చటుక్కున అవతలి వ్యక్తి చేయి వదిలేస్తూ అన్నాడు సూరజ్.

"ఏమిటా గొడవ"

"ఏం లేదు బాబుగారూ! ఇతనెవరో ఎక్కణ్ణుంచొచ్చాడో కాని..."

"ఊఁ కాని..."

"తమర్ని చూడాలంటున్నాడు. తమరే చెప్పండి బాబుగారూ! రాత్రి పదవుతోంది. ఇది తమతో కలిసే టైమా? లక్ష చెప్పినా విన్పించుకోవట్లేదితను"

కల్నల్ గారు తీక్షణంగా ఆ వ్యక్తిని చూశారు. మాసిన పంచె, లాల్చీ వేసుకుని చేతులు కట్టుకొని నిల్చున్నాడతను. పల్లెటూరివాడిలా కన్పిస్తున్నాడు. కల్నల్ గారిని చూస్తూనే ఆనందంగా ముందుకు అడుగేశాడతను. కాని సూరజ్ అడ్డగించాడు.

"అతన్ని రానియ్" గంభీరంగా అంటూ గదిలోకి నడిచి ఈజీ ఛైర్లో కూర్చున్నారాయన. చేయి మాత్రం జేబులో ఉన్న పిస్తోలు మీదే వుంది. ఆ వ్యక్తి భయంగా నెమ్మదిగా లోపలికొచ్చి కల్నల్ గారి కాళ్ల దగ్గరగా తివాచీ మీద కూలబడ్డాడు. సూరజ్ అతని పక్కనే నిల్చున్నాడు. ఆ వ్యక్తి సూరజ్‌నోసారి చూసి కల్నల్ గారి వైపు తిరిగాడు.

"ఏమిటి విషయం" కల్నల్ గారు గంభీరంగా ప్రశ్నించారు.

'ఇతన్ని బయటకు పంపండ'ంటూ ప్రార్థిస్తున్నట్టుగా సైగ చేసి, చేతులు జోడించాడతను.

కల్నల్ గారి చూపుకి సూరజ్ బయటకి వెళ్ళిపోయాడు.

"ఇప్పుడు చెప్పు! ఏమిటి సంగతి" కల్నల్‌గారు రెట్టించారు.

"తమరు అనుమతిస్తే కొన్ని ప్రశ్నలడుగుతాను"

"అలాగే! అడుగు!"

"బాబుగారూ! తమకి కొడుకులున్నారా?"

"ఉండాలి! ఓ కొడుకు! ఇపుడు లేడు"

"చిన బాబుగారు పదేళ్ళ క్రితం చనిపోయారా?"

"అవును".

"చిన బాబుగారు ఈ లోకాన్ని విడిచి పోయింది సరిగ్గా డిసెంబరు పన్నెండవ తేదీ ఆదివారం కదూ"

"సరిగ్గా జ్ఞాపకం లేదు అంతేనేమో?"

"అంతకు కొన్ని రోజుల ముందు అతన్ని వేటకుతీసుకెళ్ళారు కదూ!

"వేటకా!... అవును! ఆ రోజుల్లో వేట అంటే మాకు చాలా ఆసక్తిగా వుండేది. చనిపోవటానికి ముందు వాడు నాతో శామ్‌గడ్ కొండలకు వచ్చాడు"

"ఆ సమయంలో మీ దగ్గర సూరజ్ అనే నౌకరు వుండేవాడా?"

"ఇప్పుడు కూడా వున్నాడు. ఇంతకు ముందు నువ్వు మాట్లాడింది వాడితోనే"

"చినబాబుగారికి గాలిపటాలెగరేయడం ఎక్కువ ఇష్టం కదూ"

"అవును! గాలి పటాలంటే వాడికి చాలా మోజు"

"ఒకరోజు అమ్మగారు 'వద్ద'ని వారిస్తే చినబాబుగారు చేతిలోని పాల గ్లాసుతో ఆమెను కొట్టారు..."

"నిజమే! అప్పుడు వాళ్ళమ్మగారు స్పృహ తప్పి పడిపోతే చినబాబు భయపడి పారిపోయాడు"

"తర్వాత మీ నౌకరు సూరజ్ చిన బాబుగారిని అడవిలో వెదికి తీసుకొచ్చాడు. అవునా?" అంటూ ఆ పల్లెటూరి వ్యక్తి మౌనంగా కల్నల్ గార్ని చూశాడు. కల్నల్‌గారు కూడా అతన్ని తదేకంగా చూస్తున్నారు.

గడిచిన ఆ కొద్ది సమయంలోనే ఆ ఆగంతకుడు కల్నల్‌గారిలో నిద్రపోయిన స్మృతుల్ని మేల్కొలిపి, ఆయన్లో అశాంతిని రేకెత్తించాడు. ఆయన కేమీ అర్థం కావట్లేదు. తమ వ్యక్తిగత జీవితంలోని సంఘటనలు యథాతథంగా అవతలి వ్యక్తి ఎలా తెలుసుకోగలిగాడా అని ఆలోచిస్తున్నారు.

కొన్ని క్షణాలు గడిచాయి. ఆగంతకుడు లేచి, చేతులు జోడించి నమస్కరిస్తూ "వెళ్ళొస్తా బాబుగారూ" అన్నాడు.

కల్నల్‌గారు ఆలోచనలనుండి తేరుకున్నారు "ఆగు! ఎక్కడికెళ్తావ్" అని ప్రశ్నించారు.

"మా వూరికి బాబుగారూ! ఈ విషయాలు తెలుసుకోవాలనే వచ్చాను."

"కాని నీకి విషయాలు ఎందుకు? నువ్వెవరివి? ఈ విషయాలన్నీ నీకెలా తెలుసు?"

"వద్దు బాబుగారూ! దయచేసి నన్నేమీ అడగొద్దు! నేనేమీ చెప్పలేను" అని నమస్కరించి బయటికి నడిచాడతను. కల్నల్‌గారు కోపంగా అతన్ని ఆగమంటూ అరిచారు. అయినా ఆగలేదతను. పిస్తోలు బయటికి తీసి అతనికి గురిపెట్టారు. ఆగంతకుడు పిస్తోల్ని చూస్తూనే వణికిపోతూ ఆగిపోయాడు. కల్నల్‌గారి కేక విని సూరజ్ పరుగెత్తుకొచ్చాడు. ఆయన చేతిలోని పిస్తోలు చూస్తూనే—

"బాబుగారూ! నేనపుడే అనుకొన్నాను. వీడెవడో దొంగ! లేకపోతే ఇంత రాత్రివేళ..."

"కాదు బాబుగారూ! నన్నపార్థం చేసుకోకండి"

"అయితే ఏమిటీ నాటకం"

"చెప్తాను, అంతా చెప్తాను. దయచేసి ఆ పిస్తోలు..." కల్నల్‌గారు అతని ప్రార్థన విన్నారు. పిస్తోల్ని జేబులో దాచేశారు. ఆగంతకుడికి పోయిన ప్రాణాలు తిరిగొచ్చాయి.

"బాబుగారూ! నేను దొంగని కాను. నిరుపేదని. బిలాస్‌పూర్ మా వూరు. తమరి దర్శనం కోసం మూడొందల మైళ్ల ప్రయాణం చేసొచ్చాను"

''ఎందుకని?"

"అదంతా ఓ కథ! కథ కాదు బాబుగారూ! నిజం! పచ్చి నిజం"

"ఏమిటది?" కల్నల్‌గారు, సూరజ్ ఒకేసారి ప్రశ్నించారు.

"నేటికి పది సంవత్సరాల క్రితం, డిసెంబర్ పన్నెండవ తేది అర్ధరాత్రి, ఆదివారం నాడు..."

"ఏమయిందా రోజు"

"ఓ అబ్బాయి పుట్టాడు"

"అయితే!?"

"వాడికి జ్ఞానం తెలిసేసరికి విచిత్రంగా మాట్లాడటం మొదలెట్టాడు. అంతే కాదు, ఒకోసారి కారణం లేకుండానే భయంతో వణికిపోతూ ఎక్కడికో పారిపోయేవాడు"

"ఏం ?"

"చుట్టుపక్కల వాళ్ళు వాడికి దెయ్యం పూనిందన్నారు"

"నిజమా?"

"వాడు పెరిగి పెద్దయ్యాక వాడు చెప్పే మాటలు వింటూంటే దెయ్యం, దేవతా కాదనీ, వాడికి పూర్వజన్మజ్ఞానం వుందనీ తెలిసింది"

"ఎవరా కుర్రాడు?" కల్నల్‌గారు కుతూహలంగా అడిగారు.

"నా కొడుకు బాబుగారూ!"

"ఆ విషయం గ్రహించాను. పూర్వజన్మలో ఎవరట?"

"తమరి కొడుకట"

"నా కొడుకా ! నువ్వంటున్నది నిజమా" కల్నల్‌గారు ఆశ్చర్యపోయారు.

"అవును! మీ అబ్బాయిగారే ! ఇందులో నిజానిజాలు తెలుసుకొందుకే నేనింత దూరం వచ్చింది"

"మరి...?"

"ఇప్పుడిప్పుడే నాక్కూడా నమ్మకం కలుగుతోంది. వాడికి ఈ వూరు, తోవ బాగా జ్ఞాపకమున్నాయి. బహుశా ఈఇల్లు ...తమరు కూడ ...కాని ... అలా జరగడానికి వీలులేదే?"

"ఆ అబ్బాయి ఎక్కడున్నాడు" కల్నల్‌గారు నలువైపులా దృష్టి సారించారు.

"నేను పేదవాడిని. నా సర్వస్వం వాడే"

"వాణ్ని నీ నుండి బలవంతంగా లాక్కుపోతామనుకొంటున్నావా?"

"అదికాదు బాబూగారూ! వాడే తమని చూసి..."

"అదా! అయితే మేమే అతన్ని చాటుగా చూస్తాం"

"సరే బాబుగారూ! కాని, నా సర్వస్వాన్ని దోచుకోనని మాటివ్వండి"

"అలాగే. అయినా ఎవరి బిడ్డనో బలవంతంగా లాక్కొనే హక్కు మాకేకాదు ఎవరికీ వుండదు"

"అయితే నా వెనుక రండి బాబుగారూ"

కల్నల్‌గారు సూరజ్‌తో పాటు ఆ ఆగంతకుణ్ని అనుసరిస్తూ ప్రహరీ గేటు దగ్గరికి చేరుకున్నారు. కల్నల్‌గారికి విన్న 'కథ' మీద విశ్వాసం కుదరటం లేదు. అయినా విషయమేమిటో — వింతేమిటో తెలుసుకోవాలన్న ఆసక్తితో వున్నారు. ఆయనలో అనేక ఆలోచనలు రేగుతున్నాయి. నిజంగా ఆ కుర్రాడు తమ కొడుకేనా? పునర్జన్మ నిజమా! ...

ఆయన మనస్సు ఆందోళనగా వుంది.

ఆగంతకుడు గేటులోంచి బయటకు తొంగి చూసి, కల్నల్‌గారిని చూడమన్నట్టుగా సౌంజ్ఞ చేశాడు. కొద్దిదూరంలో నాలుగు రోడ్ల కూడలి దగ్గరున్న దీప స్తంభంకింద ఓ కుర్రాడు ఎగురుతూ ఉన్న దీపప్పురుగుల్ని పట్టుకోడానికి ప్రయత్నిస్తున్నాడు. సూరజ్ జేబులో నుండి కళ్ళజోడు తీసి పెట్టుకొని పరిశీలనగా చూశాడు. అప్పటికే కల్నల్‌గారు ఆ కుర్రాణ్ని నఖశిఖ పర్యంతం పరిశీలించారు. ఆగంతకుడు కంగారుగా ఆ ఇద్దర్నీ చూస్తున్నాడు.

"అబ్బాయి పేరు?" కల్నల్ గారడిగారు.

"గోపాల్" ఆగంతకుడు నమ్రతగా జవాబిచ్చాడు.

"సరిగ్గా అదే పోలిక! చినబాబుగారు కూడా ఇలాగే రాత్రివేళ దీపప్పురుగులతో ఆడుకొనేవారు" అన్నాడు సూరజ్.

"నిజమే! అయితే నిజానికి ఆ వయసులో ప్రతి కుర్రాడూ అలాగే ఆడుకొంటాడు"

"తమరు అనుమతిస్తే చిన్న పరీక్ష చేస్తాను" సూరజ్ నసిగాడు.

"ఏమిటి"

"తమరీ పొదల మాటున దాక్కోండి"

సూరజ్ మాటని కల్నల్‌గారు పాటించారు. ఆగంతకునితో పాటు పొదల మాటున దాక్కొన్నారు. సూరజ్ ముందుకు నడిచి గేటు తెరిచాడు. చీకటి రాత్రి! కల్నల్‌గారు వూపిరి కూడా పీల్చటం మరిచి జరుగుతోందంతా చూస్తున్నారు.

గేట్లోంచి బయటకు వెళ్ళిన సూరజ్, రోడ్డు అంచున నిల్చున్న కుర్రాణ్ని కొన్ని క్షణాలు చూశాడు. తర్వాత హఠాత్తుగా.

"జీవన్! బాబూ జీవన్!" అంటూ మెల్లిగా పిల్చాడు. మళ్ళీ లోపలికొచ్చి గోడ మాటున చీకట్లో కలిసిపోయాడు. కల్నల్‌గారు కొద్దిగా ముందుకు నడిచి గేటు మీద 'టక టక' మంటూ సడి చేశారు.

నెమ్మదిగా అడుగులు వేసుకుంటూ గేటులోనికి కుర్రాడు వచ్చాడు. ఏదో జ్ఞాపకం తెచ్చుకోడానికి ప్రయత్నిస్తూ ముందుకు నడిచాడు. ఆ ప్రదేశం వాడికి బాగా తెలిసినట్టుంది. కల్నల్‌గారి పెదవుల నుండి అప్రయత్నంగా "వాడే! అంతా వాడిపోలికే" అన్న మాటలు అస్పష్టంగా వెలువడ్డాయి.

కుర్రాడు వరండా చేరుకొని సరిగ్గా జీవన్ గదివున్న వైపుకు తిరిగి అటుకేసి నడిచాడు. కుడివైపున్న కిటికీ దగ్గరికి చేరుతూనే ఆగి వరండా కప్పుకేసి పరిశీలనగా చూశాడు. అక్కడ జీవన్ పెంచిన పావురాలు వుండేవి. కిటికీ వూచలు పట్టుకొని పైకెక్కి పావురాళ్ళ గూళ్ళలో చేయిపెట్టి వెతికాడు. అక్కడ ఏమీ లేవు. నిరాశగా కిందికి దిగి, భయంతో అటూ ఇటూ చూశాడు. ఇంతలో కల్నల్‌గారు వాడి దగ్గరిగా వచ్చారు. లోపలినుండి వస్తోన్న వెలుతురులో వాణ్ని నిశితంగా పరిశీలించారు.

ఆయన వాణ్ని సరిగ్గా చూడక మునుపే వాడు "నాన్నా! నాన్నా" అంటూ అరుస్తూ గేటుకేసి పరుగు తీశాడు. గేటు దగ్గరికి చేరుకొంటూనే అక్కడ నిలబడ్డ ఆగంతకుణ్ని గట్టిగా వాటేసుకున్నాడు. తక్షణం అతను వాణ్నెత్తుకుని గబగబా అక్కణ్నుంచి వెళ్ళిపోయాడు.

కల్నల్‌గారు ఆత్రంగా ఆశ్చర్యంగా వెళ్ళిపోతున్న ఆ ఇద్దర్నీ చూస్తూండి పోయారు. సూరజ్ ఆయన దగ్గరిగా వచ్చాడు.

"ఒకవేళ నిజంగా మన జీవన్..." అంటూ అర్థోక్తిలో ఆగిపోయాడు.

"అదే నేను కూడా ఆలోచిస్తున్నాను. నువ్వు చూశావుగా వాడు తిన్నగా పావు రాళ్ళ గూడు దగ్గరికే వెళ్ళాడు"

"ఇది నిజమేనంటావా? లేక ఏదన్నా మోసం..."

"సూరజ్" నిట్టూరుస్తూ అన్నారు కల్నల్‌గారు.

"బాబుగారూ"

"ఆ వ్యక్తిని తీసుకురా"

"చిత్తం"

"ఎలా అయినా అతన్ని వెనక్కి తీసుకురా ఎంత ఖర్చయినా సరే"

సూరజ్ 'సరే'నంటూ తలూపి పెద్ద పెద్ద అంగలు వేసుకుంటూ బయటికి నడిచాడు. కల్నల్‌గారు శూన్యంలోకి చూస్తూ చాలా సేపు అలాగే నిల్చున్నారు. ఆయన కళ్ళముందు ఆనాటి జీవన్ రూపం కదుల్తోంది. అదే నడక! అవే చేష్టలు! అవే పోలికలు! ఆయన కళ్ళు చెమ్మగిల్లాయి.

ఓసారి గేటుకేసి చూసి తమ పడక గది వైపు నడిచారు. గది చీకటిగా వుంది. బహుశా భార్య శాంతీదేవి తన కోసం నిరీక్షించి నిరీక్షించి నిద్ర పోయుంటుంది.

* * *

ఆ రోజు వుదయం కల్నల్‌గారింట్లో అందరూ ఎవరికోసమో ఎదురు చూస్తున్నారు. సావన్ కొడుకు గోపాలే 'జీవన్' అనీ, 'జీవన్' ఆత్మ కేవలం శారీరక మార్పుతో సావన్ కొడుకుగా అవతరించిందనీ కల్నల్‌గారూ, ఆయన భార్యా నమ్ముతున్నట్లే ఉన్నారు.

కల్నల్‌గారు మంచి మనసున్న వ్యక్తి. వయస్సేం ఎక్కువ కాకపోయినా యుద్ధంలో గాయపడిన కారణంగా వుద్యోగం నుండి తొలగింపబడ్డారు. ఇప్పుడాయన స్వగ్రామమైన శామ్‌గఢ్‌లో పూర్వీకులు సంపాదించి పెట్టిన ఆస్తి పాస్తుల్ని స్వయంగా చూసుకొంటున్నారు.

పాతకాలంనాటి వారి భవంతి ఆధునిక అలంకరణలతో కొత్త రూపాల్ని సంతరించుకుంది. అక్కడ పరిసరాలన్నీ కళకళలాడుతుంటాయి. అదే ఆయన స్వర్గం! ఆ స్వర్గంలో తన చిన్న కుటుంబంతో ఆయన సుఖంగా కాలక్షేపం చేస్తున్నారు. ఆ సుఖమయ జీవితంలో మానని గాయం లాంటి 'జీవన్' అకాల మరణం ఆయన్ని ఎంతగానో కృంగదీసింది.

పోయిన కొడుకు పోగా. ఉన్నదల్లా కల్నల్‌గారికి ఒకే ఒక కూతురు జ్యోతి. ఆ అమ్మాయికి అయిదేళ్ళు. అపారమయిన కల్నల్‌గారి సంపదలకు ఏకైక వారసురాలు ఆమే.

కల్నల్‌గారు సూరజ్ కోసం ఎదురు చూస్తున్నారు. అతను గోపాల్‌ని తీసుకు రావడానికి జీపు తీసుకువెళ్ళాడు. గోపాల్‌ని ఇక్కడికి పంపించడానికి అంగీకరింపజేశాడు సూరజ్. కల్నల్ గారికి గోపాల్ని దగ్గరిగా చూడాలన్న ఆసక్తి బాగా వుంది.

ఏదయినా కారు శబ్దం చెవిన పడితే చాలు! కల్నల్ దంపతులిద్దరూ ఆత్రంగా అటు చూస్తున్నారు. జ్యోతి "ఎవరొస్తున్నారు మమ్మీ! ఎక్కడనుండొస్తారు? ఎప్పుడొస్తార"ంటూ ప్రశ్నల వర్షం కురిపిస్తోంది.

ఇంతలో– 'వాళ్ళొ'చ్చారంటూ కబురు తెచ్చాడో నౌకరు. కల్నల్ దంపతుల కళ్లల్లోకి వెలుగు తోసుకొచ్చింది. ఇద్దరూ వచ్చిన అతిథిని ఆహ్వానించడానికన్నట్టుగా ద్వారం దగ్గరికి వచ్చి నిల్చున్నారు. జ్యోతి ఆశ్చర్యంగా తల్లినీ, తండ్రినీ చూస్తోంది.

కల్నల్‌గారు కప్పుకొన్న శాలువా సర్దుకొంటూ బయటికి చూశారు. గోపాల్‌ని, అతని తండ్రిని వెంట తీసుకొస్తూ కన్పించాడు సూరజ్. కల్నల్‌గారికి ఏం తోచిందో ఏమో భార్య చేయి పట్టుకొని తెర చాటుకు దాక్కుపోయి నిశ్శబ్దంగా ఆ చిన్న అతిథిని చూడ మన్నారు.

మొదట సూరజ్ లోపలికి అడుగు పెట్టాడు. అతని వెనుకనే సావన్, గోపాల్ లోపలికొచ్చారు. సూరజ్ కల్నల్‌గారు చేసిన సంకేతాన్ని గుర్తించి అక్కడేఆగిపోతూ, సావన్‌ని కూడ భుజమ్మీద తట్టి ఆపేశాడు. అదేమీ గమనించని గోపాల్ మాత్రం ముందుకు సాగిపోయాడు. కొంత దూరం నడిచి ఆగిపోయి, ఆశ్చర్యంతో ఆ గదినీ, గదిలో అలంకరించిన వస్తువుల్నీ చూస్తున్నాడు.

గోపాల్ కొత్త బట్టల్లో వున్నాడు. కొత్త పంచె, తలకి ఎర్రని చిన్ని పాగా, మెడలో సిల్కు రుమాలు; ఆ పల్లెటూరి వేషంలో వాడెంతో ముద్దొస్తున్నాడు. కళ్ళు విప్పార్చుకుని చుట్టుపక్కలున్న వస్తువుల్ని చూస్తున్నాడు. సూరజ్, సావన్‌లిద్దరూ నెమ్మదిగా బయటికి వెళ్ళిపోయారు. గదిలో గోపాల్ ఒంటరయ్యాడు. అక్కడి అందమైన వస్తువుల్నీ, గోడలకున్న పటాల్నీ, ఫర్నీచర్నీ చూస్తూండగా హఠాత్తుగా వాడి దృష్టి ఎదురుగా గోడకున్న పులి తల మీద పడింది. ఉలిక్కిపడ్డాడు. దాన్ని చూడ్డానికి నెమ్మదిగా అడుగులు వేస్తూ గోడ దగ్గరికి



నడిచాడు. దాని పక్కనే జీవన్ ఫొటో వుంది. అందులోని 'జీవన్' పావురాళ్లకు గింజలు వేస్తున్నాడు. గోపాల్ ఆ ఫొటోను చూసి ఆశ్చర్యపడ్డాడు. ఏదో జ్ఞాపకం తెచ్చుకొంటున్నట్టుగా ఆ ఫొటోను పట్టుకు చూశాడు.

ఆ కుర్రాడి చేష్టలు, తల్లిదండ్రి తెర చాటున దాక్కోవడం చూసి జ్యోతి భయపడింది. ఆ పిల్ల కూడ సోఫా వెనక నక్కి రహస్యంగా అంతా చూస్తోంది.

గోపాల్ నెమ్మదిగా అడుగులు వేస్తూ బీరువా దగ్గరికి వెళ్ళాడు. అందులో జీవన్ ఆట వస్తువులున్నాయి. వొణుకుతూన్న చేతుల్తో బీరువా తలుపులు తెరిచాడు. ఖరీదైన వస్తువుల్ని వేళ్ళతో తడిమి చూశాడు. కల్నల్ దంపతులు వాడి చేష్టల్ని కుతూహలంగా గమనిస్తున్నారు. వాడలా ఆట వస్తువుల్ని కెలకటం చూస్తూంటే, వాళ్ళిద్దరి మనస్సుల్లో గతించిన జ్ఞాపకాలు ఒకటొకటిగా అలల్లా లేస్తున్నాయి. తమ 'జీవన్' స్వయంగా వచ్చి అక్కడ నిలుచున్నట్టు అనుభూతినీ, భ్రాంతినీ పొందుతున్నారు.

ఆట వస్తువుల్లో వాడికి చిన్న తుపాకీ కన్పించింది. దాన్ని తీశాడు. కాని, దాన్నెలా పేల్చాలో తెలీక తికమక పడ్డాడు. జీవన్ పుట్టిన రోజుకి కల్నల్ గారు బహుమతిగా ఇచ్చిన తుపాకీ అది. దాంతో జీవన్ ఇంటిల్లిపాదినీ భయపెట్టేవాడు. అది పేలదని తెలిసికూడ వాడి సంతోషం కోసం నిజంగా భయపడినట్టు నటించే వాళ్ళు నౌకర్లు.

అదే సమయంలో జ్యోతి పెంచుకొంటున్న పిల్లి వచ్చింది. మొదట అది చేసిన చప్పుడికి భయపడినా, పిల్లిని చూశాక తుపాకీ బల్ల మీద పడేసి పిల్లిని వెంటతరిమాడు గోపాల్.

గోపాల్ బయటకు వెళ్ళిన మరు క్షణం, సోఫా వెనుకనున్న జ్యోతి ఇవతలకి వచ్చి, బల్ల మీది తుపాకీ తీసి గోపాల్‌ని వెన్నంటింది. కల్నల్ దంపతులు కూడ తెరచాటు నుండి బయటకొచ్చి వాళ్ళననుసరించారు.

పిల్లి తిన్నగా వెళ్ళి జ్యోతి మంచం మీదికి దూకి, కూచుని గోపాల్‌ని చూస్తూ గుర్రు పెట్టింది. గోపాల్ కూడ దాని మీదకు దూకబోయాడు. ఇంతలో వెనుక నుండి తుపాకీ పేలిన శబ్దం విన్పించింది. భయంతో వణికిపోయాడు. సమయాన్ని చూసి, పిల్లి కూడ వాడి మీదికి దూకింది. గోపాల్ 'కెవ్వు'మని అరుస్తూ, పకపకమని విన్పించే నవ్వులకి వెనక్కి తిరిగి చూశాడు. ఎదురుగా జ్యోతి పిల్లి నెత్తుకొని నవ్వుతూ కన్పించింది. తుపాకీని మంచం మీదికి విసిరేస్తూ, గోపాల్‌ని చూసి "పిరికి" అంది.

"ఎవర్నువ్వు" అరిచాడు గోపాల్.

"ఇది మా ఇల్లు! నువ్వెవరివి! దొంగవా?" జ్యోతి మాటలు పూర్తికాకముందే కల్నల్ దంపతులు ఆ గదిలోనికి ప్రవేశించారు. గోపాల్ కల్నల్‌గారిని చూస్తూనే "డాడీ! డాడీ! ఈ అమ్మాయి" అంటూ టక్కున ఆగిపోయాడు—కల్నల్ గారిని గుర్తుపడుతూ పడుతూ మర్చిపోయినట్టుగా! ఏదో తెలీని అయోమయ అవస్థలో కొట్టుకుపోతున్నట్టుగా నెమ్మదిగా వెనక్కి అడుగులు వేశాడు.

కల్నల్‌గారు వాడి పరిస్థితిని గ్రహించారు. ప్రేమగా దగ్గరికి పిలిచి "భయపడకు బాబూ! ఇది నీ ఇల్లే" అన్నారు.

"కాదు! నేనెక్కడున్నాను? మా

నాన్నెక్కడ?"

"భయపడకు ! ఇలారా ! నీకేం కావాలి ! ఈ పిల్లి కావాలా?"

"వద్దు! నాకేం వద్దు !"

"నీ పేరేమిటిబాబూ !" కల్నల్‌గారు వాడిని తన చేతుల్లోకి తీసుకొంటూ అడిగారు.

"గోపాల్" వణుకుతోన్న పెదవుల్తో అన్నాడు.

"గోపాల్! చాలా బాగుంది" అంటూ శాంతీదేవి గోపాల్‌ని దగ్గరగా తీసుకొని నుదుట మీద ముద్దు పెట్టుకొంది. తల్లి ఆ కుర్రాణ్ణి అలా ముద్దు పెట్టుకోవడం జ్యోతికేమీ నచ్చలేదు. మొహం ముడుచుకొని బయటకు వెళ్ళబోయింది. కల్నల్ గారు వెళ్తూన్న జ్యోతిని ఆపి, గోపాల్ కేసి చూస్తూ - "జ్యోతి నీ చెల్లెలు! మీరిద్దరూ దెబ్బలాడుకోకూడదు!" అన్నారు.

గోపాల్ జ్యోతికేసి చూశాడు. జ్యోతి పిల్లిని చంకనెత్తుకొని మూతి తిప్పుకొంటూ అక్కణ్ణుంచి విసురుగా వెళ్ళిపోయింది.

గోపాల్‌ని తీసుకొని హాల్లోకి వచ్చారు కల్నల్‌గారు. అప్పటికే అక్కడ సూరజ్, సావన్‌లు కూర్చుని వున్నారు.

తండ్రిని చూస్తూనే గోపాల్ అతని దగ్గరికి పరుగెత్తాడు.

"నాన్నా! ఈయన చాలా మంచివాడు కదూ!" అన్నాడు.

"అయితే నీకు బాగా నచ్చారన్న మాట?" తండ్రి నవ్వుతూ అడిగాడు. అవునన్నట్టుగా గోపాల్ తలూపాడు.

"నాన్నా! నాకు తుపాకీ కావాలి" అన్నాడు.

"ఛీ! ఛీ! మంచి పిల్లలు అలాంటివి అడక్కూడదు"

"ఏం! ఎందుకడగకూడదు! నా దగ్గర తుపాకీ వుంటే అందర్నీ భయపెట్టొచ్చుగా!"

"ఎవర్ని భయపెడతావు?"

"ఆ కాలూగాణ్ణి, ఛబ్బన్‌గాణ్ణి"

"ఎందుకు"

"వాళ్ళేమో నా పావురాల్ని ఎత్తుకు పోతున్నారు. నేను తుపాకీ చూపిస్తే అంచక్కా పారిపోతారేం"

"ఎక్కడున్నాయి నీ పావురాళ్ళు"

"చూస్తావా నాన్నా!" అడిగాడు గోపాల్. వెంటనే బయట వరండాకేసి పరుగుతీశాడు. కల్నల్ దంపతులు విస్మయంతో చూస్తున్నారు. వాడికి తన పావురాళ్ళు, కాలూ, ఛబ్బన్‌ల పేర్లు, తన తుపాకీ, దాంతో ఇంట్లో అందర్నీ భయపెట్టడం - అంతా జ్ఞాపకం వుందన్న మాట!

హాల్లో నుండి బయటకొచ్చి, పావురాళ్ళని పట్టుకోడానికి కిటికీ పైకెక్కిన గోపాల్‌ని విచిత్రంగా చూస్తున్నారందరూ. ఆ రోజుల్లో జీవన్ కూడ అదే విధంగా పావురాల్ని పట్టుకొనే దృశ్యం కల్నల్ గారి కళ్ళ ముందు కదిలింది. శాంతీదేవి గోపాల్‌ని చూడమంటూ భర్తకు సౌంజ్ఞ చేయటం సూరజ్ గమనించి రహస్యంగా సావన్ భుజం తట్టాడు.

"సావన్" పిలిచారు కల్నల్‌గారు.

"బాబుగారూ"

"మా ఇంటి పక్కనున్న ఇంటిని నీ కోసం ఖాళీ చేయిస్తున్నాం"

"కాని బాబుగారూ..."

"కంగారు పడకు! మేం నీకు అన్ని సదుపాయాలూ కలగజేస్తాం ! నీకే ఇబ్బందీ వుండదు. సూరజ్ అన్ని

విషయాలూ మాతో చెప్పాడు"

"తమరు ప్రభువులు! నేను మీ సేవకుణ్ని" వినయంగా అన్నాడు సావన్.

అంతలో ఓ పావురాయిని పట్టుకొని పరుగెత్తుకొంటూ వచ్చి కల్నల్‌గారికి చూపిస్తూ- "డాడీ ఈ పా వు రా యి ని చూ..." అంటూ ఆగిపోయి కంగారుగా అక్కణ్నించి వెళ్ళిపోయాడు గోపాల్. అంతే కొద్దిదూరంలో పిల్లినెత్తుకొన్న జ్యోతి కన్పించింది. గోపాల్ భయంగా పావురాయిని గుండెకు హత్తుకుంటూ-

"నాన్నా పద! ఇక్కణ్నుంచి వెళ్లిపోదాం! లేకపోతే ఆ పిల్లి నా పావురాయిని తినేస్తుంది" అన్నాడు.

కల్నల్‌గారు తుపాకి తెచ్చి గోపాల్‌కిస్తూ "లేదుబాబూ! ఆ పిల్లి నీ పావురాళ్ళనేమీ చేయదు" అన్నారు. గోపాల్ సంకోచంగా తుపాకీ వైపూ, తండ్రి వైపూ మార్చి మార్చి చూశాడు. సావన్ తీసుకోమన్నట్టు తలాడించాక, కల్నల్‌గారి నుండి తుపాకి అందుకొన్నాడు.

సావన్ గోపాల్‌తో కలిసి కొత్త ఇంటికి బయలుదేరాడు. ఓ చేతితో పావురాయిని, మరో చేతితో తుపాకీని పట్టుకొని నడుస్తూన్న గోపాల్ వెనక్కి తిరిగి కల్నల్‌గారికేసి పదేపదే చూశాడు. జ్యోతి పక్కగా వెళుతూ నాలిక వెళ్ళబెట్టి ఆ అమ్మాయిని వుడికించాడు. కోపంతో వుడికిపోయింది జ్యోతి.

"పల్లెటూరి మొద్దు" కోపంగా అరిచింది.

కల్నల్‌గారు జ్యోతిని ఎత్తుకొంటూ "తప్పు! అలా అనకూడదు. అతనెవరో తెలుసా?" అనడిగారు.

"నీకు అన్నయ్య" శాంతీదేవి అంది.

జ్యోతికి తల్లి మాటలేమీ నచ్చలేదు. తండ్రినుండి విడిపించుకొని తన గదిలోకి



వెళ్ళిపోయింది. ఎందుకనో ఆ అమ్మాయికి గోపాల్ అంటే అదోలా వుంది.




బయటినుండి తిరిగివస్తూ కల్నల్‌గారు సావన్ ఇంటి దగ్గర్లో ఆగారు. ఇంట్లో నుండి గోపాల్ ఏడుపు విన్పిస్తోంది. ఒక్కక్షణం ఆలోచించి ఆయన ఇంట్లోకి ప్రవేశించారు.

ఎదురుగా వరండాలో నిల్చుని గోపాల్ ఏడుస్తున్నాడు. కల్నల్‌గారిని చూడగానే కళ్ళు తుడుచుకొంటూ ఆయన దగ్గరికివచ్చి సావన్‌మీద ఫిర్యాదు చేశాడు. కల్నల్‌గారు ఆప్యాయంగా వాణ్ని దగ్గరగా తీసుకొన్నారు. వాడి తల నిమురుతూ సావన్‌కేసి చూసి—

"వాణ్నెందుకు ఏడిపిస్తున్నావు" అనడిగారు.

"ఏం చేయను బాబుగారూ! వీడి కోరికలుచూడండి! ఇప్పుడేమోవాడికి నిక్కర్లు కావాల్ట! దొరబాబులా జుత్తుకత్తిరించాల్ట! వీడి బాబు గవర్నర్ అనుకుంటున్నాడేమో! ప్రాణాలు తోడేస్తున్నాడు."

"పిల్లాణ్ని బాధ పెట్టొద్దు! రా బాబూ! నేను కుట్టిస్తాగా నీకు నిక్కర్లు"

"జుత్తు కూడా బాబుగారూ!"

"తప్పకుండా! కాని, నువ్వు నన్ను 'బాబుగారు' అనకూడదు"

"మరి"

"'డాడీ' అని పిలవాలి"

"మీరు జ్యోతికి డాడీ కదా"

"నీక్కూడ! మీ ఇద్దరికీనూ! నాతో రా" కల్నల్‌గారు గోపాల్ చేయిపట్టుకొని వారి భవనంకేసి నడిచారు. అప్పటివరకూ వూపిరి బిగపట్టిన సావన్ సంతోషంగా నిట్టూర్చాడు. ఈ వయసులో తనకే చీకూ చింతా లేకుండా చేసి సుఖంగా కాలాన్ని వెళ్ళబుచ్చే యోగాన్ని కలగ జేసిన దేవుడికి మనసులోనే కృతజ్ఞతలు చెప్పుకున్నాడు. దేవుడు చల్లగా చూస్తే ఏదో ఒకరోజున గోపాల్ కల్నల్‌గారి యావదాస్తికీ వారసుడయిపోతాడు. తనకీ కష్టాలు లేకుండా పోతాయి.

కల్నల్‌గారు గోపాల్‌ని తన గదిలోకి తీసుకువచ్చి, మంచమ్మీద కూర్చోబెట్టారు.

"ఏం తింటావ్" అనడిగారు.

"నేనా"

"నువ్వే! భయపడకూడదు. మా బాబువి కదూ!"

"అయితే ఆపిల్ కావాలి"

"ఆపిల్" ఆ పేరు వింటూనే కల్నల్‌గారి మనసు చెదిరిపోయింది. జీవన్‌కు కూడా ఆపిల్ అంటే చాలా ప్రీతి. ఎప్పుడూ ఆ పళ్ళనే తినేవాడు. కల్నల్‌గారు వెంటనే జ్యోతి ఆయా రోజీని పిలిచి ఆపిల్ పళ్ళు పట్టుకురమ్మని ఆజ్ఞాపించారు. రోజీ ప్లేటులో పళ్ళు పెట్టి గోపాల్ ఎదురుగా టీపాయ్ మీద పెట్టింది. కల్నల్‌గారు తన కోటును స్టాండుకు తగిలిస్తూ—

"నువ్విక్కణ్నుంచి పారిపోతావా" అనడిగారు.

"ఊహుఁ! పారిపోను! నాన్న చెప్పినా వెళ్ళను."

"ఎందుకని"

"మీరంటే ఇష్టం! అందుకని"

"ఇంకా ఎవరెవరంటే నీకిష్టం?"

"మీరు ... మమ్మీ..."

"మరి జ్యోతి ?"

"ఆ పిల్ల అంటే నాకిష్టం లేదు"

"ఏం"

"నన్నెప్పుడూ పల్లెటూరి మొద్దూ అంటుంది. వెక్కిరిస్తుంది".

"సరే అయితే నేను కోప్పడతాలే"

"బాగా తిట్టండి డాడీ! నిన్ననేమో 'ఈ ఇల్లు నాది' అంది"

"నువ్వేమీ అనలేదా"

"అన్నాను. నీదికాదు, మా డాడీది, మమ్మీదని"

"శభాష్! బాగాచెప్పావు! ఈ సార డిగితే నీదేంకాదు నాదేనంటూ చెప్పాలి"

"ఓ! అలాగే కాని..."

"చెప్పు"

"నా బట్టలూ, జుత్తు చూసి పల్లెటూరి మొద్దు అంటుంది"

"అయితే చూడు! నిన్నిప్పుడే మార్చేస్తాను. దొరబాబులా తయారు చేస్తాను."

"అవును డాడీ ! నేనిప్పుడే బట్టలు మార్చుకొని వస్తానేం" అంటూ గోపాల్ కల్నల్‌గారి డ్రస్సింగ్ రూంలోకి పరుగు తీశాడు. జీవన్ బట్టలున్న బీరువా తెరచి అందులోని బట్టలు ఎంపిక చేస్తున్నాడు. అదే సమయానికి శాంతీదేవి ఆ గదిలోనికి వచ్చింది. బీరువా దగ్గర గోపాల్‌ని చూసి ఆశ్చర్యపోయింది. తమ జీవన్ వచ్చి అక్కడి బట్టలు చూస్తున్నట్టుగా భ్రాంతి కలిగిందామెకు.

గోపాల్ తనకు నచ్చిన బట్టల్నేరు కొని వెనక్కి తిరిగాడు. ఎదురుగా శాంతీదేవిని చూసి కంగారుపడ్డాడు. చేతుల్లోంచి బట్టలు జారి క్రింద పడ్డాయి. ఏదో తప్పు చేసిన వాడిలా, సిగ్గుపడుతూ నెమ్మదిగా బయటకు వెళ్ళబోయాడు గోపాల్.

కల్నల్‌గారు వాడి మనసులో చెలరేగే భావాల్ని అర్థం చేసుకొన్నారు. శాంతీదేవి వాణ్ణి దగ్గరగా తీసుకొంది.

కొన్ని క్షణాల తర్వాత గోపాల్ జీవన్ బట్టల్ని తొడుక్కొని ఆపిల్‌ని తింటున్నాడు. శాంతీదేవి వాడి తల నిమురుతోంది. అక్కడే సోఫాలో కూచుని వార్తా పత్రిక చదువుతూ అప్పుడప్పుడూ వారిద్దరికేసి ప్రేమగా చూస్తున్నారు కల్నల్‌గారు.

ఇంతలో జ్యోతి ఆ గదిలోనికి వచ్చింది. తనతల్లికి దగరగా గోపాల్ కూర్చోడం సహించలేక పోయింది,పిల్లిలా వాడి మీదికి దూక రక్కేద్దామన్పించిందా పిల్లకు గోపాల్ ఆమెను చూశాడు ఇద్దరి కళ్లూ కలుసుకొన్నాయి. ఆపిల్ తింటూ జ్యోతిన్ని వెక్కిరించాడు. జ్యోతి మరింతగా వుడుక్కొని అక్కణ్నుంచి వెళ్ళిపోవడానికి వెనక్కి తిరిగింది. అదిచూసి గోపాల్ గట్టిగా నవ్వాడు.జ్యోతి కోపంతో విసవిసా వెళ్ళిపోయింది. వాళ్ళిద్దర్ని చూసి కల్నల్‌గారు లోలోన నవ్వుకొన్నారు.

ఆ సాయంత్రం కల్నల్ దంపతులు స్నేహితుడింట్లో పెళ్ళికి బయల్దేరుతున్నారు. ఇంట్లో జ్యోతి ఒంటరిగా వుండిపోయింది. ఆయా రోజీ తప్ప, నౌకర్లు ఎవరూలేరు. వెళ్తున్నప్పుడు కల్నల్‌గారు గోపాల్‌తో గిల్లికజ్జాలు పెట్టుకోపదని జ్యోతికి చెప్పి మరీ వెళ్ళారు. గోపాల్ మంచి బట్టలేసుకొని, చక్కగా మాట్లాడితే జ్యోతి వాడితో కలిసిపోతుందని, ఆ తరువాత వాణ్ణి విడిచి వుండదని కల్నల్‌గారి వూహ! వాళ్ళు బయటికి

వెళ్ళిపోయాక జ్యోతి రోజీతో తన గది లోకి వెళ్ళిపోయింది.

ఇల్లంతా నిశ్శబ్దంగా వుంది. జ్యోతి కోసం చాలాసేపు చూస్చూసి ఆమె ఎంతకూ బయటికి రాకపోవడంతో గోపాల్ పాత ఇంటికి వెళ్ళిపోయాడు. ఇంట్లో సావన్ మంచంమీద పడుకొని వున్నాడు. పేరుకి కల్నల్‌గారు ఎనభై రూపాయల జీతం మీద అతన్ని నౌకరుగా వుంచారుగానీ రాత్రి పగలూ మంచం మీద పడి దొర్లటం తప్పించి మరో పని లేదతనికి.

అందమైన దుస్తుల్లో ఠీవిగా నిల్చునున్న గోపాల్‌ని చూసి సంతోషంగా మంచం



దిగి వాడికేసి నడిచాడు సావన్.

"నాన్నా! ఎలా వున్నాను?" తన కొత్తబట్టలకేసి చూసుకొంటూ అడిగాడు గోపాల్.

"అచ్చం దొర బాబులా వున్నావు. ఇలారా"

"రాను! నా బట్టలు నలిగిపోతాయి"

"మా నాన్నవి గదూ. నేను ముట్టుకుంటే బట్టలు నలిగిపోతాయా? సర్లే! మరి నాక్కూడా ఓ కొత్త జత కుట్టించు"

"అలాగే నాన్నా! కల్నల్‌గారితో చెప్తాను మా నాన్నకు్కూడ కొత్త బట్టలు కావాలంటూ"

"వద్దు బాబూ! ఆయనేమైనా అనుకొంటారు"

"మరెలా" అడిగాడు గోపాల్. అడుగుతూనే ఎందుకో గట్టిగా నవ్వాడు. ఆ నవ్వులు శూలాల్లా సావన్‌ని తాకి బాధ పెట్టాయి.

"నాన్నా" అన్నాడు గోపాల్ నవ్వడం ఆపేసి.

"ఏం?"

"ఇంట్లో ఎవరూ లేరు. కల్నల్‌గారు, మమ్మీ ఇద్దరూ..."

"ఎక్కడికి కెళ్లారు?"

"పెళ్ళికి"

"జ్యోతి...?"



"ఆ పిల్లి ఇంట్లోనే వుంది. అయినా ఫర్వాలేదులే"

"ఏం? ఏం చేద్దామని?"

"ఇదే మంచి సమయం! బీరువాలో ఎన్నో పళ్ళూ, మిఠాయిలూ వున్నాయి. తీసుకురానా నీ కోసం"

"ఎవరైనా చూస్తే"

"ఎవరూ చూడర్లే! ఇపుడే వచ్చేస్తాగా" అంటూ మెరుపులా అక్కణ్ణించి మాయమయ్యాడు గోపాల్. ఎవరికంటా పడకుండా కర్నల్‌గారి గదిలోనికి ప్రవేశించాడు. మరోసారి బయటకు తొంగి చూసాడు. చాలా మంచి సమయం! అయినా ఏదో తెలియని భయం వాణ్ణి అయోమయావస్థలో పడేసింది.

నెమ్మదిగా బీరువా దగ్గరికి వెళ్ళాడు. బీరువాలో పళ్ళూ, ఫలహారాల కేసి చూశాడు.

ఉదయమే కొన్ని పళ్లూ, మిఠాయీ తిన్నాడు. కాని దొంగిలించి తినేవాటిలో వున్న రుచి లేదు! వాడు మరోసారి అటూ ఇటూ చూసి ఎవరూ లేరని నిశ్చయించుకొన్నాక, చటుక్కున బీరువా తలుపుల సాయంతో పైకెగబ్రాకాడు. వణుకుతోన్న చేతుల్తో తినుబండారాల పళ్ళెన్ని తనకేసి లాక్కోబోయాడు. ఓ చేయి బీరువా తలుపుమీద వుంది. మరోచేయి తినుబండారాల పళ్ళెం మీదుంది. ఇంతలో "దొంగ, దొంగ" అంటూ గట్టిగా అరిచారెవరో. ఆ మాటలు వింటూనే గజగజలాడిపోయాడు. కాళ్ళు తడబడ్డాయి. 'ధబేల్'మని నేలమీద పడ్డాడు. పళ్ళు, తినుబండారాలూ 'దదదద'మంటూ వాడి నెత్తిన పడ్డాయి. కిలకిలమని ఎవరో నవ్వటం విన్పించింది.

గోపాల్ తలెత్తి చూశాడు. ఎదురుగా ద్వారం దగ్గర నిల్చుని చప్పట్లు కొడుతూ నవ్వుతోంది జ్యోతి. గోపాల్ సిగ్గుతో తలవంచుకొని లేవటానికి ప్రయత్నించాడు. దెబ్బ బాగా తగిలిందేమో లేవలేక పోయాడు. నిస్సహాయంగా ఆమెను చూస్తుండిపోయాడు.

"ఏమండీ దొంగగారూ! ఎలావుందీ?"

"ఫో! ఇక్కణ్ణుంచి"

"ఛీ! గట్టిగా అరవకు! ఎవరయినా రాగలరు"

అదే సమయంలో 'ఏమయిందంటూ' రోజీ వచ్చింది.

"ఏం లేదు! బీరువాలో పావురాళ్ళు పట్టుకోబోయాడు పాపం!"

"పావురాళ్ళా? బీరువాలోనా? మరెలా పడిపోయాడు?" రోజీ ఆశ్చర్యంగా అడిగింది.

"పిల్లి 'మ్యావ్' అంది అంతే! పిరికి పంద!" నవ్వుతూ చెప్పింది జ్యోతి—రోజీతో కలిసి పడిపోయిన వస్తువులు ఎత్తుతూ.

గోపాల్ అలాగే చతికిలబడి ఆలోచిస్తున్నాడు. జ్యోతి ముందు తను తలవంచుకోవలసిన స్థితి వచ్చినందుకు సిగ్గుగా వుంది వాడికి. జ్యోతికి మాత్రం గోపాల్ దొంగతనం చేస్తూ తనకు పట్టుబడటం చాలా ఆనందంగా వుంది. వాణ్ణి మరింతగా వుడికించొచ్చుననిపించింది.

"రోజీ! నువ్వు మరికొంచెం ముందు వచ్చివుంటే ఎంత మజాగా వుండేదో తెలుసా?" అంది జ్యోతి.

"ఎలా?"

"అయ్యగారు 'ధబేలు'మని ఇలా పడ్డాదో లేదో అలా బీరువాలోని ఆపిల్స్ అన్నీ ధడధడ'మని నెత్తిన పడ్డాయి. నువ్వు తప్పక చూసి తీరవలసింది".

ఆ ఎత్తిపొడుపుల్ని చూసి సహించలేకపోయాడు గోపాల్. కోపంతో ఆపిల్ పండును సూటిగా జ్యోతికేసి విసిరాడు. రోజీ, జ్యోతిని పక్కకు లాగింది. ఆపిల్ సూటిగా వెళ్ళి గోడకున్న ఫొటోకి తగిలింది. ఫొటోకున్న అద్దం 'భళ్లున' బద్దలయి నేల రాలింది. జ్యోతి మొహం తెల్లగా పాలిపోయింది. ఆ అమ్మాయి ఆశ్చర్యంగా గోపాల్‌ని చూసింది. వాడు లేచి నిల్చోడానికి ప్రయాస పడుతున్నాడు. రోజీ మౌనంగా నేలమీద రాలిన గాజు పెంకుల్ని తీస్తోంది.

హఠాత్తుగా జ్యోతి చూపు నేలమీది రక్తం మరకలపై పడింది. వెంటనే గోపాల్ నుదుటి మీదకి చూసింది. వాడి నుదుటి మీది గాయం నుండి రక్తం ధారగా ప్రవహిస్తోంది. జ్యోతి మనసుకేదో బలమైన దెబ్బ తగిలినట్లైంది. కంగారుగా ఏదో అనబోయింది. కాని, ఆ మాటలు ఆమె పెదవుల దగ్గరే ఆగిపోయాయి. గోపాల్ అతికష్టంమీద లేచి నిల్చుని ద్వారంకేసి నడిచాడు.

జ్యోతి ముందుకు నడిచి గోపాల్ చేయి పట్టుకొంది. "దెబ్బ తగిలిందా? ఎంత రక్తం!" అంది.

గోపాల్ ఆమె చేయి విదిలించేడు. అయినా జ్యోతి అడ్డుగా నిల్చుని—

"నేను నిన్ను వెళ్ళనివ్వను. డాడీ నన్ను కొడ్తారు!" అంది.

"అయితే అప్పుడు నేను నవ్వుతాను"

అంతే! జ్యోతి కళ్ళలో కన్నీళ్లు! ఆమె పాలబుగ్గలమీద కన్నీటి చారికలు! భయంతో అణువణువూ వణికిపోయింది జ్యోతి. గోపాల్‌కి తగిలిన గాయం చూసి రోజీ నీళ్ళు తేవటానికి బయటికి వెళ్ళింది. ఇంతలో జ్యోతి తననితాను సంబాళించుకొని తన చిన్న రుమాల్తో వాడి గాయాన్ని తుడిచింది. తర్వాత నెమ్మదిగా—

"గోపాల్" అని పిలిచింది.

"ఊఁ"

"డాడీతో చెప్తావా?"

"చెప్తాను! నిజంగా చెప్తాను! నువ్వు నన్ను భయపెట్టి పడేశావు. డాడీ నిన్ను కొట్టాలి. నేను నిన్ను చూసి నవ్వాలి"

"అయితే వెళ్లు! చెప్పుకో నాకేం భయంలేదు" జ్యోతి కోపంగా రక్తం మరకలున్న రుమాల్ని విసిరేసి, ముక్కుపుటాలు పొంగిస్తూ బయటకు వెళ్ళిపోయింది.

నీళ్ళు, దూది, గుడ్డ తీసుకొని లోనికి వస్తోన్న రోజీ జ్యోతిని ఆపబోయింది. కాని, జ్యోతి కోపంగా బయటకు చూసుకుపోయింది. "తనంటే జ్యోతికి ఎంత భయం!" అనుకొన్నాడు గోపాల్.

రాత్రి కల్నల్ దంపతులు తిరిగొచ్చేసరికి జ్యోతి భయంతో తన గదిలోనే వుండిపోయింది. కల్నల్‌గారు ఒకటి రెండుసార్లు పిలిచినప్పటికీ బయటకు రాలేదు. రోజీని అడిగితే ఆమె గోపాల్ పడిపోయిన విషయం వివరించింది. వెంటనే గోపాల్ని పిలిపించారు. వాడు నుదుటిమీద గాయానికి కట్టిన గుడ్డతో భయపడుతూ వచ్చాడు. జ్యోతి పిల్లిలా తన గదినుండి భయంగా బయటకొచ్చి వాళ్ళ మాటలు వింటోంది. తను గోపాల్ని భయపెట్టి పడవేసినట్టు డాడీకి తెలిసిపోతుంది! డాడీ తనని కొడతాడనుకొంది. కాని, దెబ్బెలా తగిలిందని కల్నల్‌గారు అడిగినప్పుడు—

"తుపాకీకోసం బీరువా ఎక్కాను!

కాలు జారింది." అన్చెప్పాడు గోపాల్.

వాడి నోటంట ఆ అబద్ధాలు వింటూనే జ్యోతి కంగారు పడింది. కాని, వెంటనే సంతోషించింది-తన పేరు చెప్పనందుకు. ఆమెకు తెలుసు వాడు నిజం చెప్పడని! నేరం వాడిది! దొంగ! దొంగ నిజం చెప్పలేడుగా మరి!

* * *

"పిలిచారా బాబుగారూ!"

"అవును సావన్! రా!"

"చెప్పండిబాబుగారూ"అంటూ సావన్ చేతులు జోడించి అక్కడే నేలమీద కూచున్నాడు. వార్తా పత్రిక చదువు తూన్న ఆయన దృష్టి సావన్‌కేసి మళ్లిస్తూ-

"జ్యోతిని పట్నం పంపిస్తున్నామన్న విషయం నీకు తెలుసనుకొంటాను" అన్నారు.

"చిత్తం"

"పిల్లల అభివృద్ధికోసం వాళ్లని ఒకో సారి వదులుకోవాల్సొస్తుంది"

"చదువుల కోసం ఏమైనా చేయాల్సొం టుంది బాబుగారూ!"

"ఈ వూళ్లో సరయిన స్కూలులేదు"

"నిజమే బాబూ!"

"అందుకే మనస్సు రాయి చేసుకొని జ్యోతిని పట్నంలో వదలి రావడానికి వెళ్తున్నాను"

"ఎప్పుడు బాబుగారూ?"

"బహుశా ఈ ఆదివారం కావచ్చు! మీ గోపాల్ని కూడా అక్కడ మంచి స్కూల్లో చేర్పిస్తే బాగుణ్ను!"

"వద్దు బాబుగారూ! పేదవాళ్ళం తట్టుకోగలమా?"

"ఆ భయంవద్దు! వాడి ఖర్చులన్నీ మేం చూసుకొంటాం"

"డబ్బు విషయం కాదు బాబుగారూ! వాణ్ని వదిలి వుండలేను"

"అదేమిటి! ఇప్పుడే కదా అన్నావు-చదువులకోసం ఎంతబాధన్నా భరిం చాలని. మరి నేను మా అమ్మాయి నొదలి వుండటంలేదా?"

"తమరు గొప్పవారు బాబుగారూ! చదువు సంధ్యలు తమలాటివారికి. మాక్కాదు. వాడు నా కళ్ళముందే వుండాలి."

కల్నల్‌గారు సావన్ కెంతో నచ్చ జెప్పారు. కాని, అతని మనసుకు అదేమీ పట్టలేదు. తన కొడుకు తననుండి విడి పోయాక మారిపోవచ్చు! తనని మరచి పోవచ్చునేమో కూడా! డబ్బుమీదే మన సున్న సావన్‌కు కొడుకుని దూరం చేసు కోవటమన్నది భయంకరంగా వుంది.

సూరజ్ ముందుగానే ఆ విషయాలన్నీ సావన్‌కి చెప్పేడు. కల్నల్‌గారు చెప్పి నట్టు చెయ్యొద్దని హెచ్చరించాడు కూడా. జ్యోతి వెళ్ళిపోయాక కల్నల్‌గారు కూతురు కోసం తపించే సమయంలో వారి మనసుకు శాంతి నిచ్చేది గోపాల్ ఒక్కడే! ఏదో ఓ రోజున వాడు వారి మనస్సు నాక్రమించాలి. ఆయన వాణ్ని తమ కొడుకుగా స్వీకరించి ఆస్తిపాస్తులు వాడికే రాసివ్వాలి.

కల్నల్‌గారి సలహా నిరాకరించి ఇంటికి తిరిగి వస్తూన్న సావన్ తనలో తను బాధపడ్డాడు. కల్నల్‌గారి సలహాను తృణీకరించి తను తప్పుచేయలేదుకదా? అయినా సూరజ్‌కు ఇష్టంలేని పని తను చేయలేదు! భారంగా అడుగులు వేస్తూ ఇంటికి చేరుకొన్నాడు సావన్. అప్పటికే అక్కడున్న సూరజ్ విచారంగా వున్న తమ్ముణ్ని చూసి భుజం తట్టాడు.

"ఏమయింది" అని అడిగాడు.

"ఒప్పుకోలేదు"

"మంచి పన్చేశావు !

"కాని అన్నా నా మనసేమిటో అదోలా వుంది"

"ఏం"

"ఎండమావులకు ఆశపడుతూ పిల్లవాడి జీవితంతో ఆడుకుంటున్నామేమో నన్పిస్తూంది. వాడు చదువుకొని మనిషైతే బాగుణ్ణనిపిస్తోంది"

"కాస్త నిల్చోటానికి నీడ దొరికే సరికి ఇలా తయారయ్యావన్నమాట"

"నన్నపార్థం చేసుకోకన్నయ్యా ! నా మనసులోని మాట చెప్పాను అంతే ! లేకుంటే ఆయన సలహా కాదని రాగలనా ?"

"ఆలోచించు ! డబ్బుంటే అంతా వున్నట్టే. చదువుకొని ఏం సాధించాలి. డబ్బుంటే పెద్ద పెద్ద వాళ్ళు సైతం మన కాళ్ళ దరికే వస్తారు"

"నీకెలా మంచిదని తోస్తే అలా చెయ్యి. వాణ్ణి నీకే అప్పగించాను"

సమాధానంగా సూరజ్ ఏదో చెప్ప బోయాడు. ఇంతలో గోపాల్ లోపలికి పరిగెత్తుకుంటూ వచ్చి "నాన్నా ! నాన్నా ! డాడీ పట్నం వెళ్తున్నాడు" అన్నాడు.

"అయితే"

"నన్ను కూడా రమ్మంటున్నారు"

"నువ్వేమన్నావు?"

"వస్తానన్నాను"

"వద్దుబాబూ ! పట్నం మంచిది కాదు. అక్కడి మనుషులు మంచివాళ్ళు కాదు"

"జ్యోతి వెళ్తోందిగా మరి"

"ఆమెను అక్కడ స్కూళ్ళో వదిలేస్తారు. స్కూల్లో ఎప్పుడూ చదువుకొంటూ వుండాలి. ఎప్పుడూ దెబ్బలు తింటూ వుండాలి. మాట్లాడడానికెవరూ వుండరు. బయట తిరగడానికి వీలుండదు"

"ఎందుకలా"

"ఏ పిల్లలయితే అల్లరిచేసి అమ్మనీ, నాన్ననీ కష్టపెడతారో వాళ్ళని పట్నం స్కూల్లో వదిలేస్తారు. నువ్వెప్పుడూ అల్లరి చేయవు కదా ! మరి నువ్వెందు కెళ్ళాలి పట్నం?"

"అవున్నాన్నా! నేను వెళ్ళను. వెళ్తే కొడతారు. తిడతారు. షికార్లుండవు. అందుకే నేనసలు వెళ్ళనే వెళ్ళను"

"అసలు వెళ్ళకూడదు. పట్నం చాలా చెడ్డది" అంటూ ప్రేమగా వాడి తల నిమిరాడు. తర్వాత నవ్వుతూ "జ్యోతి మంచిదికాదు కదూ !" అన్నాడు సావన్.

"ఛీ! దాని వూసెత్తకు. అది పిల్లి"

"అదీ! ఇప్పుడు జ్యోతి పట్నం వెళ్ళి పోతుందికదు ! ఇక నీదే రాజ్యం ! నీక్కావలసినవన్నీ నువ్వు తీసుకోవచ్చు. నౌకర్లందరూ నువ్వంటే భయపడతారు"

"అవున్నాన్నా నిజమే ! అప్పుడు మజాగా వుంటుంది. పెదనాన్నలా దొర బాబునైపోతాను"

"పెదనాన్నలా ఏం ఖర్మ ! కల్నల్ బాబువే అయిపోతావు" అంటూ సూరజ్ వాణ్ణెత్తుకొని తేలికపడిన మనసుతో నవ్వాడు. గోపాల్‌కి పెదనాన్న మాటలు బాగా నచ్చాయ్. జ్యోతి వెళ్ళిపోయాక ఆ ఇంటికి తనే రాజు! పెదనాన్న దగ్గర ఆ రోజునుండి పాఠాలు నేర్చుకోడానికి తయారయ్యాడు. జీవన్‌గా మారిపోవ డానికి ఎలా ప్రవర్తించాలో నూరిపోయటమే గోపాల్‌కి సూరజ్ చెప్పే పాఠాలు.

ఆ సాయంత్రం అందరూ కూచుని

జీ తీసుకొంటున్న సమయంలో, చేతిలో తుపాకీతో పరుగెత్తుకొంటూ వచ్చాడు గోపాల్. తుపాకీ ఓ మూలకి విసిరేస్తూ" డాడీ: డాడీ! పావురం" అంటూ అరిచాడు.

"రా బాబూ! జీవన్" శాంతీదేవి అప్రయత్నంగా అందా మాటల్ని. జీవన్ పేరు విన్నాక గోపాల్ ఆశ్చర్యపోవడంకాని, తొట్రుపాటు పడటంకాని జరగలేదు. రెక్కలు కొట్టుకుంటూ గాయపడిన పావురాయిని కల్నల్‌గారి చేతుల్లో పెట్టి "డాడీ! దీన్ని పట్టుకోండి. నేనిప్పుడే వస్తాను" అన్నాడు.

కల్నల్‌గారు పావురాయిని పట్టుకొన్నాక వాడు పరుగెత్తి ఎదురుగా వున్న కిటికీ దగ్గరికి వెళ్ళాడు. కిటికీ పైకెక్కి ఏదో వెతకబోతున్నాడు. తల్లికి అర్థమయింది-వాడు అక్కడే పెట్టిన గాలి పటాల దారంకోసం వెతుకుతున్నాడని. వెంటనే లేచి ఆమె లోపలికి వెళ్ళి దారపుండ తెచ్చి ఇచ్చింది. అది ఒకప్పుడు జీవన్ ఆ గూట్లో దాచిన దారపుండ!

తల్లి చేతుల్లో దారపుండను చూసి గోపాల్ కిందకి చూకాడు. దారం తీసుకొని పావురాయి కాలికి కట్టాడు. కల్నల్ గారు ఆశ్చర్యంగా వాణ్నే చూస్తున్నారు.

"డాడీ! మరికాస్త గట్టిగా పట్టుకోండి! లేకపోతే ఎగిరిపోతుంది" పావురాయిని కట్టిపడేశాక వాడు బయటికి పరుగెత్తుకుంటూ వెళ్ళిపోయాడు. అందరూ ఆశ్చర్యంగా వాణ్నే చూస్తున్నారు. సూరజ్ అక్కడే వుండి ఏవో కాగితాలు చూస్తున్నట్టుగా చూస్తూ గోపాల్ నటనా చాకచక్యాన్ని గమనిస్తూనే వున్నాడు. దాంతో పాటే కల్నల్ దంపతుల మొహాల్లో కన్పించే భావాల్ని చదవటానికి ప్రయత్నిస్తున్నాడు.

"సూరజ్" కల్నల్‌గారు పిలిచారు.

"బాబుగారూ" ఆయన దగ్గరగా వచ్చి నిల్చొన్నాడు సూరజ్.

"ఆనాటి సాయంత్రం నీకు జ్ఞాపకం వుందా?"

"జ్ఞాపకం వుంది బాబుగారూ! ఆ రోజు చినబాబుగారు కూడా ఇలాగే పావురాయిని పట్టుకొని పరుగెత్తుకుంటూ వచ్చారు"

"ఆ దారపుండ ఎక్కడ పెట్టిందీ వాడి కింకా జ్ఞాపకం వుంది" అంది శాంతీదేవి.

"అసలు ఈ రోజు నేను ఆశ్చర్యపోయానంటే నమ్ముతారా బాబుగారూ!"

"ఏమయింది?"

"ఉదయం నేను ఇంటినుండి బయల్దేరుతున్న సమయంలో గోపాల్ నా దగ్గరిగా వచ్చాడు. వస్తూనే 'సూరజ్ బాబాయ్! పిన్ని ఏదీ?' అనడిగాడు"

"నువ్వేమన్నావ్"

"పుట్టింటి కెళ్ళిందని చెప్పాను"

"నమ్మేశాడా ?"

"నమ్మాడు. పిన్ని పుట్టింటి నుండి రాగానే తనకు చెప్తే ఆమె చేత కచోడీలు చేయించుకుని తింటానన్నాడు"

"వాడికింకా జ్ఞాపకముంది. పాపం బతికుండే రోజుల్లో కచోడీలు చేసి వాడి చేత తినిపించేది" శాంతీదేవి నిట్టూర్చింది.

"సూరజ్! గోపాల్ని దత్తత తీసుకోవాలని వుంది. అందుకు సావన్ అంగీకరిస్తాడా" అనడిగారు కల్నల్.

సూరజ్ మనసు ఆనందంగా గంతులేసింది. అయినా ఆనందాన్ని దాచుకుంటూ "ఆ ఆలోచన మంచిదే కాని బాబుగారూ! ఇంత త్వరలో మంచిదికాదని నా అభిప్రాయం"

"ఎందుకని ?"

"ఆకల్తో వున్నవాడు మనం వడ్డించే తీరు చూసి మరింతగా వడ్డించమనొచ్చు"

"అంటే"

"ఆ పని నాకొదిలేయండి ! తమరు



మాత్రం పిల్లాణ్ని మచ్చిక చేసుకోండి. తమరి మమతానురాగాలు మిగతా పని పూర్తి చేస్తాయి"

"దేవుడి చేష్టలు ఎవరికీ అర్థంకావు కదా ! మన దగ్గర్నుంచి లాక్కొని ఆ నిరుపేదకు వాణ్నందించాడు చూశావా?"

"అయినా ఆ భగవంతుడు అన్యాయం చేయలేదు బాబుగారూ! తన తప్పు తెలుసుకొనే ఇదంతా జరిపిస్తున్నాడు"

"నిజమే" శాంతీదేవి నవ్వుతూ అంది.

జ్యోతి వెనకవైపు వరండాలోనికి వచ్చింది. తోటలో గోపాల్ పావురాళ్ళతో ఆడుకుంటున్నాడు. వాటితోపాటు ఆ చుట్టుపక్కల పిల్లలు, నౌకర్ల పిల్లలు కూడా చేరి గంతులేస్తున్నారు. జ్యోతికి గోపాల్ పద్ధతేమీ నచ్చలేదు. నచ్చకపోవడానికి కారణం ఆమె ఒంటరిగా మిగిలిపోవడమే !

ఆమెతో ఆడుకోవడానికి ఎవరూ లేరు. అదీకాక, ఆ అమ్మాయికి తక్కువ స్థాయి వారితో ఆడుకోవడం ఇష్టంగా వుండదు. అలా ఆడుకోవటం అవమానంగా భావిస్తుంది.

పావురాళ్ళ కాళ్ళకు తాళ్ళు కట్టి, వాటిని గాలిపడగల్లా ఎగరేస్తున్నాడు గోపాల్. అవి అలా ఎగిరేసరికి కేకలు వేస్తూ వాటి వెనుకే పరుగెడుతోంది మూక! వరండాలో మౌనంగా నిల్చొన్న జ్యోతిని చూసి ఆడుకొందికి పిలిచాడు గోపాల్. కాని, జ్యోతి మూతి మూడు వంకర్లు తిప్పి, తల విసుచుకొంటూ లోనికి వెళ్ళిపోయింది. ఆమె గోపాల్ని అసహ్యించుకొంటున్నా గోపాల్ మాత్రం ఆమెతో స్నేహం చేయడానికి ప్రయత్నిస్తున్నాడు. ఆటకని పిలిస్తే జ్యోతి మొహం తిప్పుకొని వెళ్ళిపోవడం వాడికి కోపం తెప్పించింది. అయినా గోపాల్ విచారించలేదు. వాడితో ఆడుకొనేందుకు చాలా మంది స్నేహితులున్నారు.

పావురాయితో ఆట ముగిసింది. గోపాల్ కత్తెరతో పావురాయి రెక్కలు కత్తిరించి గింజలు తినిపించాడు. తర్వాత వరండాలో వున్న గూట్లో వదిలి పెట్టాడు. ఆ గూట్లో మరికొన్ని పావురాలున్నాయి. అవన్నీ మొదట్లో ఈ కొత్త పావురంలా అవస్థ పడినవే!

ఆటపాటలయ్యాక ఇంట్లో కొచ్చాడు గోపాల్. జ్యోతి తన కొత్త పుస్తకాలకి అట్టలు వేసుకొంటోంది. గోపాల్ బీరువాలోంచి ఒక ఆపిల్‌పండు తీసుకొని గబగబా తినబోయాడు. జ్యోతి తనకేసి చూసేసరికి వెకిలి నవ్వు నవ్వి—

"తింటావా?" అనడిగాడు.

జ్యోతి మాట్లాడలేదు. మౌనంగా తనపని చేసుకొంటోంది. గోపాల్ దగ్గర్లో వున్న కుర్చీలో కూర్చొని ఆపిల్ కొరుకుతూ, కొన్ని క్షణాల తర్వాత "అన్నట్టు పిల్లిగారు పట్నం వెళ్తున్నార్ట" అన్నాడు. జ్యోతి వాడి కొంటె మాటలకు జవాబియ్యలేదు. వాడు మళ్ళీ—

"ఉదయం, సాయంత్రం చదవటం తప్ప, నీకు ఆడుకోవాలని అన్పించదా" అనడిగాడు. అప్పటికీ జ్యోతి సమాధానం ఇవ్వక మౌనంగానే వుంది. అది చూసి గోపాల్‌కి భలే కోపం వచ్చింది. ఆపిల్‌ను గట్టిగా జ్యోతికేసి విసిరికొట్టాడు.

"ఏమిటిది?" అంది కోపంగా తగిలిన దెబ్బకి జ్యోతి.

"పిల్లి నిద్రపోతూందేమో అనుకున్నాను"

"లేకపోతే పిరికి పావురాయిలా జాగ్రత్తగా వుండాలా?"

"జాగ్రత్త లేకపోతే ఎలా! పావురం కళ్ళు మూసుకొనుంటే నీలాంటి పిల్లి పీక పట్టుకోదూ"

"ఎప్పుడూ పిల్లే! ఏమిటి నీ గోల"

"మరి నన్ను పావురాయి అంటా వెందుకు?"

"నువ్వు నిజంగా పావురాయివే! పిరికి కదా!"

"నువ్వు కూడా పిల్లిలా జిత్తుల మారివి. కుళ్ళుమోతువి" గోపాల్ మాటలకి జ్యోతికి కోపం వచ్చింది. చేతిలోని పుస్తకం వాడికేసి విసిరికొట్టింది. వాడు తప్పుకోవడంతో పుస్తకం సూటిగా వెళ్ళి గోడకు గుద్దుకొని కిందపడింది. దాని కుట్లు తెగి కాగితాలు చెల్లాచెదురయినాయి. గోపాల్ నవ్వుతూ బయటికి పారిపోయాడు. జ్యోతికి తిక్కరేగినట్టుగా వుంది. తను కొట్టిన దెబ్బ వృథాఅయింది.

పైగా పుస్తకం చిరిగింది.

కొద్ది రోజుల్లో పట్నం వెళ్తోంది తను! కొత్తవూరు, కొత్త మనుషుల్ని చూస్తుంది. అందువల్ల చాలా సంతోషంగా వుంది. ఇంకా, గోపాల్ తనతో రావట్లేదు. వాళ్ళ నాన్న వాణ్ని బోర్డింగ్‌లో జాయిన్ చేయడానికి అంగీకరించలేదు. అందువల్ల మరీ సంతోషంగా వుందా పిల్లకు. తను వెళ్ళిపోయాక తన ఆట సామాన్లన్నీ వాడు కాజేస్తాడేమో! ఆ ఆలోచన వచ్చిందే తడవుగా జ్యోతి లేచి తన ఆట వస్తువుల్ని తీసి బీరువాలో పెట్టి తాళం వేసింది.




ఆ రోజు జ్యోతి పట్నం వెళ్తోంది. కల్నల్‌గారు ఆమెను అక్కడ వదిలి వస్తారు. ఆయనకి బాధగా వున్నా పైకి వుదాసీనంగానే కన్పిస్తున్నారు. కాని, మిగతా వాళ్ళు మాత్రం బెంబేలు పడు తున్నారు. ఆ అమ్మాయిని చాలా కాలం పాటు వదిలి వుండాలంటే అందరికీ వేదనగానే వుంది. జ్యోతిని విడిచి వుండ లేనంటూ శాంతీదేవి బాధపడుతున్నా కల్నల్‌గారు పట్టించుకోనట్లే వున్నారు. జ్యోతి బంగారు భవిష్యత్తు కోసం ఇవన్నీ సహించక తప్పదు.

గోపాల్ గురించి కూడా ఆయన ఆలోచించారు. కాని,వాడి స్వభావం వేరుగా వుంది. వాణ్ని బలవంతంగా తీసుకు వెళ్తే సావన్‌లో మార్పు రావచ్చు. అప్పుడు అతను తన కొడుకును 'జీవన్' ఆత్మను తీసుకొని అక్కణ్నుంచి వెళ్ళిపోవచ్చు. వారి మీద తనకెటువంటి అధికారం లేదు గదా మరి!

జ్యోతి నవ్వుతూ వచ్చి జీపులో కూచుంది. తల్లి కళ్ళలోంచి నీళ్ళూరాయి. అయినా వాటిని కన్పించనీయకుండా నవ్వు పులుముకొందామె. సూరజ్, సావన్, రోజీలతో సహా నౌకర్లందరూ జ్యోతికి వీడ్కోలివ్వటానికి జీపు దగ్గరికి వచ్చారు. గోపాల్ మాత్రం ఆ చుట్టుపక్కల ఎక్కడా లేడు. జ్యోతి వెదికింది. తను వెళ్ళిపోవటం గోపాల్‌కేమీ అన్పించటం లేదా? వాడు రానందుకు జ్యోతికి మనసులో బాధగా వుంది. ఏడ్చింది. ఆ కన్నీళ్ళను మరోలా అర్థం చేసుకొన్న శాంతిదేవి కూతుర్ని హృదయానికి ఆప్యాయంగా హత్తుకొంది.

కల్నల్‌గారు గోపాల్ కోసం వెతికించారు. కాని ఎక్కడా వాడి జాడలేదు. సమయం మించిపోతోంది. ఆయన జీపును పోనిచ్చారు. జ్యోతి వెళ్ళిపోతోందని తెలిసి కూడా గోపాల్ ఎక్కడికి వెళ్ళిపోయాడు అనేదే ఆయన ఆలోచన.

అలా జీపు కదిలిందో లేదో ఎవరో గట్టిగా అరిచారు. అందరూ ఆశ్చర్యంతో అటు చూశారు. జీపుకు ఎదురుగా గోపాల్ పరుగెత్తుకొంటూ వచ్చాడు. జ్యోతి కళ్లల్లో మెరుపు, పెదవుల మీద చిన్నగా నవ్వు. గోపాల్ చేతిలో పావురాయి వుంది. వాడు దగ్గరకు రాగానే కల్నల్‌గారడిగారు–"ఇప్పటివరకూ ఎక్కడున్నావు?"

"తోటలో! పావురాయిని తీసుకు రావాలని..."

"ఇప్పుడు దాంతో ఏం పని?"

"జ్యోతి కోసం డాడీ ! పట్నంలో ఒంటరిగా వుంటోంది కదా ! దీంతో ఆడుకొంటుంది" వాడలా అమాయకంగా అనేసరికి అంతా పకపకా నవ్వారు. వాడు బాధపడకూడదని, జ్యోతి ఆ పావు రాయిని తన చేతుల్లోకి తీసుకొంది.

"గోపాల్! అమ్మ మాట వింటూ జాగ్రత్తగా వుంటావ్ కదూ ! నేను రెండ్రోజుల్లో తిరిగొస్తాను" కల్నల్‌గారు గోపాల్ని హెచ్చరించారు.

"అలాగే డాడీ! తొందరగా వచ్చేయండి"

"చూడు సావన్! నీ కభ్యంతరం లేకుంటే గోపాల్ని అమ్మగారి దగ్గరే పడుకోనియ్! ఒంటరిగా ఆమెకు పూసు పోదు" జీప్ స్టార్ట్ చేస్తూ సావన్‌తో అన్నాడు.

"ఎంతమాట బాబుగారూ ! వాడు తమ పిల్లాడే అనుకోండి".

జీపు గేటు దాటిపోయింది. భారంగా అడుగులువేస్తున్న శాంతీదేవి చేయిపట్టుకొని ఆమెతో పాటు లోనికి నడిచాడు గోపాల్. ఆ దృశ్యాన్ని చూసి సూరజ్, సావన్‌లు నవ్వుకొంటూ వెళ్ళిపోయారు. జ్యోతి వెళ్ళిపోయాక భవంతి అంతా బావురుమంటూ నిశ్శబ్దంతో మునిగిపోయింది.

రాత్రి భోజనాలయ్యాయి. శాంతీదేవి గదిలో జ్యోతి మంచంమీద పడుకున్నాడు గోపాల్. శాంతీదేవి వాడి పక్కన కూర్చుంటూ—

"గోపాల్! మీ అమ్మ నీ కెప్పుడయినా జ్ఞాపకం వస్తుందా?" అనడిగింది.

"నా చిన్నప్పుడే మా అమ్మ దేవుడి దగ్గరకు వెళ్ళిపోయిందిగా"

"పోనీ ! ఆమె ఎలా వుంటుందో గుర్తుందా ?"

"లేదు ! కాని, ఇపుడేమన్పిస్తూం దంటే..."

"ఏమన్పిస్తోంది"

"మా అమ్మ అచ్చం మీలాగే వుండేదని..."

"నిజంగానా ?"

"నిజమే! ఆ నుదుటిమీది మచ్చ..."

"చెప్పు! ఆగిపోయావేం"ఉత్సుకతతో ఆమె మరింత దగ్గరగా జరిగింది.

"అచ్చు అలాంటి మచ్చ మా అమ్మ నుదుటిమీద కూడా వుండేది. ఓసారేమో మా అమ్మకూ, నాకూ దెబ్బలాటయింది."

"ఊఁ"

"నాకేమో కోపం వచ్చి కర్ర తీసుకొని అమ్మను కొట్టేశాను"

"ఆ తర్వాత"

"అమ్మకు దెబ్బ తగిలింది. బాగా రక్తం కారింది"

"నిజం!"

"అపునమ్మా ! ఆరోజు నేను ఎన్ని దెబ్బలు తిన్నాననుకొన్నావ్"

"ఎవరు కొట్టారు నిన్ను"

"ఏమో ఎవరో తెలీదు. బాగా కొట్టారు నన్ను. నేను భయంతో రెండు రోజుల వరకూ చుట్టాల ఇంట్లో దాక్కొన్నాను"

వాడి నోట ఆ మాటలు వింటూనే శాంతీదేవి ప్రేమగా, ఆర్తిగా వాడిని తన హృదయానికి హత్తుకుంది. ఆ నాడు 'జీవన్' కోపంతో తనని కర్రతో కొట్టిన దృశ్యం ఆమె కళ్ళముందు కదలాడింది. ఆనాటి ఆ గాయం మానిపోయింది. కాని, హృదయానికి తగిలిన 'జీవన్ మృత్యువు' అనే గాయం మాత్రం నేటి వరకూ పచ్చిగానే వుంది. కన్న కొడుకును కోల్పో

యిన ఆమె మనో ప్రపంచం శూన్యంగా వుంది. జ్యోతి పుట్టాక ఆమెకు కాస్త స్వాంతన చిక్కినట్టనిపించినా, 'ఆడపిల్ల పరాయిసొత్తు. ఆమె అత్తారింటికి వెళ్ళాక మళ్ళీ తనకు మిగిలేది శూన్య ప్రపంచమే' నన్పించింది.

ఇప్పుడు—

గోపాల్ మాటలు విన్నాక ఆమెకు తమ జీవన్ చనిపోలేదనీ, ఇప్పుడు తన దగ్గరే కూర్చుని కబుర్లు చెపున్నాడనీ అనిపించింది. గోపాల్ ఆమెలో నిద్రపోతున్న మాతృత్వాన్ని మేల్కొలిపాడు. ఆమె గుండెల్లో ఒదిగి పడుకొని వాడేదో ఆలోచిస్తూనే వున్నాడు. ఆమె దీపం ఆర్పేసి పడుకొంది. నలువేపులా చీకట్లు కమ్ముకున్నాయి. కాని ఆమె మనసులో మాత్రం చీకటిలేదు. గోపాల్ ఆమె మనసును వెలుగుతో నింపేశాడు.

ఆమె పక్కనే పడుకున్న గోపాల్ తొలిసారిగా మాతృత్వంలోని మాధుర్యాన్ని చవిచూశాడు. తన అవాస్తవికమైన నట జీవితంలోని 'వాస్తవికత' కళ్ళకు కన్పించింది. వాడికి వూహ కలిగినప్పట్నుంచీ తల్లి ప్రేమంటే ఏమిటో తెలీదు. కల్నల్‌గారి భార్య మమకారంలో తల్లి ప్రేమను చవిచూశాక వాడికి తన దొంగ బతుకు మీద అసహ్యం వేస్తోంది. తను దొంగ. మోసగించడానికొచ్చాడు.

ఆ వూహ రాగానే వాడు గజగజ వణికిపోయాడు. భయంతో గుండె గబగబా కొట్టుకోసాగింది. అక్కణ్ణుంచి లేచి, పారిపోవాలన్పించింది. కాని, ప్రేమ పూరితమైన రెండు చేతులు వాణ్ణి బంధించాయి. శాంతీదేవి వాణ్ణి తమ జీవన్‌గా భావించి ఎక్కడో తప్పిపోయిన కొడుకు తిరిగి దొరికినట్టు ఆర్తిగా తన లోకి పొదుపుకొని ప్రేమ పంచిఇస్తోంది.

కాని, గోపాల్ పిరికివాడు! దొంగ! పావురాయిలా కళ్ళు మూసుకొని, ప్రాణాలు గుప్పిట పట్టి నిద్ర నటిస్తున్నాడు. వాడి బుర్రలో ఎన్నో ఆలోచనలు చెలరేగుతున్నాయి. కాని, వాడి పసి మనస్సుకు అదేమి అర్థం కావట్లేదు. మనస్సంతా చీకటితో నిండిపోయింది. వెలుగు రేఖలు ప్రసరించే అదృష్టం లేదు. ఆ అంధకారంలో ఏదో వెతుక్కోవాలి! ఎవరినో గుర్తుపట్టటానికి ప్రయత్నించాలి. తన కన్నతల్లి జ్ఞాపకం వస్తోంది. కాని, ఎంత ప్రయత్నించినా ఆమె రూపం గుర్తుకు రావట్లేదు. ఏదో చెప్పలేని బాధ పీడిస్తోంది.

శాంతీదేవి సరళ స్వభావం, ధర్మ చింతన గల స్త్రీ! పూజలు, పునస్కారాలంటే ఆమెకు ప్రీతి! గోపాల్ తమ వద్దకు చేరడంతో—దేవుడు తన మొరవిని తమ జీవన్‌ని తమవద్దకు చేర్చాడని నమ్మింది. తమ కోరిక సఫలమయినందుకు ఆ దేవునికి పెద్ద ఎత్తున పూజ చేయాలని సంకల్పించింది. దానివల్ల జీవన్ పునర్జన్మ విశేషం కూడ వూళ్ళో అందరికీ తెలుస్తుంది. కల్నల్‌గారు ఉండగా అటువంటివి జరగడానికి వీల్లేదు. ఆయనొప్పుకోరు! ఇప్పుడాయన ఇంట్లోలేరు. మంచి సమయం.

పూజ విషయం క్షణంలో వూరంతా పాకింది. కీర్తనలు పాడేవారూ, భజనలు చేసేవారూ క్షణంలో సిద్ధమయ్యారు. స్త్రీ, పురుషులు గుంపులుగా పోగయ్యారు. వాళ్ళందరికీ పునర్జన్మ ఎత్తిన కుర్రాణ్ణి చూడాలని ఆసక్తిగా వుంది.

శాంతీదేవి గోపాల్‌కు కొత్త జరీ బట్టలు కట్టబెట్టింది. గది మధ్యలో కుర్చీమీద

కూచోబెట్టింది. ఎవరి దిష్టీ తగలకుండా వాడి బుగ్గన నల్లని కాటుక చుక్క పెట్టింది. వాడిని చూట్టానికి వచ్చినవాళ్ళు కానుకలుగా రకరకాల వస్తువులు తెచ్చారు. ఆ పూజ చేయాలని శాంతీదేవి ఎన్నోసార్లు కల్నల్‌గారికి విన్నవించుకొంది. ఆయన అంగీకరించలేదు. ఆ విషయాలన్నీ తమ వరకే వుండాలని ఆయన వుద్దేశ్యం! కాని, శాంతీదేవి వుద్దేశ్యం వేరు. ఆ విషయం వూళ్ళో వాళ్ళందరికీ తెలియాలి! వూళ్ళోని స్త్రీలు పదేపదే గదిలోనికి వచ్చి గోపాల్ని ఆశ్చర్యంగా చూస్తున్నారు. వాడికదంతా విచారంగా వుంది. విసుగ్గా కూడ వుంది. కాని, చుట్టూ పోగవుతున్న రకరకాల బహుమతులు చూస్తూ ఓర్పు తెచ్చుకొంటున్నాడు. కొందరు స్త్రీలు వాణ్ణో అవతారంగా భావిస్తూ పాదాలు ముట్టుకొంటున్నారు.

సూరజ్ కూడ అమ్మగారి బలహీనతను తమకు అనువుగా మలచుకొన్నాడు. గోపాల్‌కు జీవన్‌లా నటించడానికి తగు శిక్షణనిస్తూ ఎన్నో విషయాలు నూరి పోస్తున్నాడు.

రెండు రోజుల తర్వాత కల్నల్‌గారు జ్యోతిని స్కూల్లో చేర్చి వచ్చారు. సావన్ అంగీకరిస్తే గోపాల్ని కూడ చేర్పించి వుండేవారే. అదే ఆయన మనసులో వెలితిగా వుంది. ఆ విషయాన్నే భార్యతో చెప్పే–

"మీరు కూడ పనికిరాని ఆలోచనలు చేస్తారన్నమాట" అంది.

"పనికిరానివా ! అంటే వాడు జీవితాంతం పల్లెటూరివాడిలానే బతకాలంటావా?"

"అక్కర్లేదు! మన స్కూలు హెడ్మాష్టరున్నారు? ఆయనే రోజూ వచ్చి వాడికి పాఠాలు చెప్తారు"

"ఆ చదువుతో వాడికేం జ్ఞానం వస్తుందని"

"మనం వాణ్ణి డాక్టర్ని చేయాలా? లాయర్ని చేయాలా? పెద్దవాడయితే వూళ్ళోనే వుంటూ పొలం పన్లవీ చూస్తాడు. మీకప్పుడు విశ్రాంతి దొరుకుతుంది. జ్యోతి సంగతంటే వేరు"

"అదేమిటి"

"ఆడపిల్ల పరాయిదే ఎప్పటికైనా"

మర్నాడు మాష్టారొచ్చారు. గోపాల్‌కి చదువుకోవాలని లేదు. అయినా పుస్తకాలు పెట్టుకొని చదవడానికి ప్రయత్నిస్తూనే వున్నాడు. వాణ్ణి చూస్తూంటే కల్నల్ దంపతులకు చూడముచ్చటగా ఉంటోంది.

సావన్, సూరజ్‌లకు కావలసింది కూడా అదే. జ్యోతి పెద్దదయ్యేలోగా గోపాల్ కల్నల్ దంపతులతో బాగా కలిసి పోవాలి. వాడితో వాళ్ళకి పాలూ, నీళ్ళలా విడదీయరాని బంధమేర్పడాలి. వాణ్ణి వాళ్ళు దత్తత చేసుకోవాలి! సావన్‌కు ఇప్పుడు చాలా ఆనందంగా వుంది. పనీ పాటూ లేకుండానే నెలనెలా జీతం వస్తోంది. కల్నల్‌గారు అతనికేమీ ఇబ్బంది జరక్కుండా సదుపాయాలు సమకూరుస్తున్నారు. అంతకంటే ఇంకేం కావాలి?

* * *

రోజులు గడుస్తున్నాయి.

నెలలు సంవత్సరాలుగా మారాయి. గోపాల్ యవ్వనంలోకి ప్రవేశించాడు. ఇప్పుడు క్షణం కూడా కల్నల్‌గారిని వదలి వుండలేడతను. సభలూ, సమావేశాలూ, ఉత్సావాలూ, వేడుకలూ, భూవసతుల బాగోగులూ చూడటం ఒకటేమిటి? కల్నల్‌గారు ఎక్కడ వుంటే

అక్కడే గోపాల్ అంటిపెట్టుకొని వుంటున్నాడు. కాలంతో పాటు వాడి ఆలోచనలలో కూడా చాలా మార్పువచ్చింది. కల్నల్ దంపతులకు మానసికంగా చేరువయ్యాడు. ఇప్పుడతనికి సావన్, సూరజ్‌లంటే ఏవగింపూ, అసహ్యం! అయినా తను వాళ్ళ చెప్పు చేతుల్లో వున్నాడు. వాళ్లు తలుచుకుంటే ఏం చేయటానికైనా సమర్థులు! ఆ భయంతో వాళ్ళ మాటలన్నిటికీ తలూపుతున్నాడతను.

గోపాల్ తన పాతజీవితాన్ని పూర్తిగా మరిచి, కల్నల్ దంపతుల్నే తల్లిదండ్రులుగా భావిస్తూ మసల్తున్నాడు. తన భావాల్ని అదే విధంగా ప్రకటిస్తున్నాడు. కల్నల్‌గారికి ఇప్పుడు చాలా సంతోషంగా వుంది.

కాని...

ఉత్తములయిన ఆ దంపతుల్ని మోసగించటం గోపాల్‌కి బాధగావుంది. అతని అంతరాత్మ అతన్ని నిలదీస్తోంది. సత్యాసత్యాల, న్యాయాన్యాయాల విచారణలో మునిగి పోతున్నాడతను. ఒకోసారి ఒంటరిగా కూర్చొంటూ మనసు తేలికపడే వరకూ ఏడుస్తున్నాడు.

ఆరోజు పెదనాన్న సూరజ్ తమ ఇంటికి వచ్చినప్పుడు తనని పరిశీలనగా చూసి, ఆలోచనలో పడిన ఘట్టం– ప్లాన్ చేసిన నాటకం గుర్తుకొచ్చింది గోపాల్‌కి.

* * *

"అన్నయ్యా! నువ్వు అదృష్టవంతుడివి! హాయిగా బతుకుతూ ఎంతో కొంత వెనకేసుకొంటున్నావు. మరి నేనో! నాకున్న ఆస్తల్లా వీడే! వీడు భూమ్మీద పడుతూనే తల్లిని మింగాడు. పొలం పుట్రా సర్వనాశనమైంది" అని వాపోయాడు.తన తండ్రి సావన్ – ఆరోజు చుట్టం చూపుగా వచ్చిన పెదనాన్న సూరజ్ దగ్గర.

"ఛా ల్లే పసిపిల్లలముందు నోటికొచ్చేదంతా వాగేకు! సూరజ్ తమ్ముణ్ణి మందలించాడప్పుడు. ఆప్యాయంగా తన తల నిమురుతూ – "బాబూ! నువ్వేం చదువుకొంటున్నావు'' అనడిగాడు.

"పన్నెండేళ్ళు నెత్తిమీదికొచ్చాయి. రెండవ తరగతి కూడా కాదు ఇంకా అ ఆలు చదువుతున్నాడు" అన్నాడు తండ్రి కోపంగా.

"మరైతే నాన్నా! నువ్వింత పెద్ద వాడివి కదా! మరి ఒకటోతరగతి కూడ చదవలేదేం" అనడిగాడు గోపాల్.

"నోర్మూయ్" కోపంగా అరుస్తూ గోపాల్‌కేసి చూశాడు సావన్.

"తప్పు బాబూ! మంచి పిల్లలు అలా పెద్దవాళ్ళను ఎదిరించి మాట్లాడకూడదు" ప్రేమగా గోపాల్‌తో అంటూ తమ్ముడికేసి చూసి నవ్వాడు సూరజ్.

"చూశావా అన్నయ్యా! ఇలాంటి వాణ్ణి నేనేం చేసుకోను? తెల్లారింది మొదలు సాయంత్రం వరకూ వూపిరి సలప నివ్వడనుకో!... అలా గుడ్లు మిటకరిస్తూ నిల్చున్నావేంరా? వెళ్ళి పెదనాన్నకు షర్బత్ కలిపి తీసుకురా" గోపాల్ని కసిరాడు సావన్.

"ఇప్పుడే తెస్తాను నాన్నా" గోపాల్ బయటికి పరుగు తీశాడు.

సావన్ అన్నకోసం పొగాకుతో చుట్ట నింపి ముట్టించి ఇచ్చాడు. అది అందుకొని "ఇంత పెద్దవాడయ్యాడు. కనీసం రెండవ తరగతన్నా కాదన్న మాట" అన్నాడు.

"అదే గొప్పనుకో! రోజస్తమానం గాలిపటాలెగరేయడం, ఆడటం, ఎవరితో

పడితే వారితో తగవులూ తంటాలూ... మొన్న ఒకసారి కోమటి కొట్లోంచి అర్ధ రూపాయి దొంగిలించాడు"

"అయితే మరేం దొంగకూడానన్న మాట" అన్నాడు సూరజ్. వెంటనే మళ్ళీ "బాధపడకు తమ్ముడూ! కుర్రాడు చురుకైనవాడు" అన్నాడు.

"నా దౌర్భాగ్యం! నీకంతగా నచ్చితే నీతో తీసుకుపోరాదూ! నీకు తోడుగానూ వుంటాడు. ఆ జమీందార్ల లోగిట్లో కనీసం రెండు పూటలా తిండైనా తింటాడు" అన్నాడు.

సూరజ్ ఆలోచనలో పడ్డాడు. చాలా సేపటి తర్వాత అకస్మాత్తుగా అన్నాడు "సరే! నీ కొడుకుని నాకిచ్చేయ్"

"నీకెందుకూ?"

"నాకిచ్చేయ్! నీ అదృష్టాన్ని బాగు జేస్తాను."

"అయితే వీణ్ణి పెంచుకొంటానంటావా?" అంటూన్న సావన్‌కి వూరుకోమంటూ సైగ చేశాడు సూరజ్. షర్బత్ కలుపుతూన్న గోపాల్ని చూశాడు.

"నేను పెంచటం ఏం ఖర్మ! జమీందార్లే పెంచుకొనేలా చేస్తాను" అని సూరజ్ స్వరం తగ్గించి సావన్ చెవిలో ఏదో వూదాడు. గోపాల్ షర్బత్ కలుపుతూ కళ్ళ చివర్ల నుండి వాళ్ళిద్దర్నీ గమనిస్తూనే వున్నాడు. ఆ ఇద్దరూ తర్వాత గుసగుసలాడ్డం వాడికి చిత్రమన్పించింది. ఇద్దరూ తన గురించే ఏదో మాట్లాడుకొంటున్నట్టూ, ఇద్దరూ ఏకమై ఏదో కుట్ర పన్నుతున్నట్టూ వాడికన్పించింది. కాని వాడి పసి మనసుకు అదేమిటో అంతు చిక్కలేదు.

హఠాత్తుగా అన్నదమ్ములు ఇద్దరూ నవ్వుకొన్నారు. గోపాల్ తుళ్ళిపడ్డాడు. వాళ్ళ నవ్వు విద్యుత్ ఘాతంలా తగిలి శరీరం కంపించింది. షర్బత్ గ్లాసు పెదనాన్నకి అందిస్తూంటే నవ్వు కట్టిపెట్టేసి ఆప్యాయంగా తనకేసి లాక్కొన్నాడు గోపాల్ని.

"బాబూ! నీకు నాన్న బావుంటాడా? నేను బాగుంటానా?" అనడిగాడు.

"నువ్వే బావుంటావు పెదనాన్నా"

"ఎందుకని"

"నాన్నేమో పంచెలు చుట్టుకొంటాడు. మురికిగా వుంటాడు. నువ్వయితే ఎంచక్కా దొరలా వుంటావు. అందుకే వీథిలోని కుర్రాళ్ళందరూ నన్నడుగుతుంటారు"

"ఏమని?"

"మీ పెదనాన్న ఎక్కడ పనిచేస్తున్నాడని"

"నువ్వేం చెప్పావు?"

"కల్నల్ దొరగారి బంగ్లాలో పన్చేస్తున్నావని చెప్పాను"

"వూ! అయితే నువ్వు కూడ దొరబాబు కావాలనుకొంటున్నావా?"

"కావాలనే వుంది! వీథిలో అందర్నీ ఏడ్పించాలనీ వుంది"

"అయితే ఒక పని చేయాలి"

"ఏమిటి"

"మీ నాన్న ఎలా చెపితే అలా చేయాలి"

"మరి..."

"దెబ్బలాటలూ, కొట్లాటలూ కాపు! తెలివితేటలతో పని"

గోపాల్‌కేమీ అర్థం కాకపోయినా తల వూపేశాడు. అన్నదమ్ములిద్దరూ ఒకరి భుజమ్మీద ఒకరు చేయి వేసుకొని బయటకు పోతూంటే ఆశ్చర్యంగా చూస్తూండి



పోయాడు. వాళ్ళు వెళ్ళిపోయేక గోపాల్ అలాగే నిల్చుని పెదనాన్న తననెలా మార్చివేస్తాడా అని చాలాసేపు ఆలోచించాడు.

అద్దంలో తన మొహాన్ని చూసుకొని చిందర వందరగా వున్న జుత్తుని దొరబాబులా సవరించుకుంటూ 'తనిక దొరబాబయిపోతాడు. చేతిలో క్రర పట్టుకొని ఠీవిగా నడుస్తాడు. ఇక చూస్కో నా సామిరంగా తననే అందరూ చూస్తారు' అనుకొంటూ మెడ నిక్కించి అద్దంలోనికి చూసుకుంటూ వెనక్కీ, ముందుకూ నడిచాడు.

"గోపాల్" గోపాల్ ఆలోచనల తీగ తెగిపోయింది. అద్దంలో తండ్రి కన్పించాడు. కంగారుగా వెనక్కి తిరిగాడు. తండ్రి ముఖంలో ఎప్పుడూ వుండే కోపానికి బదులు ఆనందం వాడికి స్వాగతం పలికింది. తండ్రి ముందుకు అడుగువేసి తనని హృదయానికి హత్తుకొన్నాడు. గోపాల్ తండ్రిని కౌగిలించుకున్నాడు. ఎప్పుడూ తనని హింసించే ఆ తండ్రి చేతులు ఈరోజు ఆప్యాయంగా తనని పెనవేసుకోవటంతో పెదనాన్న ఏ మంత్రం వేసుంటాడా అని తెగ ఆలోచించాడు.

ఆనాటి ఆ ఆలోచనకప్పుడు జవాబు దొరకలేదుగాని ఈనాడిలా కథ మాత్రం

నడుస్తోంది.

* * *

"మిస్ జ్యోతి"

"ఎస్ మేడమ్"

"మీ నాన్నగారొచ్చారు"

"ఎక్కడ?" ఉత్సాహంతో అడిగిన జ్యోతికి వరండావైపు చూపించింది వార్డెన్. కారిడార్‌లోంచి విజిటర్స్ రూం లోనికి వచ్చింది జ్యోతి. తనకోసం సోఫాలో కూర్చుని ఎదురుచూస్తున్న తండ్రిని చూడగానే పరుగున వెళ్ళి ఆయన్ని కౌగిలించుకుంది. ఫోర్త్‌ఫాం చదువుతోంది జ్యోతి.

"మమ్మీ రాలేదా" అనడిగింది.

"లేదు" అన్నారు కల్నల్‌గారు. అప్పటికే జ్యోతి చూపులు ఆశ్చర్యంగా అక్కడే కుర్చీలో కూర్చున్న గోపాల్ని తాకాయి. అతను చూయింగ్ గమ్ నములుతూ జ్యోతికేసి చూసి నవ్వాడు. నవ్వి నెమ్మదిగా "జ్యోతీ! నేకూడా వచ్చాను చూశావా?" అన్నాడు. అంటూనే ఓ పాకెట్ ను అందించాడామెకు.

"ఏమిటిది?" అడిగింది జ్యోతి.

"టాఫీ" నవ్వుతూ అన్నాడు గోపాల్. జ్యోతి పాకెట్టు అందుకుంది. డాడీకేసి తిరిగి–

"డాడీ! మా క్లాస్‌మేట్స్‌ను పరిచయం చేస్తాను రండి" అంది.

కల్నల్‌గారు జ్యోతితో కలిసి వరండాలోనికి వెళ్లారు. చూయింగ్ గమ్ నములుతూ వాళ్ళననుసరించాడు గోపాల్. అతనలా నములుతూంటే అతని నోరు తెరుచుకుంటూ, మూసుకొంటూ గమ్మత్తుగా వుంది. జ్యోతికి నవ్వొస్తోంది. కాని నవ్వటం సభ్యత కాదని వూరుకొంది. వారికి ఎదురుగా వార్డెన్ వస్తూ కన్పించింది. జ్యోతి ఆమెను కల్నల్ గారికి పరిచయం చేసింది. వార్డెన్ గోపాల్‌కేసి చూసి "మీ అన్నయ్యా! పరిచయం చెయ్యవా?" అంది. జ్యోతి ముఖం తిప్పుకొంది. కల్నల్‌గారు నవ్వుతూ– "ఇద్దరికీ పడదు" అన్నారు.

"అదే మంచిది! చిన్నప్పుడు ఎంతగా కీచులాడుకొంటే పెద్దయ్యాక అంతగా కలసిమెలసి వుంటారంటారు"

వార్డెన్ మాటలకు అంతా నవ్వుకొన్నారు. తండ్రిని హాస్టల్ చూపించడానికి అనుమతి కోరింది జ్యోతి. ముగ్గురూ హాస్టల్ చూడ్డానికి వెళ్తూంటే గదుల్లోని అమ్మాయిలు కొందరు కిటికీల్లోంచి వాళ్ళని కుతూహలంగా చూశారు. జ్యోతి తన స్నేహితురాళ్ళని కల్నల్ గారికి పరిచయం చేసింది. ఆ చిన్ని ప్రపంచం చూసి కల్నల్‌గారు చాలా సంతోషించారు. ఆయనకు తన చిన్ననాటి రోజులు జ్ఞాపకం వచ్చాయి. ఆయన గోపాల్‌కేసి చూసి "ఎలావుంది" అనడిగారు.

"బాగుంది" అన్నాడు గోపాల్.

"అంతేనా! ఇంకేం అన్పించటం లేదా?"

"అతనికేం తెల్సు డాడీ! చదివుంటే తెలిసుండేది" మూతి తిప్పుతూ అంది జ్యోతి.

"నిజమే! సావన్ ఒప్పుకునుంటే నువ్వు కూడా హాయిగా ఇలాగే చదువుకొనుండేవాడివి" బాధగా అన్నారాయన.

ఆ మాటలు బాణాల్లా గోపాల్ హృదయాన్ని తాకాయి. అప్పటికప్పుడే తన రహస్యాన్ని కల్నల్‌గారికి విప్పిచెప్పి తండ్రి కాదన్నా ఏదేని బోర్డింగ్ స్కూల్లో

చేరిపోవాలనిపించింది. కాని, నిజానిజాలు తెలిస్తే బోర్డింగ్‌స్కూల్లో కాదు కదా— వీధి కుక్కని తరిమేసినట్టు తరిమేస్తారని అంత సాహసం చేయలేకపోయాడు.

చాలామంది అమ్మాయిలు కామన్ రూంలో తాడు, క్యారమ్స్, పింగ్‌పాంగ్ ఆడుతూ, పత్రికలు, పుస్తకాలు చదువుతూ కాలక్షేపం చేస్తున్నారు. మరి కొంతమంది మరో మూల ఏదో నాటకం రిహార్సల్స్ వేస్తున్నారు. ఆ వాతావరణం కల్నల్ గారికి బాగా నచ్చింది. తర్వాత జ్యోతిని బయటకు తీసుకుపోయి రెస్టారెంట్‌లో ఐస్ క్రీం తినిపించారు. స్కూలు వాతావరణం నుండి ఇలా బయటపడటం జ్యోతికి థిలేగా ఉంది. గోపాల్‌కి పట్నం అందాలు చూడముచ్చటగా వున్నాయి.

తండ్రి జ్యోతిని తిరిగి హాస్టల్లో విడిచి వెళ్ళిపోయాక ఆమె మనసులో ఏదో తెలీని బాధ చోటు చేసుకొంది. స్నేహితురాళ్లు చుట్టూ చేరి ఏవేవో ప్రశ్నలు వేశారు. ఓ అమ్మాయి జ్యోతి చేతిలోని 'తాఫీలు' లాక్కొంది. అవి అందరూ పంచుకు తిన్నారు. తల్లి జ్ఞాపకం వచ్చింది జ్యోతికి. రెండు కన్నీటి చుక్కలు రాలిపడ్డాయి. శూన్యం లోనికి చూస్తూ ఆలోచనల్లో మునిగి పోయింది.

గంట కొట్టిన శబ్దం విని త్రుళ్ళి పడింది. భోజన సమయం! ఆకలి వేయటం లేదు. గంట 'గణ గణ' మంటూంటే అమ్మాయిలందరు బిలబిల మంటూ డైనింగ్ రూంకేసి పరుగుతీశారు. జ్యోతి మాత్రం భోజనానికి వెళ్ళలేదు.

* * *

కాలం గమ్యం లేని మార్గంలో పరుగుతీస్తూనే వుంది. భూమి విశ్రాంతి లేకుండా తిరుగుతూనే వుంది. రోజులు నడుస్తున్నాయి. రుతువులు మారుతున్నాయి. గడుస్తూన్న ప్రతి క్షణం, ప్రతి నిముషం జ్యోతిలో మార్పుల్ని సంతరిస్తున్నాయి.

ఆమె మనసు ఒకే విషయం మీద లగ్నమయి వుంది. బాగా చదవాలి! ఫస్టు క్లాసులో పాసు కావాలి! అదే ధ్యేయం! శెలవుల్లో ఇంటికి వెళ్తే వెళ్ళేది. లేకపోతే వాళ్ళే వస్తే కలిసేది. ఎవరూ రానప్పుడు మాత్రం మనసు చాలా చీకాగ్గా అన్పించేది కాని, ఆ చిరాకును బయటకు ప్రదర్శించేది కాదు. ఆమె పల్చటి, మృదువైన పెదాలపై ఎప్పుడూ చిరునవ్వు తొణికిసలాడుతూనే వుండేది.

ఒకసారి శెలవుల్లో జ్యోతి ఇంటికి రాకపోతే కల్నల్‌గారు గోపాల్ని వెంట తీసుకొని వచ్చారు. మాటల్లో గోపాల్ అడిగాడు.

"మన వూరికి ఎప్పుడొస్తావు జ్యోతీ" అంటూ.

"మన వూరికా? నేన్రాను" అంది జ్యోతి.

"ఏం" ఆశ్చర్యపోయాడు గోపాల్

"చెప్తే బాధపడ్తావు!"

"నేనలాటివాణ్ని కాను! చెప్పు"

"చెప్పేదా"

"ఊఁ"

"నువ్వా వూళ్ళో వుంటే నేనసలు రాను అంతే!" నవ్వుతూ అంది జ్యోతి. గోపాల్ని ఆటపట్టించడం ఆమెకు సరదా! ఆ మాటలు విన్నాక గోపాల్ పైకేమీ అనకపోయినా, మనసులో మాత్రం బాధ పడ్డాడు. ఆనాటినుండి కల్నల్‌గారితో పట్నం రావడం మానుకొన్నాడు. కల్నల్

గారొక్కరే పట్నం వస్తున్నారు. వచ్చినప్పుడల్లా జ్యోతి అడిగేది—

"గోపాల్ రాలేదా" అంటూ.

"లేదు"

"ఏం ?"

"రాత్రీ పగలూ వాడికి తీరిక లేకుండా వుంది. నా పనన్నీ వాడే చూసుకొంటున్నాడు"

అతను వచ్చినప్పుడు తను మాట్లాడేది కాదు. మాట్లాడినా పుల్ల విరుపుగా మాట్లాడేది. ఇప్పుడతనురాకపోతే అతని గురించే మాట్లాడుతోంది. అందుకు కారణమేమిటో ఆమెకి అంతుపట్టలేదు.

జ్యోతి బియ్యే చివరి సంవత్సరంలోని కొచ్చింది. పరీక్షలయ్యాయి. తండ్రి రాక కోసం చూస్తోంది. ఆ రోజు మధ్యాహ్నం అక్కడికి చేరుకుంటానని టెలిగ్రాం ఇచ్చారు కల్నల్‌గారు. ఆమె సామానన్నీ ఓ మూల ప్యాక్‌చేసి వున్నాయి. పుస్తకాల బీరువా ఖాళీగా వుంది. ప్రతిరోజూ శ్రద్ధగా సర్దే ఆ గది – ఆ రోజు చిందరవందరగా వుంది. తండ్రి కోసం ఎదురు చూస్తూనే ఆమె కళ్ళు మూతలుపడ్డాయి. పరీక్షల్లో నిద్రలేదు! తల మీది నుండి ఆ బరువు కాస్తా తీరిపోయేసరికి ఎక్కడలేని నిద్ర ముంచుకొస్తోంది. ఎవరో గట్టిగా కుదిపితే కళ్ళు తెరిచింది. ఎదురుగా స్నేహితురాళ్ళు కన్పించారు. "ఏమయింది" ఆశ్చర్యంగా అడిగింది వాళ్ళని.

"అక్కడ మీ డాడీ నీ కోసం ఎదురు చూస్తున్నారు త్వరగా లే"

"డాడీ వచ్చేసారా?!" ఆమె తడబడుతూ లేచి పిచ్చిదాన్లా పరుగుతీసింది. ఆయన్ని చూస్తూనే ఆయన మెడచుట్టూ చేతులు వేసింది. ఆమె తల నిమురుతూ కల్నల్‌గారు—

"పరీక్షలు ఎలా రాశావు" అనడిగారు.

"ఫస్టుక్లాసొస్తుంది డాడీ"

"అయితే ఆ రోజుకోసం ఎదురు చూస్తుంటాం" డాడీ మాటలు విన్పించుకోలేదామె. "మరెవరూ రాలేదా?" అనడిగింది.

"నువ్వడిగేది గోపాల్ గురించేనా?"

"కాదు! మమ్మీ..."

"నువ్వెలాగూ వచ్చేస్తున్నావు కదా మరి తనెందుకు!"

"మరి గోపాల్"

"అతనికి తీరికలేదు."

"ఎక్కడయినా పనిచేస్తున్నాడా?"

"ఆఁ"

"ఎక్కడ?"

"నా దగ్గరే! జమిందారీ గొడవలన్నీ అతనే చూసుకొంటున్నాడు. అన్నట్టు మాటల్లో పడిపోయాంగాని లే! సాయంత్రానికి ముందుగానే ఇంటికి చేరుకోవాలి"

సామాన్లు జీపులో పెట్టించి, తండ్రితో పాటు జీపులో కూచున్న జ్యోతి—

"ఈ ముసలి బండిని వదిలిపెట్టరా డాడీ" అనడిగింది.

"పల్లెటూళ్ళో ఈ బళ్ళు వుపయోగపడినట్టుగా కొత్త బళ్ళేవీ పనికిరావమ్మా"

"ఏం పనికొస్తుంది డాడీ ! రంగు, రూపం అన్నీ మారిపోయాయి. పార్ట్సు అన్నీ పనికిరాకుండా పోతున్నాయి. దీంట్లో కూచోడానికే సిగ్గేస్తోంది"

"అయితే నేను కూడా ముసలివాణ్ణి అయిపోతున్నానుగా ? రేపు నన్ను కూడ..."

"అదేమిటి డాడీ అలా అంటారు! నేను జీపును గురించి మాట్లాడుతుంటే" అంటూ తండ్రిని ప్రేమగా తనకేసి లాక్కొంది.

"డాడీ ! కొత్త కారు కొంటానని మాటిచ్చారు"

"అవును! కాని, ఓ షరతు పెట్టాను జ్ఞాపకం వుందా?"

"షరతు పూర్తయిందిగా! నేను పరీక్షలు రాసేశాను"

"ఇంకా పరీక్షా ఫలితాలు రావాలిగా"

"అంటే నేను ఫెయిల్..."

"అనెవరన్నారు"

ఇద్దరూ నవ్వుకొన్నారు. వాళ్ళతో పాటు తనూ నవ్వుతున్నట్టుగా జీపు ఎగిరి పడింది. వాళ్ళ నవ్వులు ఆగిపోయాయి. గతుకుల బాట! జీపు పాతది!



4

పన్నెండేళ్ళ తర్వాత జ్యోతి తన చదువు పూర్తి చేసుకొని ఇంటికి తిరిగి వచ్చింది. శెలవుల్లో ఎన్నిసార్లు వచ్చినా చుట్టుపక్కల వాతావరణం పరిశీలించే తీరిక వుండేదికాదు. చదువుకునేందుకు సమయం చాలేదికాదు. ఈసారి ఇంటికి వస్తూనే ఆమెకు అంతా కొత్తగా అన్పించింది. తన చేతుల మీదుగా నాటి నీరు పోసిన చిన్న చిన్న మొక్కలు ఇప్పుడెంతో పెద్దవి అయినాయి. వాటి కొమ్మల మీద పక్షులు గూళ్ళు కట్టుకొన్నాయి. చుట్టుపక్కల పొలాల్లో వరిచేలు నాట్యం చేస్తున్నాయి.

తన చిన్ననాటి విషయాలు జ్ఞాపకం వస్తున్నాయి. అపుడు డాడీ ఆ పాడుబడిన భూమి సంతటినీ బాగుచేయాలని ఆలోచిస్తుండేవాడు... అలా ఆలోచిస్తూ ఆమె నెమ్మదిగా గదులన్నింటినీ పరికిస్తోంది. వంటయింట్లో మమ్మీ భోజన వ్యవహారాలు చూస్తోంది. ప్రయాణంలో అలసిపోయిన డాడీ విశ్రాంతి తీసుకొంటున్నారు.

గోపాల్ని చూడాలని ఆమెకు ఆత్రంగా వుంది. కాని అతను ఏదో పనిమీద ఎక్కడికో వెళ్లాడు. ఆరోజు – 'నువ్వావూళ్ళో లేకపోతేనే నేనొస్తాను' అన్నాక అతను జ్యోతిని ఎక్కువగా కలుసుకోలేదు. బహుశా ఆ మాటలు అతని మనసులో బాగా నాటుకొని వుంటాయి. గోపాల్ని గురించి తండ్రిని అడగాలనుకొంది. కాని సంకోచంతో ఆగిపోయింది. డాడీకి సంబంధించిన వ్యవహారాలన్నీ అతనే చూసుకొంటున్నాడు. మునుపటిలా తనతో గిల్లిగజ్జాలు పెట్టుకొంటాడా?

ఆమెకు అతని విషయాలు ఎవరు చెప్తారు? ఇటువంటి సమయంలో రోజీ వుంటే ఎంత బాగుండేది! అతని గురించే ఆలోచిస్తూ గోపాల్ గదిలోనికి ప్రవేశించిందామె.

గదిలో వస్తువులన్నీ చిందరవందరగా పడివున్నాయి. బట్టలన్నీ గోడలకూ, తలుపులకూ వేలాడుతున్నాయి. దుమ్ము కొట్టుకుపోయిన జోళ్ళు బీరువాలో మూలుగుతున్నాయి. కోటు నేలమీద దొర్లుతోంది. ఫ్లవర్ వేజ్ బల్లకింద దొర్లుతోంది. జ్యోతి చెల్లాచెదురైన వస్తువులన్నీ చక్కగా సర్దింది. మంచం దగ్గరికొచ్చి దుప్పటి దులిపి తలగడ తీసేసరికి దాని కింద ఓ ఉత్తరం దొరికింది. అప్రయత్నంగానే వుత్తరాన్ని చదివింది.

డియర్ గోపాల్ !

నువ్వు వెళ్ళినప్పట్నించీ రత్న నిద్రాహారాలూ మాని రాత్రీ, పగలూ ఏడుస్తూ నీ కోసమే ఎదురు చూస్తోంది. ఆ విచారాన్ని చూస్తోంటే నిన్నది ప్రేమిస్తోందేమో ననిపిస్తోంది. రత్న బాధ మేం చూడలేం! దయచేసి రా ! రత్నని ఇక్కణ్నుంచి తీసుకు వెళ్ళిపో !

నీ

కన్నయ్య

ఉత్తరం ముగించక ముందే హాల్లో చప్పుడయింది. ఆమె ఉత్తరాన్ని యథాస్థానంలో దాచేసి కంగార్ని కప్పిపుచ్చుకొంటూ మంచం మీద చతికిలబడింది. కల్నల్‌గారు లోనికొచ్చి అక్కడ జ్యోతిని చూశారు.

"ఈ పాటికి వస్తూ వుంటాడు" అన్నారు.

"అతని కోసంకాదు..." ఆమె కంగారుగా లేచి నిల్చుంది.

"ఇపుడతను ఇక్కడే వుంటున్నాడన్నమాట" అనంది.

"ఇక్కడే వుంటున్నాడు. పరాయి వాడేం కాదుగా"

"కాని, డాడీ..." సగంలో ఆగిపోయింది.

"చెప్పమ్మా"

"పరాయి రక్తం పరాయిదే కాని, మనదెలా అవుతుంది డాడీ"

"కాని, అతను అటువంటి వాడు కాదమ్మా ! ఇపుడతను గోపాల్ కాదు ! మన జీవన్".

"డాడీ ! మీరీ పునర్జన్మలు నమ్ముతారా ?"

"అలా అనకమ్మా! కొన్ని ప్రత్యేక ఆత్మలు పూర్వజన్మ జ్ఞానం కలిగుంటాయి."

"ముక్కూ, మొహం తెలీని వ్యక్తిని అంతగా నమ్మటం మంచిది కాదేమో డాడీ"

"తప్పమ్మా ! వాడు జీవన్! నువ్వు జ్యోతి. మీరిద్దరూ లేక మేం బతకలేం"

"అలాగే కానీండి డాడీ ! మీ నమ్మకాన్ని నేను కాదనను"

"అయితే నాకో మాటివ్వాలి"

"ఏమిటి డాడీ"

"నువ్వింకా చిన్నదానివి ! పొరపాటున కూడా గోపాల్నేమీ అనకూడదు. అతను బాధపడి వెళ్ళిపోతే..."

"అలా ఎందుకు చేస్తాను డాడీ..."

"అలా చేస్తావని కాదమ్మా ! ఎందుకైనా మంచిదని చెప్పాను"

"మీ సంతోషం కోసం ఏమైనా చేస్తాను డాడీ"

"చాలా సంతోషం తల్లీ !" జ్యోతి భుజంమీద ఆప్యాయంగా తడుతూ అన్నారు కల్నల్‌గారు. ఇంతలో గేటు తెరిచిన శబ్దం విన్పించింది. కల్నల్‌గారు జ్యోతిని అక్కడే వుండమని సైగజేస్తూ గోపాల్ని కలుసుకోవడానికి బయటికి వెళ్ళారు. జ్యోతి కర్టెను వెనుక నిల్చొని చూస్తోంది. గోపాల్ లోపలికి వస్తూనే—

"అమ్మా ! యువరాణి వచ్చిందట ఎక్కడా?" అని గట్టిగా అరిచాడు.

"రోజూ అడుగుతున్నావుగా, ఎప్పుడొస్తుందీ, ఎప్పుడొస్తుందీ అంటూ. వచ్చేసింది నీ కోసం ఎదురు చూస్తోంది"

"వచ్చేసిందిగా !. ఆకలేస్తోంది తినడానికేమన్నా పెట్టమ్మా!" అన్నాడు డైనింగ్ టేబుల్ దగ్గర కూర్చొంటూ. కల్నల్‌గారు కూడా చేతులు కడుక్కొ-

నొచ్చారు. తనని కలవడానికొస్తాడని, తనని చూస్తూ ఆశ్చర్యపోతాడనుకొంది జ్యోతి.

జ్యోతి మునుపటిలా చంటిపిల్లేంకాదు. కోమలత్వం, సౌందర్యం మూర్తీభవించిన గంభీరమూర్తి. గోపాల్ ఆమెను కలుసుకోవడానికి రాకపోయేసరికి ఆమెలో నిరాశ చోటు చేసుకొంది. కొంత సేపటి తర్వాత బయటకొచ్చింది.

గోపాల్ ఆమెను చూస్తూనే చకితుడయ్యాడు. దివి నుండి దేవత దిగి వచ్చినట్టుగా అన్పించింది. తనని వెక్కిరిస్తూ పారిపోయే అల్లరి జ్యోతి కాదుగాక కాదు! చందమామలాంటి మొహం, ఉంగరాలు తిరిగిన ముంగురులు, కలువల్లాంటి కళ్ళు.. గోపాల్ ఆమెను కళ్ళు విప్పార్చుకొని చూస్తూండిపోయాడు. తొలి చూపులోనే జ్యోతి అతన్ని వశపరుచుకొంది. అతనలా తనకేసి చూడ్డం చూసి, చిరునవ్వు నవ్వింది జ్యోతి.

"నువ్వు జ్యోతివేనా ?" అనడిగాడు. అతని పెదవులు కంపించటం గమనించింది జ్యోతి.

"ఏం ! నేనలా కన్పించటంలేదా" ప్రశ్నించింది.

"అలాగే వున్నావు. కాని, ఇంతలా మారిపోతావని అనుకోలేదు" ఆ మాటలకి నవ్వారు కల్నల్‌గారు. నవ్వుతూనే గోపాల్ చిన్నప్పటి ఫోటోను చూపిస్తూ "నువ్వెంతలా మారిపోయావో చూసుకో" అన్నారు.

జ్యోతి పరిశీలనగా అతనికేసి చూసింది అతను ఆనాటి అల్లరి పిల్లాడిలా లేడు. కండలు తిరిగిన శరీరం, వెడల్పాటి భుజాలు, ఎర్రని శరీరచ్ఛాయ, నల్లటి మీసాలూ..ఆనాటి పల్లెటూరబ్బాయి ఇంత అందంగా తయారయ్యాడంటే ఆమెకు నమ్మశక్యం కాకుంది. కంగారు నటిస్తూ కొంటూ 'టీ' కలపడంలో తల్లికి సాయపడింది.

'టీ' తాగుతూ గోపాల్ కల్నల్ గారితో ఏవో విషయాలు మాట్లాడాక, ఆయన చెవి దగ్గర నెమ్మదిగా ఏదో చెప్పాడు. జోతికేమీ అర్థం కాలేదు. కాని శాంతీదేవికి అర్థమైంది.

"అయితే ఈ రోజు కూడా వేటకి వెళ్ళావన్న మాట" అందామె.

"అవునమ్మా ! నేనసలు పక్షుల్ని కొట్టలే! వాటిని భయపెట్టాసంతే"

"అమాయక ప్రాణుల్ని చంపుతావెందుకు? ఏ పులినో, చిరుతనో వేటాడు బాగుంటుంది" అంది తల్లి.

"తప్పకుండా! ఏదో ఓ రోజు వాటిని తెస్తా చూడు"

జ్యోతి ఫక్కున నవ్వింది. గోపాల్ ప్రశ్నార్థకంగా ఆమెకేసి చూశాడు.

"తమరు పులిని వేటాడుతారా ?"

"అవును. ఇందులో నవ్వటానికేముంది ?"

"పావురాళ్ళని చంపే పిరికిబాబు పులిని చంపగలడా అని?" జ్యోతి మళ్ళీ నవ్వింది.

గోపాల్ కోపంతో అక్కణ్ణుంచి లేచి వెళ్ళిపోయాడు. వరండాలోకి వచ్చి తను చంపి తెచ్చిన పక్షుల్ని చూశాడు. కల్నల్‌గారు, శాంతీదేవి, జ్యోతి అతని వెనుకనే వచ్చారు. అతని కోపం చూసి కల్నల్‌గారు-

"కోపం ఎందుకు బాబూ! జ్యోతి నిన్ను ఆట పట్టించింది" అన్నారు. గోపాల్ ఆమెకేసి చూశాడు. ఆమె పెదవుల మీద ఇంకా చిరునవ్వు

మెరుస్తూనే వుంది.

"అపార్థం చేసుకొన్నారా?" అనడిగింది.

"పొరపాటు జరిగింది. క్షమించండి! ఇక ముందెప్పుడూ ఇలా మాట్లాడను" అంది మళ్ళీ. వెంటనే గదిలోనికి వెళ్ళిపోయింది.

కల్నల్‌గారు గోపాల్ చేతుల్లోంచి పక్షుల్ని తీసుకొని నిమిరారు. జ్యోతి ఎంత సభ్యతగా క్షమాపణ కోరింది! ఆ మాటలు తన చెవుల్లో గింగురు మంటూనే వున్నాయి. ఆమె తనతో హాస్యమాడింది. ఇందులో బాధపడవలసిందేమీ లేదు. కాని, ఇప్పుడు జ్యోతికి కోపం వచ్చినట్టుగా వుంది. ఆమెతోపాటు కలసి వుండవలసిన ఇంట్లో ఆమెకు దూరంగా ఎలా మసలగలడు? ఆమెను చూసినప్పట్నుంచీ తనకేదో నూతనోత్సాహం కలిగినట్టనిపిస్తోంది. అప్పటికప్పుడే జ్యోతి ముందర వాలి, ఆమె మాటల్ని తనంతగా పట్టించుకోలేదనీ, అలా హాస్యంగా మాట్లాడటం తనకి సరదా అంటూ చెప్పాలనిపించింది గోపాల్‌కి.

కాని అలా చేయలేకపోయాడు. కాళ్ళు నేలకు అంటుకుపోయినట్టున్నాయి. కాదనలేకపోతున్నాడు. జ్యోతి అన్న మాటలు కూడ నిజమే! తను నిజంగానే పిరికివాడు! తనూ, తన మనస్సూ వేరొకరి ఆధీనంలో వున్నాయి, తను వేరొకరి ఆజ్ఞలకు బద్ధుడు. వాళ్ళు చెప్పినట్టే తను నడుచుకోవాలి తప్పా, స్వతంత్రించి ఏమీ చేయలేడు. నిజమే! తను దొంగ! కపటి! మోసగాడు!

–అతని మనసులో ఎన్నో ఆలోచనలు గిర్రున తిరుగుతున్నాయి. వేటాడి తెచ్చిన పక్షుల్ని అక్కడే వదిలేసి పాత ఇంటికేసి నడిచాడు.

"ఎక్కడికి వెళ్తున్నావ్?" అతనలా హఠాత్తుగా వెళ్ళటం చూసి అడిగారు కల్నల్‌గారు.

"నాన్న దగ్గరికి"

"ఇవి సావన్ కోసం పట్టుకెళ్ళు"

గోపాల్ వాటిని తీసుకొని పెద్ద పెద్ద అంగలు వేసుకొంటూ వెళ్ళిపోయాడు. ఇంట్లోకి వెళ్తూనే పక్షుల్ని బల్లమీద పడేశాడు గోపాల్. సావన్ తలెత్తి చూసి– "ఏమిటిది" అన్నాడు.

"వేట పక్షులు! మీ కోసం తెచ్చాను"

సూరజ్ అప్పుడే వస్తూ–

"బాగున్నావా బాబూ" అంటూ పలకరించాడు గోపాల్ని.

"మీ దయవల్ల"

"కాదు! అబద్ధం చెప్తున్నావు! రంగు మారిన నీ మొహం చూస్తుంటే తెలుస్తోంది! ఏదో బాధ పడ్తున్నావు"

"అవును! నాకు బాధ తప్పా మరేం వుంది. రాత్రీ, పగలూ దొంగలా, మోసగాడిలా మసలుకొనేసరికే సరిపోతోంది. స్వేచ్ఛగా వూపిరి కూడా పీల్చుకోలేను. అడుగడుక్కూ ఏమౌతుందో నన్న భయంతో బతుకుతూన్న నా మనసుకి బాధకాక శాంతి ఎక్కడుంది"

"ఏమయింది ఇలా మాట్లాడుతున్నావ్" సావన్ గోపాల్ని దగ్గరగా లాక్కొన్నాడు.

"అంతా అర్థమయింది. జ్యోతి వచ్చిందిగా! అదీ సంగతి" అన్నాడు సూరజ్.

"నిజమే" అంటూ లేచి వెళ్ళబోయాడు గోపాల్. సూరజ్ అతని చేయి పట్టుకొంటూ–"అప్పుడే ఎక్కడికి" అనడిగాడు.

"మా ఇంటికి"

"అంతే !? కాసేపు ఇక్కడ కూర్చొందికక్కడ నీకు నామోషీగా వుందా? అయినా నీకెలా తెలుస్తుంది– కన్నతండ్రి పలవరించే పలవరింతలు"

"నాకు తెలుసు పెదనాన్నా! కాని నన్నేం చేయమంటావ్! నా జీవితాన్ని రెండు ముక్కలుగా చేసింది మీరే"

"మనసు పాడుచేసుకోకు! తండ్రి మనసెప్పుడూ బిడ్డల మేలునే కోరు తుంది" మృధువుగా అంటూ విషయాన్ని మార్చి – "ఇంకేమిటి విశేషాలు" అనడి గాడు సూరజ్.

"ఏముంటాయి" ఆశ్చర్యంగా అన్నాడు గోపాల్.

"జ్యోతి! ఆ పిల్ల చాలా తెలివైంది! జాగ్రత్తగా నడుచుకో"

"ఇలా ఎన్నాళ్ళ పెదనాన్నా! ఏదో రోజు గుట్టు బయటపడితే..."

"అప్పుడే భయపడిపోతున్నావా? జీవితం చాలా పెద్దది! కల్నల్ రోజులు పూర్తి కానీయ్ లక్షల ఆస్తి నీ స్వంత మవుతుంది"

"జ్యోతికి గల జీవితం కూడా పెద్దదే గదా?"

"ఆమె ఎన్నాళ్ళు! కల్నల్‌గారు ఆమె పెళ్ళి కోసం ప్రయత్నాలు చేస్తున్నారు. ఆమె అత్తారింటికి వెళ్ళడం... ఇక్కడ ఈ ఆస్తంతా నీ చేతుల్లోకి రావడం..."



"బాగుంది"

"అందుకే అంటున్నాను. కాస్త జాగ్రత్తగా వుండమని. కల్నల్‌గార్ని, శాంతీదేవిని నీ పక్షంలో వుంచుకోవాలి. అలాగే జ్యోతిని కూడ"

"జ్యోతినెలా? ప్రేమించా?"

"కాదు! అలా అయితే మొదటికే మోసం రావచ్చు! నీ ఆత్మ 'జీవన్'ది! అటువంటప్పుడు నీకూ, జ్యోతికీ వున్న అనుబంధం ఎలాంటిది? దాన్ని మర్చిపోకు"

గోపాల్ సూరజ్ మాటల్లోని గూఢార్థాన్ని గ్రహించాడు. నవ్వుకొంటూ అక్కణ్ణుంచి వెళ్ళిపోయాడు.

* * *

"పాలు తీసుకోండి"

గాఢ నిద్రలో వున్నవాణ్ణి ఎవరో తట్టి లేపినట్టుగా ఉలిక్కిపడ్డాడు గోపాల్. ఎదురుగా జ్యోతి పాల గ్లాసుతో నిల్చుంది. తల్లి బదులుగా ఆ రోజు జ్యోతి పాలు తీసుకొనొచ్చింది. కంపిస్తోన్న చేతుల్తో గ్లాసు సందుకొంటూ—"మీకెందుకీ శ్రమ" అన్నాడు.

"చూడండి! మీరు నన్ను 'మీరు' అంటూ మన్నించనక్కర్లేదు. మీ కన్నా చిన్నదాన్ని. 'జ్యోతి' అని పిలవండి"

"అక్షరం ముక్క తెలీని పల్లెటూరి వాణ్ణి! చాలా చదువుకొన్నవాణ్ణి కాను. కాని లోకం దృష్టిలో నీ కంటే పెద్దవాణ్ణి"

"ఒప్పుకొంటాను! కాని, మీ కన్నా చిన్నవాళ్ళని మన్నించనంత మాత్రాన మీరు పల్లెటూరివారు కాకుండాపోతారా?"

"అంటే మీ వుద్దేశ్యం?"

"ఏంలేదు"

"సరే! ఇలా కూచోండి"

"పొద్దుపోయింది! నిద్రపోవాలి"

"నిద్రన్నది జీవితంలో ఎప్పుడూ వుండేదే!"

"అంటే! నేనిక్కడ కూర్చునే అవకాశం ఇంకెప్పుడూ రాదనా?"

"ఎలా చెప్పగలం! రేపు మీద నమ్మకాల్లేవు"

"అదేమిటి? వేదాంతం నేర్చుకొంటున్నారా?"

"అంతకన్నా ఏం చేయగలను? ఒకే సారి రెండు పడవల్లో ప్రయాణిస్తున్నాను. గమ్యం లేదు"

"మీరు చిత్రంగా మాట్లాడతారు. ముందు పాలు తాగండి! చల్లారిపోతున్నాయి"

"మీరు కూడ తాగండి"

"నేను తాగలేను"

"ఎందుకని?"

"అది చిన్నపిల్లల పని" మూతి ముడుచుకుంటూ అంది జ్యోతి. గోపాల్ పాలు తాగుతూంటే వెక్కిళ్ళొచ్చాయి. పాలు తుళ్ళి ముఖమంతా అయ్యాయి. జ్యోతి తన రుమాల్తో అతని ముఖాన్ని అద్దింది. ఆమె వేళ్ళు తగిలేసరికి అతని శరీరంలో విద్యుత్ ప్రసరించినట్టయింది.

జ్యోతి గ్లాసు తీసుకొని 'గుడ్‌నైట్' చెప్పి దీపం ఆర్పి వెళ్ళిపోయింది. ఆమెను వెళ్ళనీయకుండా ఆపాలన్పించింది గోపాల్‌కి. గది చీకటితో నిండిపోయింది. లైట్ ఆఫ్ చేసినందువల్ల కాదు, జ్యోతి అక్కణ్ణుంచి నిష్క్రమించడం వల్లనే అన్పించింది. తన జీవనజ్యోతిని ఎవరో తస్కరించగా తను గాఢాంధకారంలో దిక్కుతోచక కొట్టుమిట్టాడుతున్నట్టు ఫీలయ్యాడు.

నిజానికి అతని జీవితం అంధకార

బంధురంగా వుంది. ఈ విశాల విశ్వంలో అతనో ఏకాకి. అతని కష్టసుఖాలు పంచుకొనేవాళ్ళేలేరు. కాని జ్యోతి ఆ ఇంట్లో అడుగుపెట్టాక ఏదో వెలుతురు కిరణం అతన్నాశ్రయించినట్టన్పించింది. ఆశలు మొగ్గలు తొడిగాయి. యవ్వనం మొదటి సారిగా పురి విప్పింది. అయితే తండ్రి, పెదనాన్న, తన వాస్తవిక జీవితం గుర్తుకొస్తూంటే ముళ్ళమీద నిల్చున్నట్టుగా వుంది. పదునైన కత్తితో తన శరీరాన్ని ఎవరో ముక్కలుగా తరుగుతున్నట్టు బాధ! 'గుడ్‌నైట్' అన్న జ్యోతి మధుర కంఠం ఇంకా విన్పిస్తోన్నట్టుగానే వుంది. నిద్ర రావట్లేదు.

తను పన్నిన వలలో తనే చిక్కుకున్నాడు. ఇప్పుడా ఇంటితో సంబంధాన్ని తెంచుకోవడమంటే మృత్యువును ఆహ్వానించడమే అవుతుంది. ఈ జీవితంలో తననితాను మోసగించుకోగలడు. కాని జ్యోతి కోసం చేయి చాచలేడు. భగవాన్!

...గోపాల్ ఆలోచనల్ని ఏదో మధుర కంఠం పట్టిలాగి ఆపేసింది. నిద్ర పోకుండా ఏదో ఆలోచిస్తూనే వుంది జ్యోతి. ఉబుసుపోక పాట పాడుతోంది.

గోపాల్ మంచంమీంచి లేచి చీకట్లో నెమ్మదిగా అడుగులు వేస్తూ బయటికి నడిచాడు. బాల్కనీ ఇంకా ఆ పక్కనున్న గదులు ... అన్నీ చీకటిగా వున్నాయి. జ్యోతి గదిలోంచి మాత్రం సన్నగా వెలుగొస్తోంది. గోడకానుకుంటూ ఆమె గది వైపు అడుగులు వేశాడతను. ఏదో దొంగతనం చేస్తోన్నట్టుగా గుండె దడదడలాడుతోంది. పాట మరింత స్పష్టంగా విన్పిస్తోంది.

కిటికీ దగ్గర చీకట్లో నిల్చుని లోపలికి తొంగిచూశాడతను. జ్యోతి బీరువాలో బట్టలు సర్దుతూ కన్పించింది. బీరువా తలుపు మూసి ఇటు తిరిగింది జ్యోతి. బద్ధకంగా ఒళ్ళు విరుచుకుంటూ ఆవులించింది. నవయవ్వనం, దివ్య సౌందర్యం కలగలిపి చేసినట్టున్న సుందర విగ్రహం అతని కళ్ళెదుట నిలిచింది. విశాలమైన కనురెప్పలు నిద్ర మత్తుతో బరువుగా వాలుతున్నాయి. ఆమెలో విచిత్రమైన ఆకర్షణ వుంది. గోపాల్ హృదయం తపించిపోయింది. నైట్ గౌన్‌లో ఎంతో అందంగా వుందామె! వివశుడయ్యాడతను. స్వశంత్రించి రెండు నిముషాలు జ్యోతితో మాట్లాడలేని తను ఆమె నుండి ప్రేమను ఆశించడం వీలవుతుందా ?

జ్యోతి పాట ఆపేసింది. మంచమ్మీద పడుకుని సగం వరకూ రజాయి కప్పుకొంది. తలగడ కింద నుంచి పుస్తకాన్నొదాన్ని తీసుకుని చదువుతోంది.

గోపాల్ చాలాసేపు ఆమెను అలా చూస్తూ నిల్చున్నాడు. పగటిపూట అలా పరిశీలనగా చూడలేడు. కనుక ఆ రాత్రి వేళ ఆ చీకట్లో అలా నక్కి నక్కి ఆమె సౌందర్యాన్ని తనివితీరా చూసాడు. అతని మనసులో గిలిగింతలు! కాసేపు చదివాక జ్యోతి లైటార్పేసింది. ఆ చీకట్లో కూడ ఆమె సుందర రూపాన్ని వూహించుకుంటూ ఆనందించాడుగోపాల్. అతనిలో ఏదో బాధ! ఆ బాధలో మిళితమైన ఆనందం! అతను నెమ్మదిగా నడిచి తనగదికి చేరుకొని,మంచం మీదకు వొరిగిపోయాడు. కాని, నిద్రరావట్లేదు. ఎంతసేపు అలా వున్నాడో ఏమో! తెల్లారిపోయింది.

* * *

“ఈరోజు నిద్రనుండి లేవరా

ఏమిటి?"

ఆ మాటలు వింటూ ఆశ్చర్యంతో లేచి కూర్చున్నాడు గోపాల్. ఎదురుగా ద్వారం దగ్గర జ్యోతి నవ్వుతూ నిల్చొని వుంది. ఆమె చేతిలో 'టీ' కప్పు పొగలు చిమ్ముతోంది. 'టీ' కప్పును పెదవులకు తగిలిస్తూ తాగుతూందామె! ఆమె లేత పెదవుల్ని స్పృశిస్తోన్న 'టీ' కప్పును తదేకంగా చూశాడు గోపాల్. తను రాత్రి దొంగలా ప్రవర్తించడం జ్యోతికి తెలిసి పోలేదు కదా.

జ్యోతి టీ కప్పుతో అతని దగ్గరగా వచ్చింది.

"టీ తీసుకొంటారా?" అడిగింది.

''ఇప్పుడుకాదు. ముఖం కడుక్కున్నాక"

"బెడ్ టీ''

''అలవాటులేదు. స్నానం అయ్యాకే పానం చేసేది"

"చాలా నియమాలున్నాయే మరి! అయితే ఇంత ఆలస్యంగా లేవడం కూడ మీ నియమాలలో ఒకటా!

"కాదు! రాత్రి నిద్రలేదు"

"ఎందుకని?"

''ఏమో తెలీదు"

"నేన్చెప్పనా?''

"చెప్పండి'' భయంగా అడిగాడు.

''రాత్రంతా ఎవరిగురించో బాగా ఆలోచించి వుంటారు"

"ఆలోచనా? ఎవరి గురించి'' గోపాల్ ఆశ్చర్యంగా అడిగేలోపల వచ్చే నవ్వును పెదవులతో అదిమిపెట్టి బయటకు వెళ్లి పోయింది జ్యోతి. ఆమె వుద్దేశ్యం రత్న గురించి! ఆ విషయం గోపాల్‌కు అర్థం కాలేదు. అతని ఆలోచనలు మరోలా వున్నాయి. జ్యోతికూడ రాత్రంతా తన లాగే తనగురించే ఆలోచించి వుంటుందా? ఇది నిజమా? నిజమయితే ఏమని ఆలోచించి వుంటుంది? అతని మెదడులో ఎన్నో ప్రశ్నలు చెలరేగాయి.

రోజులు గడుస్తున్నాయి. జ్యోతి, గోపాల్ ఇద్దరూ నవ్వుతూ తృళ్ళుతూ కాలం గడుపుతున్నారు. జ్యోతితో ఆనందంగా, సరదాగా కాలం గడిచిపోతున్నా, తన స్థితి మాత్రం దుర్భరం అన్పిస్తోంది గోపాల్‌కి. తన చేష్టలతో ఆ చల్లని వాతావరణం మారిపోకుండా చాలా మెలకువగా మసలుకొంటున్నాడు. వాళ్ళిద్దర్నీ చూసి కల్నల్ దంపతులు సంతోషిస్తున్నారు. మునుపటిలా ఇద్దరూ తగవులాడుకోవటం లేదు. కలసి మెలసి వుంటున్నారు. అంతే చాలు అనుకొంటున్నారా దంపతులు.

జ్యోతికి గోపాల్ జీవితాన్ని గూర్చి ఎటువంటి అభిప్రాయంలేదు. చిన్నప్పుడు అతని పట్ల కలిగిన అసహ్యం మాత్రం ఇప్పుడామెకు లేదు. గోపాల్ తనకెంతో ప్రియమైన వ్యక్తిలా అన్పిస్తున్నాడు. ఆ భావనే ఆమెను అతనికి దగ్గర చేసింది. ఆ వూళ్ళో ఆమెకు స్నేహితులెవరూ లేరు. ఆమెతో మాట్లాడి, సరదాగా షికార్లు చేసేది గోపాల్ ఒక్కడే! అతను పని మీద బయటకు వెళితే అతని రాక కోసం వేయి కళ్లతో ఎదురు చూస్తోందిప్పుడు జ్యోతి.

జ్యోతి రత్నను గురించి ఆలోచించక పోలేదు. రత్న ఎవరు? ఎలా వుంటుంది? గోపాల్‌కూ, ఆమెకూ ఎలా పరిచయమైంది? వాళ్ళిద్దరూ ఎప్పుడు, ఎక్కడ కలుసుకొంటారు? ఆమె ప్రశ్నలకు సమాధానం లభించేది లేదు. ఎన్నోమార్లు తన సందేహ నివృత్తికి అతని బీరువా, బట్టలూ అన్నీ పరిశీలించి చూసింది. కాని,

రత్నకి సంబంధించిన వస్తువులేమీకన్పించ
లేదు. కొన్నిసార్లు గోపాల్ని ఆ విషయం
అడగాలనుకొని మానుకొంది.

గోపాల్‌కూడ ముందుకంటే హుషా
రుగా వుంటున్నాడు. నాన్న, పెదనాన్న
లతో కలిసినప్పుడు మాత్రం అతని
మనసు చికాగ్గా వుంటోంది. కాని,
తిరిగి కల్నల్‌గారింటికి వచ్చేశాక, అతని
కేదో పెద్ద బరువు దించుకున్నట్టుగా
తేలిగ్గా వుంటోంది. కల్నల్ దంపతుల
వాత్సల్యం, జ్యోతి చిరునవ్వు అతనికి
బలమైన టానిక్‌లా పని చేస్తున్నాయి.

కొన్నిసార్లు కల్నల్ గారికి తన
రహస్యాన్ని విడమరచి చెప్పేసి, తన
మనఃక్లేశాన్ని దూరం చేసుకోవాలనుకు
న్నాడు. కాని అది సాధ్యమయ్యే పని
కాదు. ముఖ్యంగా తను జ్యోతికి
దూరంగా వుండలేడు. నిజం తెలుసుకొం
టూనే తనను అందరూ అసహ్యించు
కొంటారు. తననుండి అంతా దూరంగా
తొలిగిపోతారు. కల్నల్‌గారు కోపంతో
మతిచెడి తనని ఏమైనా చేయవచ్చు. తన
జీవితాన్ని నాశనం చేయొచ్చు. అలా
వూహించుకొంటూ గంటల తరబడి ఆవే
దన చెందడం మినహా అతను చేయగలి
గిందేమీ లేదు. తనని తానే నిగ్రహించు
కునేవాడు. ఓదార్చుకునేవాడు. తన
కర్తవ్యం ఏమిటో తెలుసు?

చీకటిమయమయిన హృదయంలో
ఓ మూల 'జ్యోతి ప్రేమ' అనే దీపం
రెపరెపలాడుతోంది. తన బాధ పంచు
కొనే వారెవరూ లేరు. తన నోటి నుండి
ఒక మాట రావడం ఆలస్యం తనపై
వాళ్ళకి గల మమతానురాగాలు గాలి
మేడల్లా కూలిపోక తప్పదు. కల్నల్‌గారి
వృద్ధాప్యం, శాంతీదేవి మమకారం, జ్యోతి
లేత పెదవుల చిరునవ్వులూ అతని జీవి
తంలో వేళ్ళు తన్నుకొని వున్నాయి. వాట
న్నిటినీ కాదని అతనెలా జీవించగలడు?

ఆరోజు కల్నల్‌గారు పేటకి బయల్దే
రారు. ఆయనతో జ్యోతి కూడా బయల్దే
రింది. జ్యోతిని దగ్గరగా చూడటం,
స్వేచ్ఛగా ఆమెలోని భావాలను చద
వటం గోపాల్‌కి ఇదే తొలిసారి!

జ్యోతి తుపాకీ కాలుస్తానంది. కల్నల్
గారు జ్యోతికి గురి చూడటం నేర్ప
మంటూ గోపాల్ని కోరారు. గోపాల్
నవ్వుతూ ఆమెను ఓ చెట్టు దగ్గరికి
తీసుకుపోయాడు. ఆమె భుజం పట్టుకొని
తుపాకీ పట్టుకొనే విధం నేర్పాడు. ఆమె
వెనుక నిల్చుని గురి చూడటం ఎలాగో
చెప్తున్నాడు. అనుకోకుండా జ్యోతి తల
గోపాల్ గుండెల్ని తాకింది. ఇద్దరి శరీ
రాల్లో విద్యుత్ పాకి, ఒకరినుండి మరొ
కరిలోకి దూసుకుపోయింది. జ్యోతి తన
తడబాటును అణుచుకోడానికి తుపాకీ
సవరించింది. గోపాల్ మాత్రం తన తడ
బాటును ఏ విధంగానూ దాచుకోలేక
పోయాడు. అతనికది సరికొత్త అను
భూతి!

అతన్లో ఏదో ఉన్మాదం రేగింది.
జ్యోతిని చేతుల్లోకి తీసుకొని బంధించా
లన్పించింది. కాని, అంత సాహసం చేయ
లేకపోయాడు. గుండెలమీద చేతులు
వేసుకొని క్షణకాలం పాటు కళ్ళు మూసు
కొన్నాడు. అతని దేహం సన్నగా
కంపించింది. గోపాల్ తనని తను నిగ్ర
హించుకొంటూ—

"అదిగో ఆ కొమ్మని గురి చూడు"
అన్నాడు.

"కొమ్మకి గురి చూస్తే ఏమె
స్తుంది?"

"అదే వేట"

"ఇదా వేట? ఆకులూ, రెమ్మలూ రాల్చటమా?"

"నీకు కొత్త కదా! ముందు వీటితోనే మొదలుపెట్టాలి."

గోపాల్ జ్యోతి తలని తన ఛాతీకి ఆనించుకొని తుపాకీ గురిపెట్టాడు. ట్రిగ్గర్‌మీద వేలుపెట్టమని చెప్పాడు. జ్యోతి గురి చూసింది. కాని, చేతులు వణుకుతున్నాయి.

"ఆఁ! అలాగే! సరిగ్గా వుంది" అంటున్నాడు గోపాల్, అతని చేతులు జ్యోతి చేతుల్ని తాకాయి. అతని చుబుకం ఆమె ముంగురుల్ని స్పృశిస్తోంది. గోపాల్ హృదయం తీవ్రంగా స్పందించింది.

జ్యోతి ఊపిరి బిగపట్టి గోపాల్ సౌంజ్ఞలను పాటించడానికి ప్రయత్నిస్తోంది. అతను వేలు ట్రిగ్గర్ మీద వుంచి మౌనంగా వున్నాడు. గురి చూడటం కంటే ఆమె శరీర స్పర్శలో ఎక్కువ ఆనందం కలుగుతోంది. ఆమె శరీరం అయస్కాంతంలా అతన్ని ఆకర్షిస్తోంది. తనకేసి లాక్కొంటోంది. అలా నిలుచోడమే అతనికి బాగుంది. తనకు తెలియకుండానే ట్రిగ్గర్ మీద వేలు బిగుసుకొంది. తుపాకీ నుండి తూటా వెలువడింది. ఆ శబ్దానికి అడవంతా మార్మోగిపోయింది. జ్యోతి తడబడింది. గోపాల్ పట్టుకోకపోతే తుపాకీ ఆమె చేతుల్లోంచి జారి కింద పడాల్సిందే!

తను గురిచూసిన గూటి నుండి పక్షులు ఎగరడం, గాయపడిన రెండు పక్షులు కిందపడి రెక్కలు టపటపా కొట్టుకోవడం చూసింది జ్యోతి. ఆశ్చర్యపోయింది. గోపాల్ ఆమె భుజాలు తడుతూ—

"ఎలా వుంది?" అనడిగాడు.

"కాని, ఆ పక్షులు"

"అవి అక్కడే వున్నాయి. లేకుంటే ఆకుల్ని రాల్చటానికా తుపాకీ పేల్చాననుకున్నది"

"పక్షులు అక్కడ వున్నట్టు మీకెలా తెలుసు?"

"అదే వేటగాడి గొప్పతనం"

ఆమె అలాగే నిల్చుని అయోమయంగా చూస్తోంది. గోపాల్ ఆమె చేయి పట్టుకొని "బాగా వేటాడావు" అన్నాడు.

తుపాకీ దెబ్బ తిన్న రెండు పక్షులు దగ్గర్లోనే పడ్డాయి. ఒకటి వెంటనే చనిపోయింది. రెండోది కొనప్రాణంతో కొట్టుకొంటోంది. జ్యోతి ఆ పక్షిని తీసుకొని పక్కనే వున్న నీటి మడుగు దగ్గరకు వెళ్ళింది. పక్షి గాయాన్ని కడిగింది. పక్షి కాస్తంత తేరుకోగానే జ్యోతి ముఖం వికసించింది.

"బాగుంది. గాయపరచడం నువ్వే, సపర్యలు చెయ్యడం నువ్వే"

"చాలా బాగుంది. తుపాకి మీరే పేల్చారు. వృత్త పుణ్యానికి ఈ అమాయక ప్రాణుల్ని హత్య చేశారు. మీ మగాళ్ళు ఎంతకైనా తగుదురు! ఖూనీలు చేసి కూడా నిబ్బరంగా వుంటారు"

"అలా అనకు! హింసించడంలోను, ప్రాణాలు తీయడంలోను స్త్రీ, పురుషులు ఒకొరికొకరు తీసిపోరు! ఎటొచ్చి మేం తెర ముందయితే, మీరు వెనుక... అంతే తేడా"

గోపాల్ మాటలకి జ్యోతి నవ్వేసింది. పక్షికి నెప్పి తగ్గడంతో తుర్రున ఎగిరిపోయింది. ఇంతలో కల్నల్‌గారు జీపు హారన్ మోగించారు.

"డాడీ పిలుస్తున్నట్టున్నారు వెళ్ళు"

అన్నాడు గోపాల్.

"మరి మీరు?"

"నేను తర్వాత వస్తాను" తుపాకీ భుజాన్న తగిలించుకొంటూ అన్నాడు గోపాల్.

"ఎక్కడికెళ్తారు?"

"ఎక్కడికి కన్పిస్తే అక్కడికి. అవన్నీ నీకు చెప్పాలా?"

జ్యోతి నవ్వుకొంటూ అక్కణ్నుంచి నడిచింది. వెళ్తు వెళ్తూ ఒకటి రెండుసార్లు వెనుతిరిగి చూసింది. గోపాల్ అక్కడే నిల్చుని ఆమె తిరిగి చూసినప్పుడల్లా చేయివూపాడు.

హఠాత్తుగా ఆమెకు రత్న జ్ఞాపకం వచ్చింది. వెంటనే అంత సరదా దిగజారి పోయింది. ఆ అడివిలో కాలినడకన వెళ్ళటానికి సిద్ధపడ్డ గోపాల్ ప్రేమ గురించి ఆలోచించింది.

తోవలో డాడీతో ఆ విషయాన్ని చెప్పాలనుకొంది. కాని, తర్వాత విషయాన్ని పూర్తిగా తెలుసుకొని తెలియజేయడం మంచిదని నిర్ణయించుకొంది.




"జ్యోతీ" కల్నల్‌గారి గంభీర స్వరం ఇల్లంతా ప్రతిధ్వనించింది. బీరువాలో బట్టలు సర్దుకొంటున్న జ్యోతి ఆ కేకకు అదిరిపోయింది. వరండా వరకూ పరిగెత్తుకొని వచ్చి, అక్కణ్నుంచి నెమ్మదిగా అడుగులు వేసింది.

ఆమె నత్త నడక చూసి కల్నల్‌గారు "త్వరగా ఇలా రామ్మా!" అన్నారు.

తండ్రి ముఖంలో సంతోషాన్ని చూసింది జ్యోతి. ఆమె మనసు కుదుటపడింది. నిటారుగా నిల్చుని కొంగు సర్దుకొంటూ "ఏమిటి డాడీ?" అంటూ ప్రశ్నించింది.

"ముందు తీపి తినిపించాలి తల్లీ!" అన్నారు కల్నల్‌గారు.

"ఎందుకు డాడీ?"

కల్నల్‌గారు నవ్వుతూ కోటు జేబులోంచి టెలిగ్రాం కాగితం తీసి హుషారుగా గాల్లో వూపారు. ఆమె ఆశ్చర్యంతో మరో రెండడుగులు ముందుకు వేసింది. కల్నల్‌గారు ఆమెను వూరిస్తున్నట్లు నవ్వుతూ చూశారు. కల్నల్‌గారు అలా సరదాగా ప్రవర్తించటం ఆమె ఇంతకు ముందెన్నడూ చూడలేదు. చిలిపిగా ముందుకొచ్చి ఆయన చేతిలోని టెలిగ్రాం లాక్కొంది.

టెలిగ్రాం చదువుతోంటే గుండె వేగంగా కొట్టుకొంది. తను బియ్యే ఫస్టు క్లాసులో పాసైంది. టెలిగ్రాంని లెక్కలేనన్నిసార్లుచదివితండ్రినిచూసింది. ఆయన కూడా సంతోషాన్ని ఆపుకోలేక పోతున్నారు. కూతుర్ని ఆప్యాయంగా గుండెలకు హత్తుకొన్నారు. తనని తనే మరిచిపోయినట్టు విజిల్ వేసుకొంటూ హుషారుగా బయటకు నడిచారు. యుద్ధంలో గెలుపొందినపుడు తన తోటివారితో ఆనందంగా గంతులు వేసి నృత్యం చేసినట్టే హడావుడి చేశారాయన.

ఆ హడావుడి చూసి శాంతీదేవి కంగారుగా వంట గదిలో నుంచి బయటకొచ్చింది. గోపాల్ కూడా కంగారుగానే

వరండాలోనికొచ్చాడు. సూరజ్, సావన్‌లు ఆందోళనగా చేరుకొన్నారక్కడికి. అందరూ విచిత్రంగా కల్నల్‌గారిని చూస్తున్నారు. అందరూ చేరాక ఆయనంతటాయనే శుభవార్తను తెలియజేశారు. తల్లి కూతుర్ని కౌగిలించుకొంది. సూరజ్, సావన్ లిద్దరూ ఆనందంగా చప్పట్లు చరిచారు.

"చెప్పండి! మీకు ఏయే స్వీట్లు కావాలో చెప్పండి" అంటూ భార్యకేసి తిరిగి "వుయ్ వాంట్ స్వీట్స్" అంటూ అరిచారు కల్నల్‌గారు.

జ్యోతి గర్వంగా తలెత్తి గోపాల్‌కేసి చూసింది. గోపాల్‌కి అసూయలాంటిది కలిగింది. అతనికి ఆ సంతోషంలో పాలు పంచుకోవాలన్పించలేదు. మౌనంగా నిల్చున్నాడు.

జ్యోతి జడను ముందుకు లాగి అల్లుకొంటూ, గోపాల్ దగ్గరకు వచ్చి కొంటెగా—"ఎలా వుంది మన తడాఖా?" అంది.

"పరీక్షలు రాస్తే – పాసయితే అదీ వింతేనా" గోపాల్ కాస్త విసురుగా అన్నాడు.

"అయ్యగారూ! ఇదేమన్నా పిట్టలవేట అనుకొన్నారా? తుపాకి పేలిస్తే ఏదో ఒకటి పడడానికి" చురుగ్గా అంది జ్యోతి.

"సావన్! చాలా పొరపాటు చేశావు. అనాడు నువ్వు ఒప్పుకునుంటే ఈ రోజు గోపాల్ కూడా బియ్యే చదివి వుండేవాడు" అన్నారు కల్నల్‌గారు.

"అది ఆయన పొరపాటు కాదు! నా ప్రారబ్ధం! నాకా అదృష్టం లేదు. నా తలన బడుద్ధాయిలా బతకమని రాసిపెట్టి వుంది" నేలమీద అడుగుల్ని రాస్తూ తన గదిలోనికి కోపంగా వెళ్ళిపోయాడు గోపాల్.

గోపాల్ని అనుసరించేందుకు కల్నల్ గారు లేచారు. సూరజ్ ఆయన ప్రయత్నాన్ని ఆపుజేస్తూ—

"తమరు శ్రమ పడకండి బాబుగారూ! కాసేపు ఒంటరిగా వుంటే తనే శాంతిస్తాడు" అన్నాడు. జ్యోతి కూడా అతన్నే సమర్థించింది. శాంతీదేవి ప్లేటునిండా మిఠాయిలు పట్టుకువచ్చి అందరికీ పంచిపెట్టింది.

"డాడీ! మీరో మాటిచ్చారు."

"నేను మరిచిపోలేదు! టెలిగ్రాం, కొత్త కారు ఒక్కసారే వచ్చేశాయి"

"నిజం"

"అవునమ్మా! ఆరు నెలల కిందటే కారుకి బుక్ చేశాను"

"అయితే..."

"నిన్ననే వుత్తరం వచ్చింది. కారు తయారుగా వుందట"

"నిజమా డాడీ? అయితే రేపే వెళ్దాం"

"నేను రాలేనమ్మా! నిన్నే పంపిద్దామనుకొంటున్నాను"

"నేనొక్కర్తినా!" జ్యోతి చిన్నబోతూ అంది.

"నువ్వూ, గోపాల్ కలిసి వెళ్ళండి! మీకు నచ్చే రంగు ఎన్నుకోండి"

కల్నల్ గారి మాటలకి ఆశ్చర్యంతో గుడ్లు వెళ్ళబెట్టి ఆయనకేసి చూశారు సావన్, సూరజ్. శాంతీదేవి మిఠాయి ప్లేటుతో గోపాల్ గదికేసి వెళ్ళడం చూసి జ్యోతి ఆమెను ఆపింది. తను ఆ ప్లేటు అందుకొని "నేనిస్తాలే మమ్మీ" అంది. గోపాల్‌గదికేసి ఆమె నడిచింది. సూరజ్, సావన్‌లు ఒకరి ముఖాలొకరు చూసుకొన్నారు.

జ్యోతి నెమ్మదిగా అడుగులు వేసు కొంటూ గోపాల్ గదిలోకి ప్రవేశించింది. గోపాల్ బీరువా నుండి బట్టలు తీసు కొంటున్నాడు. జ్యోతి నిశ్శబ్దంగా అతని వెనక్కి చేరి, పైటకొంగు కొసతో అతని మెడమీద నెమ్మదిగా రాసింది. గోపాల్ ఉలిక్కిపడి వెనుతిరిగి చూశాడు.

"పిరికి" నవ్వు దాచుకొంటూ అంది జ్యోతి.

"అవును పిరికివాణ్నే! పల్లెటూరి వాణ్నే! ఇంకా ఏమేం అనాలుంటే అవన్నీ అనేయ్"

"అరె! కోపం వచ్చిందా! హాస్యాని కన్నాను. నిజమనుకొంటున్నారా?"

"అంతా హాస్యమే! నా జీవితమే అపహాస్యం" అతని మాట పూర్తికాక ముందే జ్యోతి అతని నోట్లో మిఠాయి కుక్కింది. అతని నోరు మూతపడింది. అతని కోపం కూడ మాయమయింది.

"నేను పాసవడం మీకిష్టం లేనట్టుంది"

"అలాగని ఎందుకనుకొంటున్నావు?"

"మరెలా అనుకోను! అందరూ సంతోషంగా వుంటే మీరు మాత్రం..."

"నేను సంతోషంగా లేనంటావు! నీకేం తెలుసు ఆ వార్త విన్నాక నా మనస్సు ఆనందంతో ఎంతగా ఉప్పొంగి పోయిందో"



"మరయితే ఎందుకా ముభావం?"

"కారణం తెలుసుకోవాలని వుందా?"

"ఊఁ"

"నాగురించి నేనే బాధపడుతున్నాను! నేనుకూడ చదువుకొనుంటే..."

"చదువుకోకపోయినంత మాత్రాన ఇప్పుడు మీకేం తక్కువయిందని. నన్నడిగితే..."

"అడిగితే..."

"చదువు సంధ్యలున్నవారి కంటే మీరేం తీసిపోలేదనుకొంటాను"

జ్యోతి మాటలు విన్నాక అతని కోపం అదృశ్యమయింది. ముఖాన చిరునవ్వు వెలిసింది. కొత్త కారు తేవడానికి ఇద్దరూ పట్నం వెళ్ళబోతున్నట్టు చెప్పింది జ్యోతి. ఆమె మాటల్లో నిజానిజాలు తెలుసు కొందికి కల్నల్‌గారి దగ్గరకు వెళ్ళాడు గోపాల్.

"ఇంత తొందర ఎందుకు డాడీ?"

"ఈ అవకాశాన్నొదులుకొంటే-మళ్లీ ఆరుమాసాలు కాచుక్కూర్చోవాలి"

"అయితే ఏం? జీపుందిగా"

"నీ అభ్యంతరం ఏమిటి? ఇప్పుడు కాకపోతే మరి కొన్నాళ్ళకయినా కారు తీసుకోవాల్సిందే కదా! ఇప్పుడయితే జ్యోతికిచ్చిన మాట నిలబెట్టుకున్న ట్టుంటుంది. తర్వాత..."

ఆగి కిటికీలోంచి బయటకి చూసి ఎవరూ లేరని దృఢపరచుకొన్నాక గోపాల్ని దగ్గరగా పిలిచి అన్నారు కల్నల్‌గారు-

"ఇప్పుడు జ్యోతి చిన్న పిల్లకాదు! మంచి సంబంధం వెతుకుతున్నాను. ఈ సమ యంలో కొత్త కారు అవసరం ఎంతైనా వుంటుంది" అని అక్కణ్ణుంచి వెళ్ళిపో యారాయన. కానీ గోపాల్ మాత్రం స్థాణువులా అక్కడే నిల్చుండిపోయాడు. కల్నల్‌గారి మాటలు విన్నాక తను దిమకొన్న నిధిని ఎవరో లాక్కుపోవడా నికి వస్తున్నట్టనిపించింది. సట్టనడి సము ద్రంలో తెరచాపలేని ఓడలా అల్లల్లాడి పోయాడు.

అతను భవిష్యత్తును తేనెపట్టులా అల్లు కొన్నాడు. కాని, ఏదో బలమైన చేయి తన భవిష్యత్తును చిన్నాభిన్నం చేస్తోంది. కొన్ని నిముషాల క్రితం తనముందు నిలిచి, తన మనసునెంతో ఆహ్లాద పరిచిన జ్యోతి, ఇప్పుడు తనకెంతో దూరంలో వున్నట్టు - గడుస్తున్న ప్రతి నిముషం తమ మధ్య దూరాన్ని పెంచుతున్నట్టు అన్పించింది. అతనిలో ఆలోచనా శక్తి నశించింది. మెదడుకు మైకం కమ్మినట్టు అయింది. నెమ్మదిగా ఆ గదినుండి బయ టకి నడిచాడు.

జ్యోతితో కలసి కారు తేవడానికి పట్నం వెళ్ళాలి! అతనికి వెళ్లాలన్పించడం లేదు. కాని, జ్యోతి అడిగేక 'రాననే' శక్తి అతనికి లేదు. ఆ ఇద్దరూ కలసి పట్నం వెళుతున్నారని తెలిసినప్ప ట్నుంచీ సూరజ్, సావన్‌లకి ఒకటే కంగారుగా వుంది. ఇద్దరూ అలా కలసి వెళ్లటంలో ఎంతైనా ప్రమాదం వుంది. ఇద్దరూ యవ్వనంలో వున్నారు. కోరికలు పొంగిపొర్లే వయస్సది! పొరపాటున వాళ్లు కాలుజారితే ఇంకేమన్నా వుందా? సంవత్స రాల తరబడి పడుతున్న తమ శ్రమ అంతా బూడిదలో పోసిన పన్నీరు కాదూ? అలా గని ఆ ప్రయాణాన్ని ఆపే శక్తి లేదు తమకు.

వెళ్ళేముందు గోపాల్ తండ్రిని కలుసు కోవటానికి వచ్చాడు. సూరజ్ కూడ అక్కడే వున్నాడు. కల్నల్‌గారు కారు

ఖరీదు చెక్కు రూపంలోనూ, ఇతర ఖర్చులకు వెయ్యి రూపాయలు నగదు గానూ ఇచ్చారని గోపాల్ చెప్పగానే వాళ్ళిద్దరి నోట్లో నీరూరింది. సావన్ అలవాటు ప్రకారం చేయి చాపాడు.

''పట్నంలో ఏం ఖర్చులుంటాయి! అనవసరంగా జల్సాచేయక చూసి ఖర్చు చేయి" వెకిలిగా నవ్వుతూ అన్నాడు సూరజ్. గోపాల్‌కి అర్థమయింది. దక్షిణ చెల్లించనిదే వాళ్ళు తనని అక్కణ్ణుంచి కదలనివ్వరని వందరూపాయల నోటు తీసి తండ్రి చేతిలో పెట్టాడు.

"చాలా జాగ్రత్త సుమా? ఈ వయసుంది చూశావూ చాలా చెడ్డది" అని నవ్వుతూ అన్న సావన్ మాటల్ని పొడిగిస్తూ అన్నాడు సూరజ్–

"అన్నట్టు జ్యోతి కూడ నీతో వస్తోందటగా"

"అసలు ఆమెకోసమేగా నేను బయలుదేరేది"

''జాగ్రత్త! ఆ అమ్మాయి చాలా చురుకైనది"

"అయితే ఏం నన్నేమయినా పట్నంలో అమ్మేస్తుందా !"

"అమ్మేస్తుందని కాదు! వయసు గడ్డిది. దాని తళుకు బెళుకులు చూసి...''

"చూసి ముందడుగు వేసే తప్పా ?''

"గోపాల్'' సూరజ్ కోపంగా అరిచాడు.

''నేను నీ మేలుకోరి చెబుతూంటే హేళనగావుందా"

''నా బాగోగులు నాకు బాగా తెలుసు! నేనేమిటో మీకు తెలుసు'' అంటూ విసురుగా బయటకు వెళ్ళిపోయాడు గోపాల్.

''పీడా అమ్మాయి మాయలో పడి మన శ్రమని దండుగ చేయడు కదా !''

''ఏమో! అంతా ఆ పైవాడి చిత్తం" గోపాల్ ఇచ్చిన నోటును ఆప్యాయంగా చూసుకొంటూ అన్నాడు సావన్. సూరజ్ చేయిచాచి తన వాటా అడిగాడు. సావన్ వందనోటును జేబులో వేసుకొని అయిదు పదుల్ని మరో జేబునుంచి తీసి అతనికి అందించాడు. సూరజ్ నవ్వుకొంటూ బయటికి వెళ్ళిపోయాడు.

గోపాల్ని, జ్యోతిని స్టేషన్లో వదిలి కల్నల్‌గారు తిరిగి వస్తున్నప్పుడు ఆయనతో పాటు జీపులో సూరజ్ కూడ వున్నాడు.

"బాబూగారూ ఒక్కమాట''సమయం కనిపెట్టి అన్నాడు సూరజ్.

"చెప్పు''

''ఇది మంచిది కాదేమోనని...''

"ఏది? అమ్మాయి ఒంటరిగా పట్నం వెళ్ళడమా ?"

"అవును బాబుగారూ!''

"గోపాల్ వున్నాడుగా''

"అదే బాబుగారూ! చెప్పటానికి..."

"ఆగావేం! చెప్పు నీ వుద్దేశ్యం ఏమిటో''

"మరేం లేదు బాబుగారూ! అమ్మాయిగారు ఇప్పుడు చిన్నపిల్లకాదు. గోపాల్ కూడ అంతే! వాడు మంచివాడే కావచ్చు! కాని, వేడిరక్తం..."

"అంటే!? స్పష్టంగా చెప్పు"

"వయసు అలాంటిది! పొరపాటున..."

"నోర్ముయ్! నోటికొచ్చిందంతా వాగకు"

మంచుగడ్డలా చల్లబడిపోయాడు సూరజ్. కోపంతో కల్నల్‌గారి కళ్ళు ఎర్రబడ్డాయి. కొంతసేపుతర్వాత కల్నల్‌గారు అన్నారు–

"నా ఆంతరంగిక విషయాలన్నీ నీకు తెలుసుకదూ !"

"చిత్తం బాబుగారూ"

"మరి నువ్వు నన్ను మోసగిస్తావా?"

"బాబుగారూ ! ఈ కంఠంలో ప్రాణ ముండగా అలాంటి విశ్వాస ఘాతుకం చేయలేను"

"మరి వాడు మాత్రం ఎందుకలా చేస్తాడు. వాడిని నా కొడుక్కంటే ఎక్కువగా చూసుకొంటున్నాను"

"నిజమే బాబుగారూ ! నేనే తప్పుగా వూహించాను" నెమ్మదిగా అన్నాడు సూరజ్. అతని గొంతుక పట్టేసినట్టుంది.

* * *

గోపాల్ కొత్తకారుని ఒక స్టాండ్ దగ్గర ఆపి, వెళ్ళి రెండుకప్పుల అయిస్ క్రీం తీసుకొచ్చాడు. ఒక కప్పు జ్యోతి కందిస్తూ— "తీస్కో" అన్నాడు.

"ఉదయం నుండి తింటమే ! ఎంతని తినను! సొమ్ము నాది కాకపోయినా, పొట్ట మాత్రం నాదిగా"

"భయపడకు!ఇంటికి వెళ్ళాక పట్నం తీసుకువెళ్ళిన పెద్దమనిషి అసలు నా విషయం పట్టించుకోలేదని అన్నా అంటావని..."

"ఛస్తే అనను! ఇక బయల్దేరండి"

"వెళ్దాం ! అంత కంగారెందుకు" అయిస్క్రీం తింటూ అన్నాడతను.

"సాయంత్రం కావస్తోంది! ఇంటికి వెళ్ళాలిగా"

"కొత్త కారుంది. నాలుగ్గంటల ప్రయాణం. ఎంతసేపు"

"సరే పదండి" జ్యోతి తొందరగా అయిస్క్రీం తినేసింది. గోపాల్ అయిస్ క్రీం తినేసి, నవ్వుతూ జ్యోతికేసి చూశాడు. కారు స్టార్టు చేశాడు. జ్యోతి నిశ్చింతగా వూపిరి పీల్చి, విశ్రాంతిగా కూర్చుంది. కారు పరుగెడుతోంది.

కొత్త కారు! పక్కన జ్యోతి! గోపాల్‌కు ఏవో లోకాల్లోకి తేలిపోతున్నట్టు.... పట్టలేని ఆనందంతో పిచ్చివాడయిపోతున్నట్టు అనుభూతి కలుగుతోంది. ఆ రోజల్లా పట్నంలో తిరుగుతూ షాపింగు చేశారు. ఓ సినిమా కూడా చూశారిద్దరూ.

పట్నం పొలిమేరలకు వచ్చాక కారు స్పీడ్ హెచ్చించాడు గోపాల్. కారు ముందుకు చూసుకుపోతూంటే అతను వెనక్కి తిరిగి తిరిగి జ్యోతిని చూస్తున్నాడు. జ్యోతికి కూడ చాలా ఆనందంగా వుంది. కల్నల్‌గారు తన వాగ్దానం ప్రకారం ఆమెకు కారుని కొనిచ్చారు. కారు రంగు ఆమె స్వయంగా ఎంపిక చేసుకొంది.

నున్నని తిన్నని రోడ్డు మీద కారు గాలిలో తేలుతున్నట్టుగా పోతోంది. ఎదురుగా వున్న అద్దంలోంచి జ్యోతి స్పష్టంగా కన్పిస్తోంది. ఎంతో అందంగా వుంది! ఉల్లిపొరలాంటి ఆమె చీరకొంగు గాలికెగురుతూన్న ఆమె ముంగురులతో పోటీ పడుతోంది. ఆమె పెదవులు ఏదో చెప్ప బోతూన్నట్టుగా అదురుతున్నాయి. మౌనంగా బయట దృశ్యాల్ని చూస్తోందామె!

అతనలా ఆమె సౌందర్యాన్ని బేరీజు వేస్తూండగా కారు రోడ్డు వదిలి పక్కతోవ పట్టింది. ఇద్దర్లో ఎవరూ ఆ విషయాన్ని గమనించలేదు. దారంతా పెద్ద పెద్ద చెట్లు ఆవరించివుండటంతో ఆ ప్రదేశమంతా చీకటిగా వుంది. మంచు కురుస్తున్నందువల్ల మిర్రర్‌లో జ్యోతిముఖం అస్పష్టంగా కన్పిస్తోంది. కళ్ళు పెద్దవి చేసు

కొని మరీ చూస్తున్నాడు గోపాల్. అంతవంతకూ అద్దం లోహపు ముక్కలా తయారయింది. చంద్రగ్రహణం పట్టినట్టు అద్దంలో జ్యోతి ముఖం మరి కన్పించటం లేదు. అంతలో అతనికి కల్నల్‌గారు "జ్యోతి ఇప్పుడు చిన్న పిల్ల కాదు! ఆమెకి తగిన వరుడికోసం వెదుకుతున్నాను" అన్న మాటలు జ్ఞాపకం వచ్చాయి. ఎవరో 'ఛళ్' మని కొట్టినట్టయింది. జ్యోతికేసి తిరిగాడు. ఆ సమయంలో స్టీరింగ్ కంట్రోలు తప్పడంవల్ల కారు చెట్టును 'ఢీ'కొనబోయి, సరిచేయటంతో చెట్టును రాసుకుంటూ వెళ్ళి నిలిచిపోయింది. జ్యోతి భయంతో 'కెవ్వ'మంటూ ముందుకు తూలింది.

"ఏమయిందీ" అంటూ, కంగారును కప్పిపుచ్చుకొంటూ అడిగింది జ్యోతి.

"ఏం లేదు! ఏవేవో ఆలోచనల వల్ల..." అన్నాడు గోపాల్.

"అంతగా ఆలోచించటం మంచిది కాదు"

"భయపడకు! చెక్కు చెదరకుండా నిన్ను ఇంటికి చేర్చే పూచీ నాది"

"ఎలా నమ్మటం? మీ మట్టుకు మీరు ఏవో వూహల్లో తేలిపోతుంటే..."

"నమ్మకం అన్నది లేకపోతే జీవితంలో ఒక్క అడుగుకూడ ముందుకు పోలేం"

"మీక్కూడ అలాంటి నమ్మకాలున్నాయన్న మాట"

"వుండాలి! ఇప్పుడు చూడు! మీ డాడీ నా మీద ఎలాంటి నమ్మకం లేకుండానే నిన్ను నాతో పంపించారంటావా?"

"అలా ఎందుకనుకోవాలి? డాడీకి నా మీద నమ్మకం వుండొచ్చుగా"

గోపాల్ వెనక్కి తిరిగి చూశాడు. జ్యోతి నవ్వుతోంది. జ్యోతి చెప్పిందే నిజం! తన పట్ల వాళ్ళకి నమ్మకం వుంది కాని, తను...? మనసునిండా మసి పూసుకొని మాయ బతుకు బతుకుతున్నాడు. తన జీవితం నిండా అసత్యాలు! అపనమ్మకాలు!

"అలా వుండిపోయారేం" అనడిగింది జ్యోతి.

"మనం మాటల్లో పడితే కారు ఎందులో పడుతుందోనని"

జ్యోతి నిశ్శబ్దంగా నవ్వింది. గోపాల్ కారు స్టార్ట్ చేశాడు.

"ముందుకు వచ్చేయరాదూ" అన్నాడు.

జ్యోతి మొదట నిరాకరించింది. అతను బతిమాల్తే వచ్చి పక్కగా కూర్చుంది.

రాత్రయింది! చీకటి! జ్యోతి మనసులో కంగారెక్కువవుతోంది. ఎంత త్వరగా వూరు చేరుకొంటామా అని ఎదురు చూస్తూ, రోడ్డు పక్కన పరుగెడుతున్న మైలు రాళ్ళను అదేపనిగా లెక్కపెడుతోంది. కారు ముందుకు పరుగెడుతున్నంత వేగంగా, రోడ్డు వెనక్కి పరుగెడుతోంది.

అడవి అంతా చిక్కగా వుంది. ఎంతో రాత్రయినట్టుగా వుంది. అదృష్టవశాత్తూ ఆ రోజు పూర్ణిమ! కొద్దిసేపట్లోనే చంద్రుడు ఉదయించాడు. లేకుంటే ఆ చీకట్లో, ఆ అడవిలో వారి స్థితి వర్ణనాతీతం! గతుకుల రోడ్డంట వెళ్తుంటే కారు అప్పుడప్పుడూ ఎగిరెగిరిపడుతోంది. ఆ కుదుపులకు జ్యోతి తూలి గోపాల్ మీద పడుతోంది. ఆమె అలా తన మీద పడుతున్నప్పుడల్లా గోపాల్ నవ్వుకొంటూ కారు 'స్లో' చేస్తున్నాడు.

"రాత్రి ఎక్కువవుతోంది! దారి

కూడా..."

"ప్రమాదకరంగా వుంది" ఆమె మాటల్ని పూర్తిచేసి కారు స్పీడ్ ఎక్కువ చేశాడు గోపాల్.

"మరి కాస్త వేగంగా పోనివ్వ రాదూ"

"దారి బాగోలేదు! ఇంతకన్నా వేగంగా వెళ్తే ప్రమాదం"

"మరీ ఎక్కువ కాదు! కొంచెం చాలు! ఇదంతా నాకెందుకో భయంగా వుంది"

"పిరికి" జ్యోతి తనని అన్నట్టే అన్నాడు గోపాల్.

"ఇందులో పిరికితనం ఏముంది? ఇంటికి త్వరగా చేరుకోవడం మంచి దంటున్నాను"

"నిజంగా నువ్వు ధైర్యవంతురాలివే అయితే ఈ అడవిలో నడిచి వెళ్ళు చూద్దాం" ఆమెను ఉడికిస్తూ అన్నాడు గోపాల్.

"అవసరం వస్తే అలాగే వెళ్తాను. తాత్కాలికంగా భయపడ్డా పిరికిదాన్ని మాత్రం కాను"

"నిజంగా అలాంటిదానివే! సరే అమ్మాయిగారి ఆజ్ఞను పాటిస్తాను" అంటూ గోపాల్ కారు స్పీడు మరింత ఎక్కువ చేశాడు. గుబురుగా పెరుగుతోన్న చెట్ల మధ్య నుంచి జారుతోన్న వెన్నెల రోడ్డు మీద మచ్చలు మచ్చలుగా పడుతోంది.

కొత్త కారు! నవయవ్వనం! పక్కన మనసుకు నచ్చిన చిన్నది! గోపాల్ మనసు పురకలు వేస్తోంది. అతని అణువణువూ చిందులు తొక్కుతోంది. తనకి తెలియకుండానే కారుని చాలా వేగంగా పోనిస్తున్నాడు. కొన్నిసార్లు కారు రోడ్డు అంచుల మీదకి వచ్చేసింది. జ్యోతి ఆందోళనగా గోపాల్ భుజమ్మీద చేయి వేసి వేగం తగ్గించమంది. కాని, ఏదో పాట గొణుక్కొంటూ జ్యోతి చేయిని విదిలించేస్తూ నవ్వాడు గోపాల్ — "భలే దానివి! స్పీడు పెంచమనేదీ నువ్వే! తగ్గించమనేదీ నువేనా" అన్నట్టుగా వుందా నవ్వు.

జ్యోతి భయంగా సీటుకు చేరగిలబడి కళ్ళు మూసుకొంది. గోపాల్ ఓరగా ఆమెనే చూస్తున్నాడు. గాఢ నిద్రలో ఉన్నట్టున్న ఆ భంగిమలో ఆమె చాలా అందంగా కన్పిస్తోంది. అలా చూస్తోన్న కొద్దీ అతని మనసు తపనతో వేగిపోతోంది. గాలిలో ఎగురుతూన్న ముంగురులు ఆమె మొహాన్ని కప్పుతూంటే- పిల్ల మబ్బులు చంద్రుణ్ని కమ్మేస్తున్నట్టుగా వుంది.

హఠాత్తుగా పెద్దగా శబ్దం చేస్తూ కుదుపుతో కారు ఆగేసరికి జ్యోతి కళ్ళు తెరిచి చూసింది. కారు ఓ పక్కకు వొంగి వుంది. గోపాల్ కిందికి దిగి చూశాడు.

"ఏమయింది" ఆశ్చర్యంగా అడిగింది జ్యోతి.

"టైరు పేలిపోయింది" ఆమెకేసి చూడకుండానే అన్నాడు గోపాల్.

"ఇప్పుడెలా మరి?"

"అదే ఆలోచిస్తున్నాను"

"స్టెప్నీ వుందిగా"

"వుందికాని, కొత్త కారు! పైగా ఆపని కూడ పూర్తిగా తెలీదు నాకు"

"అయితే మీకేమీ తెలియవన్న మాట"

"సమయం రావాలిగా తెలుసుకోవడానికి" గోపాల్ నవ్వుతూ అన్నాడు.

"హాస్యాలకేంలెండి! ఏదైనా ఉపాయం "ఆలోచించండి"

ఆలోచించడానికేం వుంది! అంతా ఆ దేవుడి దయ"

"బాగుంది! ముందు మానవ ప్రయత్నం లేకుండా దైవ సహాయం అంటే ఎలా?"

"అంతగా భయపడతావేం జ్యోతీ! కాస్త ధైర్యం తెచ్చుకో"

అంతలో దూరాన వున్న స్టేషన్లో రైలు కూత విన్పించింది.

"పోనీ నిన్ను ట్రైన్ ఎక్కించేమంటావా"

"మరి మీరు"

నేను కారుకి కాపలా వుంటాను! తెల్లారితే ఎలాగోలా తీసుకు వస్తాను"

"స్టేషన్ ఎంత దూరం?"

"ఎంత దూరం? ఆరేడు మైళ్ళు అంతే" గోపాల్ వింతగా ఆమెను చూస్తూ అన్నాడు. ఆమెలో భయం ఎక్కువయింది. భయాన్ని అణుచుకోవడానికి ప్రయత్నిస్తూ-

"రండి! నేను సహాయం చేస్తాను! టైరు తీసేద్దాం" అంది.

గోపాల్ అందుకు అంగీకరించాడు. రోడ్డు పక్కకు కారును నెట్టాలన్నాడు. పైట చెంగును బొడ్లోదోపుకొంటూ అందుకు సిద్ధమయింది జ్యోతి. గోపాల్ జేబు నుండి సిగరెట్ తీసి వెలిగించాడు.

అతను సిగరెట్ తాగటం మొదట సారి చూసిన జ్యోతి ఆశ్చర్యంగా "ఇదేమిటి" అడిగింది.

"ఆలోచనల్ని దూరంగా తరిమేయటానికి అప్పుడప్పుడూ తాగుతుంటానులే! అలవాటు కాదనుకో"

జ్యోతి అతని దగ్గరగా వచ్చి, నోట్లోని సిగరెట్ తీసి దూరంగా విసిరేసింది.

"డాడీ ముందు కూడ తాగుతారా?"

"ఆయన ముందు తాగటానికి ధైర్యం లేదు. పైగా మర్యాద కూడ కాదు"

"అలా అయితే ఆయన కూతురు ముందు తాగటం కూడ మర్యాద కాదు"

గోపాల్కు మాటలు దొరకలేదు. మౌనంగా డిక్కీలోంచి జాకీ బయటకుతీసి వెన్నెల వెలుగులో దాన్ని అమర్చి కారును పైకెత్తడానికి ప్రయత్నించాడు. రాత్రి సమయం! ఊరికి, ప్రజలకీ దూరంగా... ఒంటరిగా... అందమైన అమ్మాయితో... గోపాల్కు విచిత్రంగా వుందా అనుభవం! ఇద్దరూ ఏకాంతంగా వున్నారు. కాని, పరిస్థితులూ, కర్తవ్య నిర్వహణా ఇద్దర్నీ దూరం చేస్తున్నాయి.

కారు కిందకు దూరి జాకీ తిప్పుతూ కారును ఎత్తుతున్నాడతను. జ్యోతి వంగి అతనికేసి చూస్తోంది. ఆ కళ్ళతో-ఆమె అలా తొంగి చూస్తోంటే దాహంగొన్న వ్యక్తి నదిలోకి ఆత్రంగా తొంగి చూస్తున్నట్టన్పించిందతనికి. దాహంతో అతను కూడ తపించి పోతున్నాడు.

జీవితంలో మళ్ళీ ఇంత మంచి సమయం వస్తుందో రాదో! జ్యోతి మనసేమిటో తెలుసుకోవాలని క్కూడా ఇదే మంచి సమయం ఏదో విధంగా తన మనసులోని మాట ఆమెకు తెలియజేస్తే!! ఈ అడవిలో - ఈ ఏకాంతంలో ఆమెకు మరింత దగ్గరయి ఆమె మనసేమిటో తెలుసుకొంటే ?

టైర్ మార్చాలన్నమాట పక్కకు నెట్టి లేచి నిల్చున్నాడు గోపాల్.

"ఈ పని నా ఒక్కడివల్లా కాదు" అన్నాడు.

"మరెలా"

"ఉదయం వరకూ ఇలా ఉండాల్సిందే

దేవుడు దయదలచి రేపుదయం ఎవరన్నా కన్పిస్తేనేగాని పని జరగదు"

"అయితే ఈ రాత్రంతా ఎలా?" చలి గాలి సోకకుండా కారు చాటుకు వెళ్తూ అంది జ్యోతి. పాలిపోయిన ఆమె మొహాన్ని చూసి నవ్వుతూ భుజాలెగ రేశాడు గోపాల్.

"మనమేం చేస్తాం! అదుగో అక్కడ చూడు దేవుడు దయ తలచాడు" అన్నాడు.

జ్యోతి విసిరేసిన సిగరెట్ ఎండు గడ్డిమీద పడటంతో మంట రాజుకుం టోంది. అక్కడక్కడ వెదికి ఎండు పుల్లలు మరిన్ని తెచ్చి మంట పెద్దది చేశాడు గోపాల్. చలికాచుకుంటూ అక్కడే కూర్చున్నాడు. జ్యోతి మాత్రం కారుని అంటిపెట్టుకొని అక్కడే ఆలో చనల్లో మునిగిపోయింది. ఎలాటి పరిస్థితుల్లోకి వచ్చి పడింది! ఈ రాత్రి గడపటం ఎలా?

"అలా వుండిపోయావేం! ఆలోచించి లాభంలేదు! ముందు చలి కాచుకో రా" పిల్చాడు గోపాల్.

జ్యోతి నెమ్మదిగా అడుగులు వేసు కుంటూ వచ్చింది. చలికి వణుకుతోంది. గోపాల్ పెద్ద రాయిని మంటకి దగ్గరగా జరిపి దానిమీద జ్యోతిని కూర్చోమ మన్నాడు. మౌనంగా ఆ రాయి మీద కూర్చొంది వెళ్ళి. కారులోంచి శాలువా తీసుకొచ్చాడు గోపాల్. ఆమె భుజాల మీదుగా కప్పాడు.

రాత్రి మరింతగా చిక్కబడింది. గుబురుగా పెరిగిన చెట్ల వలన వెన్నెల నేలనంటటం లేదు. చీకటిగ్గా వుంది. మంట వెలుగులో మాత్రం జ్యోతి మొహం కెంపులా మెరుస్తోంది. కార్లోంచి ఫ్లాస్కు తీసుకొనొచ్చి కప్పులోకి 'టీ' ఒంపాడు గోపాల్. పట్నం నుంచి తిరుగు ముఖం పట్టినప్పుడు జ్యోతి వద్దంటున్నా కొన్ని బోయిల్డ్ ఎగ్స్ కొన్నాడు. అవిప్పుడు ఎంత గానో పనికొస్తున్నాయి. గుడ్లు వొలుస్తూ ఆమెకేసి చూస్తూ నవ్వాడతను.

"ఆ సిగరెట్ పీక మనకెంతో ఉప కారం చేసిందికదూ ?" అన్నాడు "ఎందుకూ పనికిరావనుకున్న వస్తువులే ఒక్కో సమయంలో ఉపయోగపడతాయి పైగా ఇలాంటి అడవుల్లో మంట తప్పని సరిగా వుండాలి!"

"ఎందుకూ"

"మంటను చూస్తే క్రూర మృగాలు దగ్గరికి రావు"

"ఈ అడవిలో అవి కూడా వున్నాయా?" భయంగా అడిగింది జ్యోతి.

"అవికాక ఇంకేముంటాయి అడవుల్లో! మనం పట్నంలో షైరుకొట్టినట్టే పెద్ద పులులూ, చిరుతలూ ఇక్కడ రాత్రయితే తిరుగుతాయి."

"అయితే ప్రమాదమే" భయంగా నవ్వింది.

"అదుగో అప్పుడే భయపడిపోతు న్నావు. ఇప్పుడేగా అన్నావు- నేను పిరికి దాన్ని కానని."

జ్యోతి మాట్లాడకుండా గోపాల్ కేసి చూసింది. అతను పక్కనున్న తుపాకీ పట్టుకొని-"నువ్వేం భయపడకు! నేనుంటే ప్రమాదమన్నది నీ ఛాయలకొక్కడ రాదు" అన్నాడు.

'టీ' సిప్ చేస్తోంది జ్యోతి. ఆ చలిలో ఆ మంట కాచుకుంటూ 'టీ' తాగుతుంటే కలిగిన ఆనందం అంతా ఇంతా కాదు. నవ్వుతూ గోపాల్ని చూసిందామె.

సగం రాత్రి దాటింది. నాలుగు వైపులా నిశ్శబ్దం! అప్పుడప్పుడూ జంతువుల అరుపులు మాత్రం వినవస్తున్నాయి. ఆ అరుపులు వింటూంటే జ్యోతి గుండెలు 'ఝుళ్' మంటున్నాయి. చలి బారి నుండి తప్పుకొందికి అద్దాలన్నీ దించి కారు లాక్ చేశారు. జ్యోతి వెనుక సీట్లో పడుకొంది. ముందుసీట్లో గోపాల్ కూచున్నాడు. అతని చేతిలో తూటాలతో నిండిన తుపాకీ వుంది. ఇద్దరూ కళ్లు మూసుకొన్నారు కాని, ఎవరికీ నిద్ర రావట్లేదు. ఒకరి గుండెల చప్పుడు మరొకరికి వినిపిస్తోంది.

"జ్యోతీ" గోపాల్ పిలిచాడు.

"ఊఁ"

"నిద్రపోతున్నావా?"

"నిద్రొస్తున్నట్టుగా వుంది. కానీ రావట్లేదు."

"ఏం?"

"మంచి నిద్దర్లో వుండగా ఏ పెద్దపులయినా..."

"కారు తలుపులు మూసివున్నాయి. నా చేతిలో తుపాకీ వుంది. ఇంకా భయం దేనికి!"

"కాని మిమ్మల్ని. ఎలా నమ్మటం"

గోపాల్ తుళ్ళి పడ్డాడు.

"అంటే! నా గురించే నీ భయం అన్నమాట! నిశ్చింతగా నిద్రపో! నేనా చెట్టు కిందకి వెళ్లి పడుకొంటాను"

"వద్దొద్దు! నా వుద్దేశం మీరుకూడ నిద్రపోతారేమోనని అంతే కాని మీరంటే భయం ఎంత మాత్రం లేదు. మీలోనన్ను నేను చూసుకొంటూ భయపడటం అవివేకం"

గోపాల్ మనసులో అలజడి రేగింది. అతని కోరికలకూ చుట్టూ వున్న పరిస్థితులకూ మధ్య యుద్ధం చెలరేగుతోంది. కోరికల తుఫానులో అతను కొట్టుకుపోలేక, అర్థంలేని సంఘ నియమాలకు కట్టుబడిపోతున్నాడు. జ్యోతిని ఏదో అడగాలనుకొన్నాడు కాని, 'మీలో నన్ను నేను చూసుకొంటూ భయపడటం అవివేకం' అన్న ఆమె మాటలు ఎగిసే నిప్పులో నీళ్లు కుమ్మరించినట్టుగా అతని ప్రయత్నాల్ని చల్లబరుస్తున్నాయి.

"ఒకటడుగుతాను చెప్తారా" హఠాత్తుగా అంది జ్యోతి. ఆ ప్రశ్న వింటూ ఆశ్చర్యపోయాడు. నెమ్మదిగా తలెత్తి– "అడుగు" అన్నాడు.

"రత్న ఎవరు?"

జ్యోతి నోటినుండి రత్న పేరు వింటూనే తడబడ్డాడు గోపాల్. నిలదొక్కుకోలేకపోయాడు.

"ఓ అడవి పిల్ల" అన్నాడు.

"ఆమెతో మీకెలా పరిచయం?"

"ఒకరోజు వేటలో గురి తప్పాను. తూటా ఆమెకు తగిలింది. చనిపోతుందనుకొన్నాను. కాని, బతికి బయటపడింది"

"మీరంటే ఆమెకు చాలా కోపం కదూ"

"కోపమా? ఎందుకు? నిజానికి నేను దగ్గర లేకపోతే చాలు! తిండీ తిప్పలూ మానేస్తుంది"

"ఎక్కడ వుంటోంది?"

"అడవిలో ఓ స్నేహితుడింట"

"ఏం? ఆమెకు ఎవరూ లేరా?"

"ఈ లోకంలో ఆమె ఏకాకి. నేను తప్పించి ఆమెకు 'నా' అనేవారెవరూ లేరు"

"ఆమెను ఇంటికి తీసుకురావచ్చుగా"

"దాడికి కోపం వస్తే..."

"ఫరవాలేదు నేను చెప్తానాయన్తో!"

"సమయం వస్తే తప్పక సహాయం చేద్దువుగాని"

జ్యోతి కాసేపు మౌనంగా కూర్చుంది. గోపాల్ మాటలు ఆమె మనసులో ఏవో ఆలోచనల్ని రేపుతున్నాయి.

"ఎలా వుంటుందామె?"

"నీ కంటే ఎక్కువ అందంగా ఉంటుంది. కాని, నాకు మాత్రం నువ్వే బాగుంటావు"

"ఎందుకని?"

"నాలాగే ఆమె కూడా అడవిపిల్ల! నువ్వయితే బియ్యే చదివావు"

జ్యోతి చటుక్కున సంభాషణ ఆపేసింది. నిద్రపోయింది. తన రహస్యాన్ని విప్పి చెప్పేశాడు గోపాల్. బాధపడి వుంటుందామె.

అంతవరకూ చెట్ల కొమ్మల్లో దాగుడు మూతలాడిన చంద్రుడు పూర్తిగా ఆకాశంలో కరిగిపోయాడు. నిశ్శబ్దంగా వుంది వాతావరణం.

* * *

మర్నాడు ఉదయం ఇంటికి చేరుకొనే



సరికి అందరూ ఆందోళనగా ఎదురు చూస్తున్నారు. గోపాల్, జ్యోతి క్షేమంగా కారులోంచి దిగుతోంటేనే కాని, వాళ్ళ మనసులు కుదుటపడలేదు. ఆలస్యానికి కల్నల్‌గారు కారణం అడిగారు. జ్యోతి కథంతా వివరంగా చెప్పింది. ఇద్దరూ రాత్రంతా ఒంటరిగా గడిపేరని తెలిసే సరికి సూరజ్, సాహస్‌ల మొహాలు వంకరబోయాయి. గోపాల్ ఓరకంటితో ఆ ఇద్దర్నీ గమనించాడు.

మధ్యాహ్నం గోపాల్ తండ్రిని కలవ డానికి వెళ్ళేసరికి అన్నదమ్ములిద్దరూ మూతులు బిగించుకుని కూర్చొనున్నారు. వాళ్ళిద్దరికీ గోపాల్‌ను గురించి అను మానం! కాని గోపాల్ అంతగా పట్టించు కోలేదు వాళ్ళని. ఎదురుగా వున్న కూజా లోని నీళ్ళొంపుకొని తాగాడు. అన్న దమ్ములిద్దరూ గంభీరంగా అతన్నే చూస్తు న్నారు. నీళ్ళు తాగేక తెచ్చిన ప్యాకెట్‌ను తండ్రి ఒళ్ళోనికి విసిరేశాడు గోపాల్. దాన్ని చూశాక సాహస్ మొహంలో



మార్పు వచ్చింది. ప్యాకెట్లో రెండు ఉన్ని స్వెట్టర్లున్నాయి.

"ఒకటి పెదనాన్న కోసం"

సావన్ ఓ స్వెట్టర్ సూరజ్ చేతికి అందించాడు. సూరజ్ నొసలు చిట్లిస్తూ దాన్ని చూశాడు.

"నచ్చిందా" గోపాల్ అడిగాడు.

"నువ్వు తీసుకురావటం, నచ్చక పోవటమూనా" నవ్వును మొహానికి పులుముకొంటూ అన్నాడు సూరజ్. వెంటనే "నీ పద్ధతి మాత్రం ఏం నచ్చ లేదు" అన్నాడు.

"ఏమిటి?"

"రాత్రంతా అడవిలో వుండటం, టైరు మార్చినా, చక్రం మార్చినా ఓ గంట చాలు! రాత్రంతా అక్కర్లేదు"

"కాని, బ్రతుకును మార్చుకోవాలను కొంటే చాలా రాత్రులు అవసరం"

"గోపాల్" సూరజ్ కోపంగా అరిచాడు.

"ఇందులో అలా కేకలు వేయడాని కేముంది? మీ మనసులో ఏముందో నాకు బాగా తెలుసు! జ్యోతికి నాకు మధ్య అడ్డుగోడలు కట్టాలనుకొంటే అది అసం భవం."

"గూట్లో పిల్లకి రెక్కలొస్తున్నా యన్నమాట. ఆ రోజులు మరచిపోయావా? నాలుగు వేళ్ళు నోటికి వెళ్ళేసరికి సమా ధానాలిస్తున్నావు"

"నువ్వు చేసిన సహాయానికి కృతజ్ఞ తలు! ప్రతిఫలంగా ఏం కావాలో చెప్పు"

"అంతవాడివి కూడా అయ్యావన్న మాట."

"అంతా నీ చలవే! నన్నీ స్థితిలో ఇరికించింది నువ్వు. మనిషిని రెండుగా చీల్చి ఆత్మనొకరు, శరీరాన్నొకరు పంచుకొంటున్నారు! నాతో ఆట్లాడు కొంటున్నారు."

"అదన్నమాట సంగతి."

"నేనేమయినా చేస్తాను. దగాలు, మోసాలు చేసి నన్ను బంధించలేరు. జ్ఞాపకం వుంచుకోండి. ఏదో ఒకరోజు నేను స్వేచ్ఛగా ఎగిరిపోతాను" అంటూ గోపాల్ పెద్దగా అంగలు వేసుకొంటూ అక్కణ్నుంచి వెళ్ళిపోయాడు. సావన్ ఆపటానికి ప్రయత్నించాడు. కాని, సూరజ్ అతని ప్రయత్నాన్ని వారిం చాడు.

"ఇదేమిటన్నయ్యా?" భయంగా అడిగాడు సావన్.

"ఏం కాదు! రెక్కలు కత్తిరించిన పక్షి ఎలా ఎగురుతుంది? మన మీదికి లేచే ముందు తనే నేలకొరుగుతుందని తెలీదు పాపం!"

సావన్ తలాడిస్తూ సూరజ్ మాటల్ని సమర్థించాడు. మోసం, కుట్ర, అతని ఆలోచనా శక్తిని నాశనం చేస్తున్నాయి. స్వార్థం అతని కళ్ళు మూసి అంధుణ్ని చేస్తోంది. తన కొడుకు భవిష్యత్తును ఏ మాత్రం ఆలోచించటం లేదతను.



గోపాల్ తన గదిలో కూర్చున్నాడు. ద్వారం దగ్గర చప్పుడయింది. కర్టెను తొలగించుకొంటూ జ్యోతి లోపలికి

వచ్చింది. అప్పటి వరకూ చూస్తోన్న కాగితాన్ని చటుక్కున కోటు జేబులో దాచేశాడు గోపాల్. జ్యోతి సందేహంగా చూసింది.

"దాపరికమా! ఏమిటి?" అనడిగింది.

"అబ్బే ఏం లేదు! ఏదో కాగితం"

"ఇలా ఇవ్వండి చూస్తాను"

"చూస్తావా? చూసి ఏం చేస్తావ్?"

"సూటిగా చెప్పరాదూ! అది రత్న రాసిన వుత్తరం అవునా?"

"ఆ అడవిపిల్ల ఏంరాస్తుందీ" నవ్వుతూ అన్నాడు గోపాల్.

"రాయదలచుకొంటే కంటికాటుకతో నైనా రాయగలదు. ప్రేమలేఖలకి రాయడం, చదవడం రానక్ఖర్లేదు ' నా ఉద్దేశ్యంలో"

ఆమె మాటలకి గోపాల్ నవ్వు కొన్నాడు. జేబులోంచి కాగితాన్ని తీసి ముక్కలుగా చించేశాడు. కిటికీలోంచి బయటకు విసిరేశాడు. ఆశ్చర్యపోయింది జ్యోతి.

"నేనెందుకు వచ్చానో తెలుసా?"

"ఏమో నాకేం తెలుసు!"

"మీరు మాటిచ్చారు? అప్పుడే మరిచి పోయారా?"

"కారు డ్రయివింగ్ నేర్చుకోడానికా! ముందు డాడీ పర్మిషన్ తీసుకోవాలి"

అతని మాటలింకా పూర్తి కాలేదు కల్నల్‌గారు చేతిలో టెలిగ్రాంతో లోని కొచ్చారు. "పర్మిషన్ దేనికి?" అడిగారు.

గోపాల్ చెప్పాడు.

"జ్యోతి డ్రయివింగ్ నేర్పమంటోంది నేర్పమంటారా? ఇంతకీ నేర్చుకోగలదా"

"ఎందుకు నేర్చుకోలేదు ? నా తల్లి కారు డ్రయివింగేమిటి! తుపాకీ పేల్చడం కూడా నేర్చుకొందంటే గురిచూడ్డంలో నిన్ను మించిపోతుంది తెలుసా?"

"నిజమే డాడీ ! అసలు తుపాకీ ఎందుకు ? అలా ఆమె నిలబడితే చాలు పక్షులు భయంతో ఆమె కాళ్ళముందు మోకరిల్లిపోతాయి" అన్నాడు గోపాల్. ఆ మాటలు నిజమన్నట్టుగా ఓ పిచ్చుక పైనుండి జ్యోతి కాళ్ళదరికొచ్చిపడింది. అది చూసి కల్నల్‌గారు నవ్వారు. జ్యోతికి మొదట సిగ్గన్పించినా తర్వాత పగలబడి నవ్వింది.

"ఆ టెలిగ్రాం ఏమిటి డాడీ" అనడి గింది జ్యోతి.

"ఈ టెలిగ్రాం! అన్నట్టు గోపాల్ నువ్వు ఎల్లుండి సాయంత్రం స్టేషన్‌కు వెళ్ళాలి"

"ఎందుకు డాడీ"

"ఓ అతిథి వస్తున్నాడు"

"ఎవరతను?"

కల్నల్‌గారు నవ్వుతూ జ్యోతికేసి చూశారు. జ్యోతికి చూచాయగా అర్థ మయింది. ఆమె ముఖం ఎర్రబారింది. తండ్రి గోపాల్‌తో ఏదో చెప్పాలను కుంటున్నారని తెలిసి, బయటకు నడిచిం దామె. ద్వారం దగ్గర ఆగి వారి మాటలు వింది.

పట్నంనుండి జ్యోతిని చూడ్డానికి పెళ్ళివారు వస్తున్నారట! అబ్బాయి డాక్టర్! వాళ్ళని తీసుకురావడానికి స్టేషన్‌కు వెళ్ళాలి గోపాల్.

జ్యోతి పరుగెత్తుకుంటూ తన గది లోనికి వెళ్ళిపోయింది. ఆమె హృదయం తేలిపోతోంది. అతను డాక్టర్! తనని చూట్టానికి వస్తున్నాడు! ఇదేమిటి డాడీ హఠాత్తుగా ఇలా చేశారు? జ్యోతి తియ్యని వూహల్లో తేలిపోతూ కిటికీ దగ్గరగా నడి

చింది. వెనుక ఎవరో వున్నారనిపించి వెనుతిరిగి చూసింది. ఎదురుగా గోపాల్! అతన్ని చూస్తూ ఆశ్చర్యపోయింది జ్యోతి. విచారంగా వున్నాడతను. ఏదో పోగొట్టుకొన్నవాడిలా కన్పిస్తున్నాడు. ఒకరినొకరు మౌనంగా చూసుకున్నారు.

"డ్రైవింగ్ నేర్చుకోవడానికి రావా? ఇక నేర్పక తప్పదుమరి" గంభీరంగా అన్నాడు గోపాల్.

"ఏం?"

"డాక్టర్‌గార్ని కారులో తిప్పాలిగా నువ్వు" కంగారుగా అన్నాడతను.

"కంగారుగా వున్నారేమిటి" హేళనగా అంది జ్యోతి.

"కంగారా! ఎందుకు?" బలవంతంగా నవ్వు తెచ్చుకుంటూ అడిగాడు.

మొహం అలా వాడిపోయిందెందుకని? మీకు శుభ వార్తలా లేదా?"

"నీకు మాత్రం చాలా సంతోషంగా వుంది కదూ!"

"ఎందుకుండదు! బ్రతుకులో భాగం పంచుకొనేవాడు సహృదయుడైతే ... అయినా ఇదేమిటి అర్థంలేని మాటలు! ముందు వాళ్ళు రావాలి–ఎవరో! ఎలా వుంటారో చూడాలి. ఆతర్వాత..."

"ఆ విషయాలేవీ తెలుసుకోకుండానే దాడీ ముందడుగు వేస్తారా? అయినా అతను డాక్టరు కదా!"

"ఏం? మీకు అసూయగా వుందా? లేక మీ అధికారాన్ని ఎవరో లాక్కుపోతారని అనుమానంగా వుం దా?" కొంటెగా అడిగింది.

"ఇందులో మీ తప్పేమీలేదు. మనసు అలాంటిది. ఒకోసారి కారణం లేకుండానే ఇతరులమీద ఈర్ష్యల్ని,ద్వేషాల్ని పెంచుకుంటుంది"

"ఈర్ష్యా ద్వేషాలా?"

"అదే మొదట మీరు రత్న గురించి చెప్పినపుడు నాకలాగే అన్పించింది"

"ఎందుకని"

"చెప్పానుగా! మనిషి మనసు అలాంటిది"

గోపాల్ తీక్షణంగా జ్యోతిని చూసి వెనుతిరిగాడు. ఆమె తన హృదయంలో చెలరేగే జ్వాలల్ని తెలుసుకోలేక పోతోందా? లేక తన మనసులోని కల్లోలాన్ని తన అమాయకత్వంతో అణచి వేయాలనుకుంటోందా? ఏమిటిది?

"డ్రయివింగ్ నేర్పరా" వెళ్తున్నవాడల్లా ఆగిపోయాడు. వెనక్కి తిరిగి "నీకు నేర్చుకోవాలని వుందా" అనడిగాడు.

"ఉంది కాని ఓ షరతు"

"ఏమిటి"

"ఈరోజు రత్నను పరిచయం చెయ్యాలి"

"ఆ అడవిపిల్లను చూసి ఏం చేస్తావ్"

"నాగరికత నేర్పిస్తాను"

"అది అంత తేలికకాదు"

"ఆ విషయం నాకొదిలేయండి"

"సరే ! నడు"

కొద్ది సేపట్లోనే ఇద్దరూ శ్యామ్‌గఢ్ అడవి రోడ్డును కార్లో దాటారు. జ్యోతి గోపాల్‌తో పాటు ముందు సీట్లో కూర్చొంది. ఆమె మనసు ప్రశాంతంగా వుంది. గోపాల్ మాత్రం డాక్టర్ రాక విన్న దగ్గర్నుంచి తను కన్న కలలు కల్లలవుతున్నట్టుగా బాధపడుతున్నాడు. రత్నని కలుస్తున్నందుకు జ్యోతికి సంతోషంగా, కుతూహలంగా వుంది. ఇద్దరికిద్దరూ వేర్వేరుగా ఆలోచిస్తున్నారు.

గోపాల్ కారుని నది ప్రక్కగా వున్న విశాల మైదానంలో ఆపాడు. అక్కడి

వాతావరణాన్ని చూసి జ్యోతి ముగ్ధురాలయింది.

"ఇప్పుడేం చేద్దాం" ప్రశ్నించింది జ్యోతి.

"కారు డ్రయివింగ్ నేర్చుకొంటూవు"

"అయితే విఘ్నేశ్వర పూజ చదవండి"

"జ్యోతీ! కారు నడపటం నేర్చుకొనే ముందు ఓవిషయాన్ని మాత్రం గుర్తుంచుకొంటావా?"

"ఏమిటి?"

"నీ జీవితంలో ఎప్పుడూ ఈగురువును మాత్రం మరిచిపోవద్దు"

"చూద్దాం! ముందు నేర్చుకోవాలిగా"

"అయితే రా!" నవ్వు తెచ్చుకొంటూ అన్నాడు గోపాల్.

ఆమె స్టీరింగ్ పట్టుకొని కారు నడుపుతూ వుంటే- అటూ ఇటూ కారు పరుగెడుతూ వుంటే కుదుపులకి జ్యోతి అతని వళ్ళో వాలిపోయేది. సిగ్గు పడేది. కారు పార్ట్సు, అవి పనిచేసే విధానం అన్నీ తెలియజేశాడు గోపాల్. కాని, అతన్లో విరామం లేని ద్వంద్వ యుద్ధం సాగుతోంది. ఇద్దరికిద్దరూ భావాలలో పరస్పర వ్యతిరేకులు! తన జీవితాన్ని తరచిచూచినప్పుడల్లా భయంకరంగా కన్పిస్తోంది! జ్యోతిని లేవదీసుకునిపోతేనో!? ఛీ! ఆ ఆలోచనే ఎంత అసహ్యంగా వుంది? తనలో అంత సాహసం కూడా లేదు. అసలు జ్యోతి సహకరిస్తుందా? ఈ మార్గంలో తను ఏకాకి! పోనీ తన రహస్యం జ్యోతికి చెప్పేస్తే!! చెప్తే తప్పకుండా అసహ్యించుకొంటుంది. తన మొహం కూడ చూడదు. ఛీ! ఛీ! తనదెంత నికృష్టమయిన బతుకు!?

హఠాత్తుగా కారు కుదుపునిచ్చేసరికి ఆశ్చర్యపడి స్టీరింగ్ అందుకోబోయాడు గోపాల్. కాని, అంతలోనే జ్యోతి కారును అదుపులోనికి తెచ్చింది. ఆమె సమయస్ఫూర్తిని మెచ్చుకొన్నాడతను.

"ఇంతకు ముందే నీకు కారు నడపటం వచ్చన్నమాట"

"అది మీరెలా కనిపెట్టారు?"

"డ్రయివింగ్ తెలీనివాళ్లు కారుని కంట్రోల్ చేయలేరు."

"నిజమే"

"ఎప్పుడు నేర్చుకొన్నావు?"

"కాలేజీలో చదువుకొన్నప్పుడు— ఓ ఫ్రెండ్ దగ్గర"

"మరి నాతో మళ్ళీ..."

"నేర్చుకొన్నానే కాని, ప్రాక్టీసు చేయలేదుగా! అదిప్పుడు చేస్తున్నాను"

"ఆ స్నేహితురాలెవరో కాని, నాకు చాలా తేలిక చేసింది" అంటూ గోపాల్ కారు వేగం ఎక్కువ చేసి ఆమెకుమరింత దగ్గరగా జరిగాడు. కారు మలుపు తిరుగుతున్నప్పుడల్లా, జ్యోతి తూలి గోపాల్ గుండెల మీద పడుతునేవుంది. నిండుగా పూలు పూసిన కొమ్మ తన మీదకు ఒరుగుతున్నట్టన్పించిందతనికి.

జ్యోతి తనకిచ్చిన మాటను అతనికి జ్ఞాపకం చేసింది. కారును, అడవిలోకి పోతున్న నాటు రోడ్డు మీదకు తీసుకొచ్చాడతను. విరగబూసిన పూలతో గుబురుగా పెరిగిన చెట్లను చూస్తూ రత్న గురించి ఆలోచిస్తోంది జ్యోతి. రత్నెలా వుంటుంది? తన కంటే అందంగా వుంటుందా? ఆమెను చూశాక తనకే మన్పిస్తుంది? గోపాల్ ఆమెను అడవిలోనే వుంచడానికి కారణం ఏమిటి?

గుబురుగా వున్న చెట్లను దాటి ఓ

గుడిసె ముందుకు వచ్చారు. కారు ఆపు తూనే గోపాల్ హారన్ కొట్టాడు. ఇద్దరు వ్యక్తులు పరుగెత్తుకొంటూ వచ్చారు. గోపాల్ కారు దిగగానే ఆ ఇద్దరూ అతన్ని కౌగలించుకొన్నారు. తర్వాత జ్యోతిని ఆశ్చర్యంగా చూశారు. గోపాల్ నవ్వుతూ, ఆమె కల్నల్‌గారి కూతురని, అడవి చూడ్డానికి వచ్చిందని చెప్పాడు.

"రత్న ఎక్కడుంది?" గోపాల్ అడిగాడు.

"రత్నని ఇక మేం భరించలేం బాబూ! మీతో తీసుకుపొండి! నిన్నసల్లా ఏం తినలేదు" వాళ్ళలో ఒకడన్నాడు.

"ఇప్పుడెక్కడుంది?"

"ఇక్కడే ఎక్కడో వుంటుంది"

గోపాల్ ఆత్రంగా అటూ ఇటూ చూడటం జ్యోతి గమనించింది. ఆమె కూడా రత్నని చూడాలని ఆత్రంగా వుంది. గోపాల్ గట్టిగా–'రత్నా! రత్నా!' అంటూ పిలిచాడు. అడవిలో ఆ ధ్వని ప్రతిధ్వనించింది. జ్యోతి ఊపిరి బిగపట్టుకొని అటూ ఇటూ చూస్తోంది–ఏవైపునుంచీ రత్న పరుగెత్తుకొనివస్తోందోనని.

కొన్ని క్షణాలు ఆగి మళ్ళీ పిలిచాడు. ఈసారి దగ్గరున్న పొదలలో ఏదో చప్పుడు వినిపించింది. ఎండుటాకుల మీంచి ఎవరో పరుగెత్తుకువస్తోన్నట్టనిపించింది. జ్యోతి ఉత్సాహంగా అటుకేసి చూసింది.

ఒక లేడిపిల్ల పరుగెత్తుకొంటూ గోపాల్ కాళ్ళ దగ్గరికొచ్చి చేరింది. గోపాల్ దాన్నెత్తుకొని తల నిమురుతూ–

"ఇదే రత్న! నచ్చిందా!" అనడిగాడు.

రత్నా? "మరి అడవిపిల్ల?!"

"ఇదే! దీనిపేరే రత్న! దీన్నే నేను ప్రేమిస్తున్నాను"

"మరి...ఆ...అమ్మాయి?"

"ఏ అమ్మాయి? ఈ అమాయక ప్రేమికురాల్ని కాదని ఇంకెవరిని ప్రేమించాలి" గోపాల్ లేడి పిల్లను కిందికి వది లేస్తూ అన్నాడు. జ్యోతి అతన్ని ఆశ్చర్యంగా చూసింది. ఆ రోజు తను చూసిన వుత్తరంలోని వాక్యాలు గుర్తుచేసుకొంది. నవ్వు ముంచుకొచ్చింది. నవ్వుతూ వెళ్ళి కార్లో కూర్చొంది. రత్న గోపాల్ కాళ్ళను రాసుకొంటూ, అటూ ఇటూ గెంతుతూ ఆప్యాయంగా అతనిచుట్టూ తిరుగుతోంది.

తర్వాత కారు తిరుగు ముఖం పట్టింది. ఇద్దరూ మౌనంగా కూర్చుని ఎదురుగా పరుచుకొని వున్న రోడ్డునే చూస్తున్నారు. జ్యోతి మరోసారి పగలబడి నవ్వింది ఆమె నవ్వుచూసి గోపాల్ కూడా నవ్వాడు.

దగ్గర్లో ఎవరో పాడుకొంటున్నారు. పాటలు విన్పిస్తున్నాయి. జ్యోతి ప్రశ్నార్థకంగా గోపాల్ వైపు చూసింది.

"అక్కడ జిప్సీలు బస చేసినట్టున్నారు! బాగా తాగి ఆటలాడుతున్నట్టున్నారు! చూస్తావా?" అనడిగాడు గోపాల్

"లేదు! ఇప్పటికే చాలా ఆలస్యం అయింది. ఈమారెప్పుడన్నా..."

"అవునవును ఆలస్యం అయింది. ఇంటి దగ్గర చేయాల్సిన పనులు చాలా వున్నాయి కదూ! వేగంగా వెళ్ళాలి"

"ఏం పనులు?"

"ఎల్లుండి డాక్టర్‌గారొస్తున్నారు కదా"

"మళ్ళీ హాస్యాలా"

"హాస్యం కాదు! నువ్వు నా రత్నని చూశాక! మరి నేను మీ డాక్టర్ని చూడొద్దా" ఆ మాటలకి జ్యోతి నవ్వును బలవంతంగా ఆపుకొంది.

"నేనేమో అందమైన అడవి పిల్ల అను

కొన్నాను"

"నిజంగా అడవి పిల్ల అయితే..."

"నా కూడ తీసుకవచ్చేదాన్ని"

"తీసుకొచ్చి..."

"డాడీతో చెప్పి మీఇద్దరి పెళ్ళి జరిపించేదాన్ని"

"అయ్యో! అనవసరంగా ఎంత కాలం వృథా చేశానయితే"

"ఏం?"

"నిజానికి ఎవరో అమ్మాయిని ప్రేమిస్తే ఎంత బాగుణ్ను"

"బాధ పడకండి! మీ కోసం ఓ మంచమ్మాయిని వెతికి తీసుకొస్తాను."

"నిజంగానా? ఎప్పుడు?" కొంటెగా నవ్వుతూ అడిగాడు.

"అంత తొందరయితే ఎలా? సరే! చెప్పండి మీకెలాంటమ్మాయికావాలి? పట్నవాసి సీతాకోకచిలుకా, పల్లెవాసి గంగిగోవా?"

"నాకేం తెలుసు"

"అదేం కుదరదు! చెప్పితీరాలి"

"అయితే విను! అచ్చం నీలా వుండాలి! ఇదే రంగు ఇదే రూపం'' నెమ్మదిగా ఆగి ఆగి అన్నాడతను.

ఆ మాటలు వింటూనే జ్యోతి గతుక్కుమంది. ముఖం తెల్లగా పాలిపోయింది. తనలోని కలవరపాటు పైకి కన్పించనీయకుండా, చేతి వేళ్ళ గోళ్ళు చూసుకొంటూ వుండిపోయిందామె. అలా మాట్లాడినందుకు గోపాల్ కూడా కలవరపడ్డాడు.

"నీ అంత అందంగా లేకపోయినా, కాస్త ఛాయ తక్కువైనా పర్వాలేదు" అన్నాడు తర్వాత.

జ్యోతి అనాయాసంగా నవ్వేసింది. 'నేనెంత మూర్ఖురాల్ని అతని మాటల్ని అపార్థం చేసుకొన్నాను' అనుకుంది. కాని నెమ్మదిగా ముందుకు పోతోంది.




ట్రైను రావడానికింకా అరగంట పడుతుంది. స్టేషన్లో వచ్చే రైలు కోసం సూరజ్, గోపాల్ ఎదురు చూస్తున్నారు. ఇద్దరూ మాట్లాడుకోవటం లేదు. సూరజ్ ఏవేవో ప్రశ్నలు వేస్తున్నా గోపాల్ వాటికేమీ సమాధానమివ్వటం లేదు.

డాక్టర్ భోలానాథ్ తల్లితో కలిసి కల్నల్‌గారింటికి వస్తున్నాడు - పెళ్ళి చూపుల కోసం.

జ్యోతికి పెళ్ళంటే ఆనందంగా వుంది. ఇంత తొందరగా ఎందుకంటూ అభ్యంతరం కూడా చెప్పలేదు. తన గురించి ఆమెకు ఎలాటి భావమూ లేదు. ఉంటే, అలా సంతోషంగా వుండదనుకొన్నాడు గోపాల్. చాలా హుషారుగా ఇంటిని అలంకరిస్తూ, పనివాళ్ళని పురమాయిస్తూ హడావుడిగా ఇల్లంతాతిరుగుతోంది జ్యోతి.

''వచ్చేవాళ్ళని ఇంటికి తోడ్కొని పోవటం తనపని! తన పనిని సజావుగా నిర్వర్తించాలి!'' అనుకొన్నాడు గోపాల్. స్టేషన్‌కు బయల్దేరుతూ కిటికీ దగ్గర నిల్చున్న జ్యోతిని చూశాడు. ఆనందంగా వుంది. ఆమె ఆనందం చూస్తే అసూయ కలిగింది. తన బాధని దాచుకొంటూ ఆమెకేసి చూసి నవ్వాడు. చేయి వూపి వీడ్కోలిచ్చింది.

అతను మనసా, వాచా ఆమెనే కోరు కొంటున్నాడు. ఆమె కోసం, ఆమె ప్రేమ కోసం ఏం చేయడానికయినా సిద్ధంగా వున్నాడు. అందుకే-ఆమె సుఖ సంతోషాల కోసం తన భావాల్ని, కోరికల్ని తనలోనే నొక్కి పెట్టాలి, తప్పదు !

"అంత తీవ్రంగా ఆలోచిస్తున్నావేమిటి ?" సూరజ్ అతనికేసి చూస్తూ అన్నాడు. గోపాల్ తనలో రేగుతున్న అలజడిని అణుచుకోలేకపోయాడు.

"నువ్వెప్పుడయినా చావు కోసం సిద్ధపడ్తూన్న మనిషిని చూశావా" అనడిగాడు.

అతనున్న స్థితిని గ్రహించాడు సూరజ్. అనునయంగా తడుతూ— "విచారించకు ! నువ్వు చావు అనుకొంటున్నది చావుకాదు! అది స్వర్గం" అన్నాడు.

"క్షణంలో చావబోతుండే స్వర్గం ఏమిటి పెదనాన్నా"

"అది నీకు అర్థం కాదు! జ్యోతికి పెళ్ళికానీ... ఆతర్వాత నీకే అర్థం అవుతుంది. జ్యోతిని మించిన అందగత్తెలు వేల మంది నీ కాళ్ళ దగ్గరికొస్తారు"

సూరజ్ మాటలు అసహ్యమన్పించి ముందుకు నడిచాడు గోపాల్.

ట్రైనొచ్చింది. ప్లాట్‌ఫాం మీద మనుషులెవరూ లేరు. ఒకరిద్దరు ప్రయాణీకులు దిగారు. గోపాల్, సూరజ్ పరిశీలనగా పెట్టెలన్నీ చూశారు. ఆ వచ్చేవాళ్ళని పోల్చుకోవటం పెద్ద సమస్యకాలేదు. ఫస్ట్‌క్లాస్ కంపార్టుమెంట్ నుండి ఓ యువకుడు, ఓ మధ్య వయస్కురాలు దిగేరు. వాళ్ళ చేతుల్లో వున్న కొత్త సూట్ కేసూ, బెడ్డింగూ, పళ్ళబుట్టా చూసేసరికి 'వాళ్ళే'నని గ్రహించారిద్దరూ.

శ్యామ్‌గఢ్‌కు అలాంటి అప్-టు-డేట్ వ్యక్తులెవరూరారు. వచ్చేరు అంటే వారు తప్పనిసరిగా కల్నల్‌గారికి కావల్సిన వాళ్ళే అయ్యుంటారు. గోపాల్ వాళ్ళ దగ్గరికి నడిచాడు.

యువకుడు సామాన్లు దించుతున్నాడు. మధ్యవయస్కురాలు భుజాలమీది శాలువా



సర్దుకొంటూ ఎదురుగా వున్న గోపాల్ని చూసింది. గోపాల్ చిరునవ్వుతో–

"అలహాబాదు నుండి వచ్చారా" అనడిగాడు.

"అవును. అక్కణ్ణుంచే వస్తున్నాం! మీరు కల్నల్‌గారి తాలూకా..."

"కల్నల్‌గారు మిమ్మల్ని తీసుకు రమ్మన్నారు".

"ఆయన రాలేదూ!" గంభీరంగా అడిగిందామె.

కల్నల్‌గారు రానందుకు కారణం ఏం చెప్పాలో తెలియక సూరజ్ కేసి తిరిగాడు గోపాల్. సూరజ్ కంగారుగా ఆమెను చూస్తూ చేతులు జోడించాడు. ప్రతి నమస్కారం చేసిందామె.

"ఇంటికి వెళ్ళి తీరిగ్గా మాట్లాడుకొందాం పదండి" అంటూ సామాన్లు అందుకొన్నాడు గోపాల్. మధ్య వయస్సురాలు "డాక్టర్ బాబూ" అంటూ కొడుకును పిలిచింది. సామాన్లు దించుతూన్న యువకుడు ముందుకొచ్చి "అమ్మా! లోపలింకేం లేవు" అంటూనే తల్లి దగ్గర నిల్చున్న వ్యక్తుల్ని చూసి కంగారు పడ్డాడు.

"కల్నల్‌గారికి పాదాభివందనం చెయ్యి" తల్లి ఆదేశించింది.

కొడుకు తక్షణం సర్కస్ ఫీట్‌లోలా ముందుకు వంగి, సూరజ్ పాదాలు అందుకొన్నాడు.

సూరజ్ వణికిపోతూ పక్కకి తొలిగాడు. గోపాల్ అతి కష్టం మీద నవ్వాపుకొంటూ డాక్టర్ని పరిశీలించాడు. కొండముచ్చులా ఉంది మొహం! కళ్ళకు సోడాబుడ్డి అద్దాలు! ఈ డాక్టర్ని చూశాక జ్యోతి ప్రాణం పోయినాసరే అతన్ని భర్తగా అంగీకరించదనిపించింది.

"కూలీ! కూలీ!" డాక్టర్ అరిచాడు. నిర్మానుష్యంగా వున్న ప్లాట్‌ఫాం అతని అరుపులకు ప్రతిధ్వనించింది.

"డాక్టర్ సాబ్! ఇక్కడ కూలీలుండరు. ఎవరి లగేజీ వాళ్ళే మోసుకోవాలి" అంటూ గోపాల్ ఓ సూట్ కేస్ అందుకొన్నాడు. అది చూసి సూరజ్ ముందుకొచ్చి బెడ్డింగ్ అందుకోబోయాడు. గోపాల్ అతన్ని వారిస్తూ–

"మీరుండండి, డాడీ! నేనే తీసుకొస్తాను" అన్నాడు.

గోపాల్ ఓ చేత్తో సూట్‌కేసు పట్టుకొని మరోచేత్తో బెడ్డింగ్ ఎత్తుతూ పడిపోతున్నట్టు ముందుకు తూలాడు. దాంతో డాక్టర్‌గారికి బెడ్డింగ్ మోయక తప్పలేదు. సూరజ్ పండ్ల బుట్ట అందుకొన్నాడు. అందరూ స్టేషన్ బయటికి నడిచారు. డాక్టర్ మొహం చిట్లించుకొంటూ–

"నాన్‌సెన్స్! ఇంత పెద్ద స్టేషన్లో ఒక్క కూలీ కూడా లేడు" అన్నాడు.

"ఉండాల్సిందే డాక్టర్‌సాబ్! కాని ఈ ఊరి జనం వాళ్ళని తన్ని తగిలేశారు" అన్నాడు గోపాల్.

"ఎందుకని?"

"ఇక్కడి పద్ధతులే అలాంటివి. ఎవరి పన్లు వాళ్ళే చేసుకోవాలి అంతే."

ఆ మాటలు వింటూనే డాక్టర్‌గారికి వణుకు పుట్టుకొచ్చి చేతుల్లోని బెడ్డింగ్ జారి కింద పడింది. గోపాల్ నవ్వుకొన్నాడు. బెడ్డింగ్ ఎత్తి అతనికి అందించాడు.

"మీరు భయపడకండి! మన కోసం మాత్రం ఈ వూరివాళ్ళు ప్రత్యేకంగా అనుమతినిస్తారు" అన్నాడు.

సూరజ్ భయంగా వణుకుతూ అప

గులు వేస్తున్నాడు. గోపాల్ వాళ్ళని ఆట పట్టించడం చూస్తూ నోరు మెదపలేక పోతున్నాడు. వాళ్ళకి నిజం తెలిస్తే తన ప్రాణాలు దక్కవు! అది మాత్రం నిజం! ఆ ఊహకే సూరజ్ గడగడ లాడిపోతున్నాడు.

స్టేషన్ ముందున్న కొత్త కారుని చూశాక తల్లీ కొడుకుల కోపం తగ్గిపోయింది. కారులో దర్జాగా కూర్చొంటూ, కల్నల్‌గారి ఆస్తుల్ని – అంతస్తుల్ని వూహించుకోసాగారు. ఈ లోపలే కారు కల్నల్‌గారింటి ముందు ఆగింది.

శాంతీదేవి, మరికొంతమంది నౌకర్లూ వరండాలోనికి వచ్చి నిల్చున్నారు. గోపాల్ కారు దిగుతూ కిటికీ వైపు చూశాడు. అంతవరకూఅక్కడ నిల్చున్న జ్యోతి సిగ్గుతో పక్కకు తప్పుకొంది. డాక్టర్ కార్లొంచి దిగుతున్నపుడు, గోపాల్ కావాలని డాక్టర్ జ్యోతికి కనబడకుండా వుండేలా అడ్డునిలిచాడు. డాక్టర్ ఇంట్లోకి వస్తున్నప్పుడు కూడ గోపాల్ అతనికి అడ్డుగా వుండటంతో జ్యోతి అతన్ని మరి చూడలేక పోయింది.

నౌకర్లు కారులోంచి సామాన్లు తరలిస్తున్నారు. శాంతీదేవి అతిథుల్ని హాల్లోనికి తీసుకువచ్చింది. డాక్టర్ని చూశాక ఆమెలోని ఉత్సాహమంతా నీరుగారి పోయింది.

హాల్లోని విలువైన అలంకరణ సామగ్రి వాటిని అలంకరించిన తీరూ, మిడిగుడ్లేసుకుని చూస్తూండిపోయారు తల్లీ కొడుకులు. ఖరీదైన ఆ తివాచీ మీద నిలుచోటానికే వాళ్ళ కాళ్లు వణికాయి. సోఫాలో కూచుని కల్నల్‌గారు వాళ్ళ కోసమే ఎదురుచూస్తున్నారు. సూరజ్ తడబడుతోన్న కాళ్ళతో కల్నల్‌గారి దగ్గరకు వెళ్ళి "బాబుగారూ మళ్ళీ" అంటూ ఎలా చెప్పాలో తెలియక ఆగిపోయాడు.

డాక్టర్ విస్మయంగా సూరజ్ కేసి చూశాడు.

"మీరు" ప్రశ్నార్థకంగా అడిగాడు. సూరజ్ మౌనంగా వుండిపోయాడు.

"ఈయన మా గుమస్తా: నాకు నడుం నొప్పిగా వుండి రాలేక వీళ్ళని స్టేషన్‌కు పంపించాను! రండి కూచోండి" అన్నారు కల్నల్ అతని ప్రశ్నకు సమాధానంగా.

"మరి" అయోమయంగా ఏదో అనబోయాడు డాక్టర్

"మరేంలేదు డాక్టర్‌సాబ్! డాడీ రాలేదుగదా అందుకని మీరు, మా గుమాస్తాగారినే కల్నల్ సాబ్ అనుకున్నారు! అంతే" అన్నాడు గోపాల్ నవ్వుతూ.

"గోపాల్" కల్నల్‌గారు వారించారు కోపంగా.

"అబ్బే! మీరు బాధపడకండి అన్నయ్యగారూ! బావేకదా అని హాస్యమాడాడు అబ్బాయి! తప్పులేదు" అంది డాక్టర్ తల్లి శ్రీమతి కోసలాదేవి. ప్రస్తుతం ఆమె ఏం పట్టించుకొనే స్థితిలో లేదు. కల్నల్‌గారి ఐశ్వర్యాన్ని అంచనా వేయలేక సతమతమవుతోంది.

ఆమె మాటలు విని నవ్వుకొన్నాడు గోపాల్. నేరుగా గదిలోనికి వెళ్ళిపోయాడు. అప్పటివరకూ కిటికీ దగ్గర నక్కి చూస్తోన్న జ్యోతి అతన్ని చూసి సిగ్గుపడి పైట చెంగుతో ముఖం కప్పుకొంది.

"బయట ఎవరూలేరు! ఆయనగారు లోపలున్నారు" అన్నాడు గోపాల్.

"మీ హాస్యానికి వేళాపాళా లేదా" అక్కడ్నుంచి వెళ్ళబోతూ అంది జ్యోతి. గోపాల్ కొంటెగా నవ్వుతూ ఆమెకు అడ్డుగా నిల్చున్నాడు.

"ఇప్పుడిక్కడ రోజీ వుంటే ఎంత బావుణ్ను" అన్నాడు.

"ఆమెను జ్ఞాపకం చేసుకొంటున్నారేమిటి?"

"ఆమె వుంటే నీ అదృష్టాన్ని వేనోళ్ళ పొగిడేది"

"అయితే మీరే రోజీ ఎందుక్కాకూడదు"

"అలా అయితే గొంతు చించుకొని మరీ పొగుడుతాను. జ్యోతి నీకంటే అదృష్టవంతులెవరూ లేరు. అందంగా వున్నాడు పెళ్ళికొడుకు. పేరు ప్రఖ్యాతులున్న డాక్టర్ నిన్ను చూస్తే నాక్కూడ అసూయగా వుంది"

గోపాల్ మాటలకి జ్యోతి సిగ్గుపడి పరుగెత్తుకుంటూ తన గదిలోనికి వెళ్ళిపోయింది. ఆమె చెక్కిళ్ళు, బరువుగా వాలిన ఆ కనురెప్పలు చూశాక గోపాల్ స్థాణువైపోయాడు. ఎంతో శ్రమతో చెక్కిన శిల్పం ముక్కలు ముక్కలవడం చూసి శిల్పి అవేదన చెందినట్టుగా వుంటతని పరిస్థితి.

అక్కడ అతిథులకు ఘనంగా సత్కారాలు జరుగుతున్నాయి. అక్కడ వాళ్ళు ఉల్లాసంగా విరగబడి నవ్వుతున్నప్పుడల్లా గోపాల్ తననెవరో శూలాల్తో పొడుస్తున్నట్టుగా బాధపడ్డాడు. ఒకటి రెండు సార్లు గోపాల్ని రమ్మంటూ పిలుపొచ్చింది. అయినా వెళ్ళబుద్ధికాక, బాగా అలసిపోయానని చెప్పి గదిలోనే ఒంటరిగా వుండిపోయాడు.

అతిథుల కోసం టీ ఫలహారాలు తయారుచేశారు. జ్యోతి అందంగా అలంకరించుకొంది. ఆ హడావుడి అంతా చూస్తోంటే గోపాల్‌కి ఏదో తెలియని కసి రేగుతోంది. కాని డాక్టర్ని చూసి జ్యోతి ఉత్సాహం అంతా నీరుగారిపోతుందనీ, ప్రాణం పోయినా ఆ పెళ్ళికి మాత్రం ఒప్పుకోదనీ అతని గాఢ నమ్మకం !

పెళ్ళిచూపులు జరిగిపోయాయి. జ్యోతి గోపాల్ గదికేసి నడిచింది. విశ్రాంతిగా తనగదిలో పడుకొన్న గోపాల్ ఆమె రాకను గమనించాడు.

పరీక్షా ఫలితాలు తెలుసుకొనే ముందు విద్యార్థి గుండెలా కొట్టుకొంటోంది గోపాల్ గుండె ! అడుగుల చప్పుడు ద్వారం వరకూ విన్పించి ఆగిపోయింది. ద్వారానికున్న కర్టెన్ తొలగించుకొని జ్యోతి వస్తోంది. ఎదురుగా బీరువాకున్న అద్దంలోంచి చూస్తున్నాడదంతా గోపాల్.

జ్యోతి అతని మంచం దగ్గరకు వచ్చి నిల్చుంది. ఏదో చెప్పాలని ప్రయత్నించింది. కాని, చెప్పలేకపోయింది. అలంకరణతో చాలా అందంగా వుంది జ్యోతి. కాని, ఆమె మొహంలో ఆనందం లేదు. ఆమె ఉదాసీనత చూసి గోపాల్ నవ్వుకొన్నాడు. రెండు క్షణాలు గడిచాయి. జ్యోతి వెళ్ళడానికి వెనుతిరిగింది.

"ఎవరూ" అప్పుడే చూసినట్టుగా పలకరించాడు గోపాల్.

"పెళ్ళికొడుకు నచ్చాడా" కొంటెగా నవ్వుతూ అడిగాడు.

"నచ్చారు ! నా అదృష్టం మీద నాకే అసూయ కలుగుతోంది"

"అయితే నాకు స్వీట్ కావాలి" అంటూ లేచాడు గోపాల్.

జ్యోతి భారంగా వెనక్కి అడుగు వేసింది.

''జ్యోతీ! నీ మనసిప్పుడు ఎలా వుందో నాకు తెలుసుకాని...''

''కానీ...''

"మనసులో ఎన్ని ఆశలున్నా, తల్లి దండ్రుల ముందు తలవంచక తప్పదు"

"ఎందుకని! ఇదేమైనా బొమ్మలాట అనుకొన్నారా"

"జ్యోతీ! ఇది పవిత్రమైన భారత దేశం! ఇక్కడ అందచందాల కన్నా, గుణగణాలకన్నా కులగోత్రాలు ముఖ్యం!" అతను డాక్టర్! పైగా ఉన్నత కులస్థుడు.

"చాలు! నేను మరింకేమీ వినదలచు కోలేదు" హఠాత్తుగా గోపాల్ చేతుల్లో జ్యోతి ముఖాన్ని దాచుకొంది. ఇంతలో ఎవరో వస్తున్న చప్పుడయింది. ఇద్దరూ విడిపోయారు. ఎదురుగా డాడీని చూసి జ్యోతి కళ్ళు కిందకి వాలిపోయాయి. కొన్ని క్షణాలు ముగ్గురూ ఒకొర్నొకరు చూసుకొంటూ నిల్చున్నారు. చివరికి కల్నల్‌గారు నవ్వుతూ—

''అదేమిటి అలా వున్నారు'' అనడిగారు

"ఏంలేదు'' కంగారుగా అంది జ్యోతి

"మరెందుకీ మౌనం! ఇప్పుడేము యిందని"

"డాడీ'' అన్నాడు గోపాల్. కల్నల్ గారు అతనికేసి చూశారు.

''ఈ పెళ్ళి జరగడానికి వీల్లేదు''

''ఏం''

"ఇష్టంలేని పెళ్ళిచేసి జ్యోతి జీవితంతో ఆడుకొంటామా''

''ఇక్కడ మీ రిద్దరూ కలసి ఏదో కుట్ర పన్నినట్టున్నారు''

"అదికాదు డాడీ...నేను'' జ్యోతి మాటల ధోరణి మార్చటానికి ప్రయత్నిస్తూ అంది.

''అసలు విషయమేమిటి"

"నాకీ పెళ్ళి ఇష్టం లేదు" ఆవేశంగా అన్నాడు గోపాల్.

"ఎందుకని''

"జ్యోతిని మీరు చదివించింది ఇందు కేనా? ఇష్టాయిష్టాలు తెలుసుకోకుండా ఎవరో ఒకరికి ముడిపెట్టడానికేనా? నేను బ్రతికుండగా ఈ పెళ్లి జరగనివ్వను''

"మరి"

"లోకం గొడ్డుపోలేదు డాడీ! ఈ విశాల ప్రపంచంలో జ్యోతికి తగ్గ వరుడు దొరక్కపోడు''

గంభీరంగా వున్న కల్నల్‌గారి మొహంలో చిరునవ్వు వెలిసింది.

"గోపాల్! నీ మనసులో జ్యోతిపట్ల ఇంతలా ఆదరాభిమానాలున్నాయని అను కోలేదు. నేనేం పిచ్చివాణ్ణా! రత్నం లాంటి నా బిడ్డని అడ్డమైనవాడికీ ముడి పెడతానా బాబూ!" అన్నారాయన.

తండ్రి మాటలు విన్నాక జ్యోతి ముఖం వికసించింది. శాంతీదేవి కూడ అక్కడ కొచ్చింది. కల్నల్‌గారు గోపాల్‌కేసి చూస్తూ—

"ఇప్పుడెలా" అన్నారు.

"మనకి నచ్చలేదని చెప్పేయండి"

"అలా చెప్పటం మర్యాద కాదు''

"ఈ సంగతి విన్నారా'' శాంతీదేవి అంది.

"ఏమిటి''

"అతను డాక్టరే కాని..."

"???"

"పశువుల డాక్టరట"

"నీకెలా తెలిసింది"

"మాటల్లో బయట పడింది. తల్లి గారేమో ఆ సంగతి బయట పడకుండా జాగ్రత్త పడబోయింది. కాని, కొడుకు

బయట పెట్టేశాడు''

"అయితే ఇప్పుడేం చేద్దాం"

"మీరు విచారించకండి డాడీ! అదంతా నేను చూసుకొంటాను'' అన్నాడు గోపాల్.

"ఏం చేస్తావు''

''కర్ర విరక్కుండా పాము చచ్చేలా చేస్తాను''

"ఒకవేళ ఏమైనా...''

"మీరేమీ ఆందోళనపడక నిశ్చింతగా వుండండి''

* * *

"రండి నాథ్‌గారూ! ఓ! అయామ్ సారీ డాక్టర్ నాథ్"

"ఇదేమిటి ఈ అడవి చాలా భయంకరంగా కన్పిస్తోంది" అంటూ కారు డోరు తెరిచి గోపాల్ వెనుకనే దిగాడు డాక్టర్. జ్యోతి కూడ దిగింది.

"బహుశా అడవి చూడటం మీకు ఇదే మొదటిసారనుకొంటాను" అన్నాడు గోపాల్ చేతిలోని తుపాకీని భుజానికెత్తుకుంటూ.

"అదేం లేదు! నిజానికి నా లైఫంతా అడవిలోనే గడిచిపోయింది"

"జంతువులతో కలిసి అవునా?"

"యూ మీన్"

"నా ఉద్దేశ్యం జంతువులకి వైద్యం చేయాలి కదా"

"మేం అడవి జంతువులకు వైద్యం చేయం"

"అలాగా! పట్నం జంతువులకే ప్రత్యేకం అన్నమాట"

"అంటే" కోపంగా అన్నాడు

"మీరనవసరంగా ఫీలవుతున్నారు" జ్యోతి మృదువుగా అంది.

"నో! ఫీల్ కావట్లేదు! మీరు నన్ను వేళాకోళం చేయట్లేదు కదా" డాక్టర్ మొహానికి నవ్వు పులుముకొంటూ అడిగాడు. అతను జ్యోతి కోసం దేన్నయినా సహించడానికి సిద్ధంగా వున్నాడు.

జ్యోతి కార్లోంచి పిక్‌నిక్ కోసమని తెచ్చిన సామాన్లు బయటకు తీసింది. ముగ్గురూ కలసి ఫ్లాస్కు, బుట్టలూ, కేరియర్ సరంజామా అంతా పట్టుకొని నది ఒడ్డుకు చేరుకొన్నారు.

పిక్‌నిక్ ప్రోగ్రాం వేసింది గోపాల్. డాక్టర్ని రమ్మంటే వచ్చేశాడు. అతని తల్లి మాత్రం రాలేదు. ఇంటి దగ్గరే వుండిపోయింది. భయంగా, కంగారుగా వున్న డాక్టర్ మొహం చూసి నవ్వు ఆపుకోలేకపోతున్నారిద్దరూ.

"డాక్టర్ నాథ్"

"యస్ మైడియర్ బామ్మర్ది" అతను కూడ సరదాగా వేళాకోళంగా అన్నాడు. గోపాల్ అది కనిపెట్టాడు. "ఒక చిన్న ఉపకారం చేస్తారా" అనడిగాడు.

"ఓ యస్! ఏమిటది"

"నేనో పెద్దపులిని పెంచుతున్నాను"

"టైగరా...?" కలవరపడ్డాడతను.

"అవునండీ! టైగరే! పాపం చాలా మంచిది. తన జోలికి రానంత వరకూ ఎవర్నీ ఏమీ చేయదు"

"కొంపదీసి......దానికి వైద్యం చేయాలా ?"

"అవునండీ! పాపం దాని కుడి పంజా మీద పాము కాటేసింది"

"అయ్యయ్యో"

"దాని పంజా అంతా వాచిపోయింది. నయం కావాలంటే ఏం చేయాలి?"

"ఏముందీ! ఆపరేషన్!—అంటే దాని కాలు తెగ్గోసేడమే"

"అది డాక్టర్లకే సాధ్యం కదండీ! కానీ మాకు కొన్ని మైళ్ళ దూరంలో వుంది పశువుల ఆసుపత్రి. అందుకే వీల్లేకపోయింది. ఇంతలో మీరొచ్చారు. ఇంక దానికేం భయం లేదు"

"అంటే నేను..." అదురుపాటుకు టిఫిన్ కారియర్ నాథ్ చేతుల్లోంచి జారి పడింది.

"అవును! తమరే దాన్ని రక్షించాలి! దాని ప్రాణాలు దక్కించడానికి మీకంటే యోగ్యులు ఇంకెవరున్నారు? డబ్బు కోసం మీరేమీ విచారించనఖ్ఖర్లేదు. ఎంత ఖర్చయినా సరే! నా పులిని బతికించి పుణ్యం కట్టుకోండి డాక్టర్! నా పులి లేనిదే నేను బతకలేను"

"పులి...పులి" భయంగా దిక్కులు చూస్తూ గొణుక్కున్నాడతను.

పిక్‌నిక్ సరంజామానంతటినీ సర్ది పెట్టారు. డాక్టర్ గప్‌చిప్‌గా వుండటం చూసి గోపాల్ – "పులి పేరు వింటూనే భయపడి పోయినట్టున్నారు" అన్నాడు.

"భయమా! నాన్‌సెన్స్! అలాంటి పులులు రోజుకు కొన్ని వేలు మా హాస్పిటల్‌కు వస్తుంటాయి. వాటినన్నింటినీ నా చేతుల మీదుగానే నయం చేస్తుంటాను"

"మంచి అనుభవజ్ఞులన్నమాట"

"మరేమనుకొన్నావు! ఇందులో నేను స్పెషలైజ్ చేశాను. నా దగ్గర లయన్ ఎక్స్‌పర్ట్ డిగ్రీ వుంది"

"అలాగా! అయితే నిజంగా మీరు ఇటు రావటం మా పూర్వజన్మ సుకృతం మా పెద్దపులికి ఆపరేషన్ మీరే చేయాలి"

"తప్పకుండా! కాని, పెద్ద పులికి ఆపరేషన్ చేయాలంటే చాలా పరికరాలు కావాలి! ఎయిర్‌కండిషన్డ్ రూం కావాలి! ఎన్నో రకాల కత్తులూ, కటార్లూ... ఫారెన్ మెడిసెన్సూ... ఇవన్నీ ఇక్కడికెలా వస్తాయి."

"అయ్యో అలాగా! మీలాంటి ఎక్స్‌పర్ట్‌ని ఉపయోగించుకోలేకపోవటం మా దురదృష్టం!" అన్నాడు గోపాల్ విచారంగా. జ్యోతి ముఖం పక్కకు తిప్పుకొని వచ్చే నవ్వును ఆపుకోడానికి ప్రయత్నిస్తోంది.

"పోనీ ఓ పనిచేస్తే"

"ఏమిటి" డాక్టర్, గోపాల్ ఒకేసారి ప్రశ్నించారు జ్యోతిని.

"మనతోపాటు పులిని కూడా తీసుకుపోయి డాక్టర్‌గారి హాస్పిటల్లోచేర్చేస్తే!?"

"బాగానే వుంది. కానీ, దాన్ని వూళ్ళోకి పైగా హాస్పిటల్‌లోనికి రానిస్తారా అని" గబగబా అన్నాడు డాక్టర్.

"మరిప్పుడు తమరే కదండీ చెప్పారు లయన్ ఎక్స్‌పర్ట్ ననీ,వేల కొద్ది పులులకు ట్రీట్‌మెంట్ ఇచ్చాననీ మరి వాటిని ఎలా రానిచ్చారు?"

"అదా! అది... అదేమో! మరేమో! హాస్యానికన్నాను"

"అద్గదీ! ఇప్పటికి నిజం ఒప్పుకొన్నారు" గోపాల్ నవ్వుతూ చప్పట్లు కొట్టాడు. తనని ఆట పట్టిస్తున్నారని గ్రహించిన డాక్టర్ మనసులోనే పళ్ళు నూరు కొన్నాడు. జ్యోతి నవ్వునాపుకొంటూ – "అదేమిటలా మౌనంగా వుండిపోయారు. నవ్వండి! ఇప్పుడు మనం సరదాగా వుండాలి" అంది.

జ్యోతి మాటలు విన్నాక గత్యంతరం లేక నాథ్ నవ్వాడు. ఆరోజు అతన్ని అన్నివిధాలా ఏడ్పించడానికి ఆ ఇద్దరూ కంకణం కట్టుకొన్నట్టున్నారు. ఫలహారాలు పూర్తి చేశారు, నవ్వుతూ, తుళ్ళుతూ ఆ పరిసరాలన్నీ తిరిగారు.

ముగ్గురూ జలపాతం దగ్గరికొచ్చారు



"స్నానం చేద్దాం" అన్నాడు గోపాల్. డాక్టర్ తడబడుతూ వద్దన్నాడు. గోపాల్ అతని మాటలు పట్టించుకోకుండా బలవంతంగా జలపాతం కిందకి లాక్కువెళ్ళాడు. జ్యోతి ఒడ్డున కూర్చొని తమాషా చూస్తోంది.

అలా సరదాగా సాయంత్రం వరకు గడిపేశారు. డాక్టర్ భోలానాథ్ మర్నాడుదయం ట్రయిన్‌లో పట్నం వెళ్ళిపోవాలి! అందుచేత—"మా అమ్మ ఎదురు చూస్తూంటుంది. తొందరగా వెళ్ళిపోదాం" అని నాలుగైదు సార్లన్నాడు. జ్యోతికి విసుగేసింది.

"అదేమిటండీ! మరీ పాలుతాగే పాపాయిబాభయపడిపోతున్నారు" అంది.

"అదేం కాదు! మా అమ్మకు నేనొక్కణ్ణేగా"

"అంటే?! పెళ్ళయ్యాక్కూడా మీరిలాగే అమ్మ కొంగుపట్టుకొని తిరుగుతారన్నమాట"

"అంతే కదా తల్లే దైవం"

"అలాగయితే లాభం లేదు" జ్యోతి గంభీరంగా అంది.

"అంతే"

"డాక్టరుగారూ, నాకిటువంటి వ్యక్తు లంటే పరమ అసహ్యం! నా భర్త అనే వాడు వ్యక్తిత్వం లేక ఓ ముసలామె అడుగుజాడల్లో నడిస్తే నేనేమాత్రం సహించలేను"

డాక్టర్ షాక్ తిన్నాడు. అతని ఆశల పొంగుల మీద ఎవరో చన్నీళ్ళు గుమ్మ రించినట్టుగా అయింది.

"జ్యోతీ! ఆలూ లేదు! చూలూలేదు! కొడుకు పేరు సోమలింగమన్నార్ట! ఇప్పుడివేం మాటలు. అయినా ఆ ఇంటి యజమానురాలివి నువ్వే అయితే ఎవర్ని ఇంట్లో వుంచాలో, తగిలేయాలో అంతా నీ ఇష్టమే కదా డాక్టరుగారు మాత్రం నీ మాటని కాదంటారా ఏమిటి?"

"లేదు! అలా జరగదు అసంభవం" మొహం చిట్లిస్తూ అరిచినంత పని చేశాడు డాక్టర్.



"అరే తమరు అపార్థం చేసుకొంటున్నారు. ఎవరయినా భార్యకోసం కన్న తల్లిని వదులుకొంటారటండీ అత్తగారంటే వంట పనులూ, ఇంటి పనులూ చూసుకోవడం, అలా పన్లు చక్కగా చేస్తుంటే ఏ కోడలు మాత్రం అత్తను తన్ని తగలేస్తుంది చెప్పండి డాక్టర్" అన్నాడు గోపాల్.

డాక్టర్ మాట్లాడలేక కోపంగా మెటికలు విరుచుకొన్నాడు. తల్లి స్వభావం అతనికి బాగా తెలుసు. అలా జరిగితే తన జీవితాన్ని నరకం చేస్తుంది. పాపం డాక్టర్ సందిగ్ధావస్థలో పడ్డాడు. ఒకవైపు తల్లి మరో వైపు అందాల రాణి జ్యోతి! పైగా బోలెడు ఆస్తి ఎవర్ని వదులుకోవాలో తెలియట్లేదు.

ఇంటికి తిరుగు ముఖం పట్టినప్పుడు డాక్టర్ ఎవరితోనూ మాట్లాడ లేదు. ఏడ్పు ముఖంతో తల వాల్చుకొని కూర్చున్నాడు. గోపాల్ అతన్ని నవ్వించడానికి ఎంత ప్రయత్నించినా ససేమిరా నవ్వలేదు. మాట్లాడ లేదు. జ్యోతి చాలా నెమ్మదస్తురాలు, అమాయకురాలు అనుకొన్నడతను కాని, అతని వూహలు తల కిందులయ్యాయి.

కాస పోతుంటే జిప్సీల పాటలు విన్పిస్తున్నాయి. ఆపాటలు వింటూ జ్యోతి "ఈ రోజు అక్కడికి వెళ్దామా?" అంది.

గోపాల్ ముందు ఆశ్చర్యపోయినా, జ్యోతి సైగ చూసి, "ఎందుకు వెళ్ళం డాక్టర్‌గారికూ్కడా చూపిద్దాం వారు మళ్ళీ మళ్ళీ రాను కదా" అన్నాడు.

"నాకలాంటివేమీ నచ్చవు" డాక్టర్ కోపంగా ముక్కు మీదికి అద్దాలు లాక్కుంటూ అన్నాడు.

"నచ్చవా వింతగావుందే!" ఆశ్చర్యం అభినయిస్తూ జ్యోతి అతని భుజమ్మీద చేయివేసి నొక్కింది.

అతని రక్తనాళాల్లో వేడి రక్తం పిచ్చిగా పరుగులు తీసింది. నెమ్మదిగా అన్నాడతను- "నిజం సుమండీ! నాకు ఇలాంటి ఆటలూ, పాటలూ ఏమీ నచ్చవు. ఇంటికి పోదాం"

"ఆశ్చర్యంగా వుందే! మీకు సంగీతం నచ్చదా! సంగీతం అంటే పశువులు కూడా చెవి కోసుకొంటాయి. మరి మీరు పశువుల డాక్టర్ కదా!"

"లేదండీ! ఈ సంధ్యా సమయంలో భగవన్నామ స్మరణే చేసుకొంటాను"

"అయ్యో! మీరింత చాదస్తులేమిటండీ! సాయంత్రం అయ్యేసరికి ఆట పాటలూ, క్లబ్బులూ, పిక్చర్లూ లేకపోతే నేను బ్రతకలేనండీ బాబూ! బోరుకొట్టిచస్తాను"

డాక్టర్ బిక్కచచ్చిపోయాడు. అతని ఆశలు నేలకూలి పోతున్నాయి. మౌనంగా వాళ్ళననుసరించక తప్పింది కాదు. జిప్సీలను చేరుకొన్నారు. వాళ్ళంతా అక్కడ వలయాకారంగా కూర్చొన్నారు. మధ్య ఓ అందమైన అమ్మాయి పాట పాడుతూ, నాట్యం చేస్తోంది.

గుంపులో అందరి చేతుల్లోనూ ఒకో మట్టి పాత్ర వుంది. ఎవరో వృద్ధుడు ఆ పాత్రల్లో ఏదో పోస్తున్నాడు. "ఏమిటది" జ్యోతి ప్రశ్నించింది.

"సారా" చెప్పాడు గోపాల్. డాక్టర్ నృత్యం చూస్తూ తెగ ఆనందిస్తున్నాడు.

"ఇలాంటి డాన్సులు హాలీవుడ్‌పిక్చర్లో మాత్రమే చూడగలం" అన్నాడు కాసేపటి తర్వాత.

నృత్యం చూసే వాళ్ళలో 'రత్న' సంరక్షకుడయిన గోపాల్ మిత్రుడూ

వున్నాడు. అతను గోపాల్ని చూసి దగ్గర కొచ్చాడు. అతని చేతిలోని పాత్ర నిండుగా సారాయి తొణికిసలాడుతోంది. గోపాల్‌కి ఓ కొంటె ఆలోచన తట్టింది. జ్యోతి చెవిలో తన ఆలోచనని వివరించాడు. మిత్రుడి చేతిలోని సారాయి పాత్రను తీసుకొన్నాడు గోపాల్. అతని చేతిలో ఆ పాత్ర చూసి డాక్టర్ ఆశ్చర్యపోయాడు.

గోపాల్ పాత్రను డాక్టర్‌కి అందిస్తూ "పుచ్చుకోండి" అన్నాడు.

"వద్దు" అన్నాడతను ముక్కు చిట్లిస్తూ.

"పర్లేదు పుచ్చుకోండి" అంటూ జ్యోతి ఆ పాత్రను అతని పెదవులకు ఆనించింది. డాక్టర్ కోపం తారస్థాయిని అందుకొంది.

"నేను సారాయిని నోటితో తాగను! కళ్ళతో తాగుతాను" వ్యంగ్యంగా అన్నాడు. నృత్యం చేస్తోన్న యువతికి సారాయి మైకం తలకెక్కింది. మరింత హుషారుగా ఆడుతోంది. గుంపులో ఒక్కొక్కరూ లేచి నృత్యంలో పాల్గొంటున్నారు. కేకలతో, పాటలతో ఆ ప్రదేశమంతా ప్రతిధ్వనిస్తోంది.

గోపాల్, జ్యోతి ఇద్దరూ డాక్టర్ చూస్తుండగా సారాయి తాగుతున్నట్టు నటించారు. నిజానికి చాటుగా దాన్ని పారబోశారు. డాక్టరికిదంతా అయోమయంగా వుంది. అక్కడ నించోలేక విసవిసా కారు దగ్గరికొచ్చి కారుకు చేరబడి ఆలోచించాడు. జ్యోతి అయస్కాంతంలాంటి సౌందర్యం ఒక వేపూ, ఆమె ప్రవర్తన మరొకవేపూ అతన్ని సందిగ్ధావస్థలో పడేసింది. అతను ఎటూ తేల్చుకోలేక పోతున్నాడు. తల్లికి జ్యోతి విషయం తెలిస్తే ఆమె ప్రాణం పోయినా జ్యోతిని తన కోడలిగా చేసుకోదు.

నాథ్ ఆలోచన్లో పడిపోయాడు. ఎండుటాకుల మీద ఎవరో నడిచిన చప్పుడయింది. ఉలిక్కిపడి తలెత్తి చూశాడు. మైకంలో వున్న జ్యోతి, గోపాల్ ఏదో గొణుక్కొంటూ, చేతులు కలుపుకొని డాన్స్ చేస్తున్నారు.

గోపాల్ డాక్టర్ని చూసి తూలుకుంటూ వచ్చి అతని భుజం పట్టుకొన్నాడు. "ఏవయ్యా డాక్టర్! ఒంటరి పక్షిలా వున్నావు. ఎం మనిషివయ్యా నువ్వు! ముసలమ్మలా ఇక్కడేం చేస్తున్నావ్" అన్నాడు. మాటలు ముద్దముద్దగా వస్తున్నాయి.

జ్యోతి అరమోడ్పు కళ్లతో డాక్టర్ని చూస్తూ, తూలుకుంటూ వచ్చి అతనిమీద పడబోయింది. గోపాల్ ఆమెను పట్టుకొంటూ "జాగ్రత్త డాక్టర్ కింద పడితే అతన్ని లేవదీయడానికి ఇపుడెవరికీ తీరిక లేదు" అన్నాడు.

"నాన్‌సెన్స్! కల్చర్‌లెస్ ఫెలోస్" కోపంగా అరిచాడు డాక్టర్.

"హుష్" అని జ్యోతి చూపుడు వేలు పెదవులకు ఆనించింది. మత్తుగా ఆమె తూలుతుంటే హాలీవుడ్ పిక్చర్ చూస్తున్నట్టుగా వుంది డాక్టర్‌కి.

గోపాల్ ఆమె చేయి పట్టుకొని అవతలకి వెళ్ళిపోయాడు. వాళ్ళిద్దరూ కాసేపు కన్పించలేదు. వాళ్ళ కోసం అటూఇటూ చూసి భయంతో గట్టిగా పిలిచాడు డాక్టర్.

నాథ్ కేకకి జ్యోతి, గోపాల్ పరుగెత్తుకొంటూ వచ్చారు. డాక్టర్‌కేసి చూసి నవ్వి కారులో కూర్చున్నారు. డాక్టర్ ఆశ్చర్యంగా అలా వాళ్ళ వైపు చూస్తూ వున్నాడు. వాళ్ళ మత్తు అప్పుడే ఎలా

వదిలిపోయింది చెప్మా" అని విసుపోతు న్నాడు.

గోపాల్ కారు స్టార్ట్‌చేసి, డాక్టర్‌కేసి చూశాడు.

"రండి డాక్టర్! కూ చో ం డి" అన్నాడు ఎంతో సభ్యత వుట్టిపడుతున్న గొంతుకతో.

డాక్టర్ తన తడబాటును కప్పిపుచ్చు కొంటూ గంభీరంగా వచ్చి గోపాల్ పక్కన కూర్చొన్నాడు. అతని మొహ మంతా చెమటకి తడిసిపోయింది. తొణ క్కుండా డ్రైవ్ చేస్తున్న గోపాల్ని కనుచివరల్లోంచి చూస్తున్నాడతను.

"ఏమయింది డాక్టర్! మూగనోము పట్టారేమిటి? అలా వుండిపోయారేం - ఏదన్నా మాట్లాడండి" అన్నాడు గోపాల్ కారు నడుపుతూ, అతనికేసి చూడ కుండానే.

"నువ్వు మామూలుగానే వున్నావా" అడిగాడు గోపాల్.

"అదేమిటి అలా అంటున్నారు. ఇపుడు నాకేం అయిందని" కంగారుగా అడిగాడు గోపాల్. ఎదురుగా వున్న అద్దంలో అతికష్టమ్మీద నవ్వు నాపుకొం టున్న జ్యోతి కన్పిస్తోందతనికి.

"ఆ సారాయి మత్తు అంత త్వరగా దిగిపోయిందా?"

"సారాయేంటి? మ త్తేమిటి? త్వరగా దిగిపోవటమేమిటి? నాకేం అర్థం కావట్లేదు డాక్టర్."

"ఆ అడవి మనుషులు మి మ్మ ల్ని తాగించారు కదా! అదే ఆ ఆటలు... ఆ పాటలు అపుడే మరిచిపోయారా?"

"ఏమిటండీ అసలు! అసలు మీరే మంటున్నారు? ఒక గంట నుండి మనం కార్లోనే వున్నాం గదా! అవన్నీ ఎక్క డయినాయి."

"బహుశా డాక్టర్‌గారు కలగన్నా రేమో!" అంటూ జ్యోతి ముందు సీటు లోనికి ఒరిగి, "చెప్పండి సార్ కలలో ఇంకా ఏమేం వింతలు చూశారు? మనం సారాయి తాగాం! తర్వాత క్లబ్బులో డాన్స్ చేశామా?"

"కలేమిటి ఖర్మ! ఇపుడు మీరిద్దరూ నిజంగా..."

"కంగారు పడకండి డాక్టర్! ఈ కారే అటువంటిదిలెండి! మెత్తని కుషన్ సీట్లు, కుదుపులేని పరుగు...ఎవరికయినా సరే ఇట్టే కళ్ళు మూతలు పడతాయి లెండి."

వాళ్ళ మాటలు డాక్టర్‌కేం అర్థం కావట్లేదు. అతనికి పిచ్చిపట్టినట్టుగా వుంది మెదడు పనిచేయడం మానేసింది. నిజంగా తను కలకన్నాడా? నిజమా? అదెలా సాధ్యం?

అతని అవస్థను చూసి వాళ్ళిద్దరూ నవ్వుకొన్నారు. ఇంటికి చేరేసరికి డాక్టర్ తల్లి కంగారుగా కొడుకు కోసం నిరీక్షి స్తోంది. ఆ రోజల్లా కల్నల్‌గారు జ్యోతి గురించి చెప్తూ,ఆమెను పొగడ్తలతో ముంచెత్తారు. కౌసల్యాదేవి తనకు తానే ఆ సంబంధం వదులుకోనేలా! జ్యోతి అప్-టు-డేటు గర్లంటూ, పెళ్ళయితే వేరే కాపురం పెడు తుందనిచెప్పారు.అంతేకాదు ఆమె చదువు కోసం తమకు చాలా ఖర్చయిందంటూ కట్నంగా పైసా కూడా ఇచ్చే ఉద్దేశ్యం లేదంటూ ఖచ్చితంగా చెప్పేశారు. తల్లీ కొడుకులిద్దరూ గదిలోనికి వెళ్ళి మాట్లాడు కొన్నారంతా. కిటికీ దగ్గర చా టు గా నిల్చుని కల్నల్‌గారు వింటున్నారు.

"వేగంగా తయారుకా! వెళ్ళిపోదాం"

అంటోంది తల్లి.

"అదేమిటమ్మా! ఈ రాత్రి..."

"ఇంకా ఇక్కడ వుండి ఏం చేయాలి! కల్నల్‌గారు పచ్చజండా చూపించేశారు."

"ఏమిటి? ఏమయింది"

"ఒక్క పైసా కూడ కట్నం ఇవ్వర్ట"

"పోనీలే! ఆ అమ్మాయి కూడ ఏమంత మంచిది కాదు. పంచవన్నెల చిలుక! అనవసరంగా వాగడం, ఆటలూ. పాటలూ మచ్చుకయినా ఒక్క సుగుణం లేదనుకో! ఆ అమ్మాయి తాగడం కూడ నేను కళ్ళారా చూశాను".

"ఏమిటి?"

"అవునమ్మా! నా కళ్లతో చూశాను"

"అయ్యోరామ! కలియుగం అని వూరికే అన్లేదు. అదృష్టం బాగుండి ముందుగానే అన్ని సంగతులూ తెలిశాయి. లేకపోతే..."

"లేకపోతే...ఏమవుతుంది" అంటూ కల్నల్‌గారు లోపలికి ప్రవేశించారు.

అతని రాకకి తల్లీ కొడుకులిద్దరూ తడబడిపోయారు. మొహం మీదికి బలవంతంగా చిరునవ్వును లాక్కొన్నారు.

"ఏం లేదు. అబ్బే? ఏం లేదన్నయ్యగారూ! మొన్న మేం చూసిన మరో అమ్మాయి గురించి మాట్లాడుకొంటున్నాం" అన్నారు.

"ఓ అదా సంగతి! మా జ్యోతి మాత్రం అలాంటిదికాదు. మా జ్యోతి సుగుణాల్ని ఎలా పొగడాలో నాకే తెలియట్లేదు. అసలు వాళ్ళమ్మగారి బలవంతం మీద ఈ పెళ్ళి చేస్తున్నాంగాని... లేకుంటే ఫారన్ పంపించాలనుకొన్నాను"

"ఫారెనా" ఇద్దరూ ఒక్కపెట్టుగా అరిచారు. తర్వాత గబగబా సామానులు సర్దుకొన్నారు.

"అదేమిటి? ప్రయాణం ఎక్కడికి"

"ఈ రాత్రి బండికే వెళ్ళిపోవాలనుకొంటున్నాం"

"అప్పుడేనా! ఎవరో పరాయి వాళ్లింటికొచ్చినట్టు ఆ తొందరేమిటి?" భార్యను కేకేశారు కల్నల్‌గారు.

"చూడు! వీళ్ళప్పుడే వెళ్లిపోతామంటున్నారు" అన్నాడు.

"మరోలా భావించుకోకండన్నయ్యగారూ! మేం అర్జంట్‌గా వెళ్లాలి."

"సరే! మీ ఇష్టం! వెళ్ళే ముందు అమ్మాయి విషయం..."

"రాస్తాం! అక్కడికి వెళ్ళాక జన్మ నక్షత్రాలూ అవీ చూసి"

"అయితే మరికొన్ని రోజులు ఆగాలన్నమాట! సరే"

ట్రైన్‌లో స్థిమితంగా కూర్చొన్నాక డాక్టర్ భోలానాథ్, అతని తల్లి తృప్తిగా ఊపిరి పీల్చారు. అదృష్టం బావుండి అన్ని విషయాలు ముందుగానే తెలిసిపోయాయని సంతోషించారు. అలాగే కల్నల్‌గారు శాంతీదేవి అల్లుడి పీడ వదిలినందుకు ఆనందించారు.




ఆకాశం నిండా మబ్బులు కమ్ముకొన్నాయి. సన్నగా జల్లు పడుతోంది. పచ్చని ముఖమల్ తివాచీలా నలువేపులా వరిచేలు అందంగా ఉన్నాయి.

గదిలో కూర్చొని బయటికి చూస్తోంది జ్యోతి. ఆమె చేతిలో సగం తెరచిన పుస్తకం వుంది. కాని, దాని మీద ఆమె మనస్సులేదు. బయటి వాతావరణం ఆమెలో ఏవేవో గిలిగింతలు రేపు తున్నాయి.

ఇంట్లో జ్యోతి ఒంటరిగా వుంది. తల్లి దండ్రీ పక్కవూళ్ళో ఎవరో కావలిసిన, వాళ్లపోతే చూట్టానికి వెళ్ళారు. బహుశా రేపు మధ్యాహ్నం రావచ్చు! గోపాల్ కూడ ఉదయం అనగా వెళ్లి ఇంకా తిరిగి రాలేదు.

అంత పెద్ద భవనంలో ఎవరూ తోడు లేకుండా ఒంటరిగా వుండటం జ్యోతికి అదోలా వుంది. బయటకు వెళ్లేందు క్కూడ వీల్లేకుండా, డాడీ కారు తీసుకు వెళ్లేరు. జీపునేమో గోపాల్ పట్టుకు పోయాడు.

ఎవరో పిలిచేసరికి ఆలోచన్ల నుండి తేరుకొని చూసింది. ఎదురుగా గోపాల్ ! అంత త్వరగా తిరిగొస్తాడని అనుకోలేదు.

"ఏం చేస్తున్నావ్"

"ఏం లేదు. మీరు..."

"వర్షం... పని సాగలేదు"

"నేను అదే అనుకొంటున్నాను"

"ఏమని"

"ఈ వాతావరణంలో పనిమీద మనసు కుదరదని"

"నిజమే! హాయిగా దుప్పటి కప్పుకొని పడుకోవడం బెటర్!"

"నిద్ర మాత్రం వస్తుందా?"

"అయితే ఓ పని చెయ్"

"ఏమిటి"

"బాగా ఆకలేస్తూంది తినడానికే మన్నా..."

"మీకెప్పుడూ తిండి ధ్యాసే"

"అంత కంటే ఇంకేం కావాలి! మనం బతికున్నది తినహానికేగా"

"మీ వుద్దేశ్యంలో జీవితం అంటే తినడమేనన్న మాట"

"అంతకన్నా నా బోటి వాడికి మరింకేం తెలుస్తుంది"

"అందుకనే కదూ! ఆ పెద్దమనిషిని పాపం..." అంటూ జ్యోతి డాక్టర్ భోలానాథ్‌ను గుర్తు చేసింది. ఇద్దరూ నవ్వుకొన్నారు.

"పాపం అలా చేయడం మంచి పని కాదేమో"

"ఏం"

"ఒకరి మనసు బాధ పెట్టడం మంచిదా?"

"ఎవరి గురించో ఆలోచిస్తూ మీ మనసును పాడు చేసుకోవడం మాత్రం మంచిదా?"

"అదికాదు మనని మనం విమర్శించు కొన్ననాడే మన గురించి మనం తెలుసుకో గలం"

గోపాల్ మాటలు వింతగా వున్నాయి. లేవబోయింది. గోపాల్ ఆమె చేయి పట్టు కొని "ఎక్కడికి" అనడిగాడు.

"తమరి పొట్టపూజకు ఏమైనా సిద్ధం చేయాలిగా"

"వెరీగుడ్! అయితే ఏం చేయదలచు కొన్నావు"

"సాండ్‌విచ్, పకోడీ ఇంకా ఏం కావాలి?"

"వేడి వేడి టీ ఓ కప్పు. కానీ, ఈ మూడ్‌లో నిన్ను వెళ్ళనీయదలచుకో లేదు"

"ఏం ? ఇప్పుడు నా మూడ్‌కేం వచ్చింది"

"ఈ కోపంలో నువ్వు చేసే పకోడీలు మాడి మసై పోవూ''

జ్యోతి ఫక్కున నవ్వింది. గోపాల్ ఆమెను మంచమ్మీద కూచో పెడుతూ

"తొందరేం వుంది! ఇప్పుడు టైం రెండు గంటలే కదా"

"మీకు బాగా ఆకలిగా వుందన్నారే"

"ఉంటే వుండనీ ఎంత ఆలస్య మయితే అంత మంచిది. ఎక్కువవుతుంది"

"పొరపాటు. ఆలస్యమయితే ఆకలి చచ్చిపోతుంది"

మామూలుగానే అన్నా జ్యోతి ఏ ఉద్దేశంతో అన్నా, ఆ మాటలుమాత్రం పరమ సత్యాలు. ఆలస్యమయితే ఆకలి చచ్చిపోతుంది. తన ఇన్నేళ్ళ నిరీక్షణ చివరకు తన ప్రేమనే తుడిచి వేయొచ్చు! తన ఆశలు నిరాశలు కావచ్చు ఇంకా ఎన్నాళ్ళు, ఎన్నేళ్ళీ నిరీక్షణ ? దీనికి అంతం ఎప్పుడు? గమ్యం ఎక్కడ? తనా గమ్యానికి చేరుకోగలడా ?

"ఏమిటాలోచిస్తున్నారు"

"అదే అతనితో నీ పెళ్ళి నిశ్చయమయి వుండేదా అని" అంటూ కాసేపు ఆగి" జ్యోతీ నీకోవిషయం చెప్పాలి" అన్నాడు నెమ్మదిగా.

"చెప్పండి"

"అపార్థం చేసుకోకూడదు! డాడీ మరో సంబంధాన్ని చూస్తున్నారు"

"చూస్తే !?"

"ఏదో ఒకటి నిర్ణయించుకొనే ముందు ఆయన నా అభిప్రాయాన్ని తెలుసు కొంటే బావుణ్ను"

"తప్పకుండా తెలుసుకొంటారుగా"

"కాని నా అభిప్రాయం ఏమిటో నీకు తెలుసా?''

"తెలుసు! చెప్పమంటారా"

"ఊఁ"

"పెళ్ళి కొడుకు అందంగా వుండాలి! అందరికీ నచ్చాలి"

"అంతే కాదు..."

"రూపు రేఖల్లో మీలా వుండాలి"ఆమె సిగ్గుపడుతూ అంది. గోపాల్ ఆమెచేయి అందుకొన్నాడు. జ్యోతి శరీరం గగుర్పొడిచింది. అతని పక్క నుండి జర గాలని కూడ అనుకోలేదు. ఒక రోజు అతను కూడ తనక్కాబోయే భార్యని గురించి ఆ విధంగానే వర్ణించాడు. ఈ రోజు అనుకోని విధంగా తన నోటి నుండి ఆ మాటలు వచ్చేశాయి.

ఆ మాటల కోసమే ఎన్నాళ్ళ నుండో నిరీక్షిస్తున్నాడు గోపాల్. జ్యోతిని దగ్గరగా లాక్కున్నాడు. ఒక్క క్షణం ఇద్దరూ దగ్గరయ్యారు. మరు క్షణం ఎవరో లాగినట్టుగా దూరం అయ్యారు. అంతలోనే ఆమె గ్రహించింది- తను తప్పు తోవ పడుతోంది! తన దారి వేరు!

ఇద్దరూ తప్పు చేసినట్టుగా నిలబడ్డారు. గోపాల్ తనలోని కలవరపాటును అణుచు కోవడానికి వేలుకున్న ఉంగరాన్ని చూస్తూ కూర్చున్నాడు. జ్యోతి గడిచిన కొన్ని క్షణాల్ని నెమరవేసుకొంటోంది.

"జ్యోతీ" అన్నాడు గోపాల్ మృదువుగా.

"ఊఁ"

"వింతగా వుంది కదూ! నీకేమో నాలాంటి అబ్బాయి కావాలి! నాకేమో నీలాంటమ్మాయి కావాలి"

"నా అభిప్రాయం అది కాదు"

"నేనంటున్నది కూడ అదే! మనిద్దరి మధ్య వున్న అడ్డుగోడ పడగొడితే చాలు! మన కలియికను ఎవరూ ఆపలేరు"

"ఏమిటి! ఏమిటి మీరంటున్నది"

"నా మనసు విప్పి చెప్పాను. నువ్వు కూడ చెప్పు"

"ఏమిటి?!?"

"నీ మనసేమిటో"

"విపరీతంగా మాట్లాడుతున్నారు! ఈ రోజు మీకేమయింది"

"ఏమీ కాలేదు! కొన్నేళ్లుగా హృదయంలో రగుల్తున్న జ్వాల ఈనాడు నాలిక మీదకొచ్చింది! అంతే"

జ్యోతి తడబడుతూ అక్కణ్నుంచి వెళ్ళిపోతూ ''టీ' తెస్తానంటూ బయటికి నడిచింది. గోపాల్ ఆమెకు అడ్డుగా నిల్చున్నాడు. ఆమె కళ్ళల్లోకి చూస్తూ "ఈ రోజు నీ మనసేమిటో తెలుసుకోవా



లనుకొంటున్నాను" అన్నాడు.

"ఏమిటది" పెదవులు కంపిస్తున్నాయి.

"మన మధ్య వున్న అడ్డుగోడ పడగొట్టడం సాధ్యమా? కాదా"

"అడ్డుగోడేమిటి"

"మనల్ని విడదీస్తోన్న పరిస్థితులు"



"మీరేం మాట్లాడుతున్నారో, మీకే అర్థం కావట్లేదు" జ్యోతి తీక్షంగా అంది.

"నాకంతా అర్థమవుతోంది. నువ్వు నన్ను ప్రేమిస్తున్నావా? లేదా? చెప్పు! చెప్పి తీరాలి" అతను ఒక్కొక్క మాట నొక్కి పలికాడు.

"ప్రేమిస్తున్నాను; కాని మీరూహించినంతగా కాదు! ప్రేమించడానికి ఎంత వరకూ హద్దుందో అంత వరకే"

ఆమె మాటలు విన్నాక అతని ఆశల జ్వాల మీద మంచు కురిసినట్టుగా చల్లబడి పోయాడు. అయోమయంగా ఆమె కేసి చూశాడు.

"మీరింతగా సాహసిస్తారని నేను కలలో కూడ అనుకోలేదు! డాడీ వాత్సల్యాన్ని విశ్వాసాన్ని మీరీ విధంగా వాడుకొంటారని కూడ వూహించలేదు" అంటూ విసవిసా బయటికి వెళ్ళిపోయింది జ్యోతి.

గోపాల్ అక్కడే నిల్చుని ఆమెను చూస్తుండిపోయాడు. ఆమె అక్కణ్ణుంచి వెళ్ళిపోయినా, కోపంలో కూడా అందంగా వున్న ఆమె మొహం - కళ్ళలో కదలాడే ఆ కన్నీళ్లూ అతని కళ్ళ ముందు కదలాడుతూనే వున్నాయి.

అతని ఆశలూ, వూహలూ పెను తుపానుకి కొట్టుకుపోయాయి. ఇన్నాళ్లుగా ఏర్చి, కూర్చి, పేర్చిన ముత్యాల మాలను ఆమె తృణీకరించింది. కొన్నేళ్ళుగా తనలో లావాలా పేరుకుపోతున్న ఆవేదనను ఆమె తన ప్రేమతో ఉపశమింప జేస్తుందని కలలు కన్నాడు. కాని ఆమె తనని ప్రేమించదనీ, విషపురుగును విదిలించినట్టుగా విదిలించి వేస్తుందనీ అనుకోలేదు. తనో అభాగ్యుడు! తనదో మిథ్యా జీవితం! తననెందుకు ప్రేమించాలి? తనెవరు? తనో చదువూ, సంధ్యా లేని పల్లెటూరి బడుద్దాయి! తనకి సంఘంలో ఆస్తి, అంతస్తూ, హోదా అనేవి ఏమున్నాయి? ఏమీ లేవు!

ఆమె తండ్రి మోచేతి నీరు తాగి బతికే తనో క్షుద్రుడు! కుళ్ళు, కపటాలనే సంకెళ్ళతో తనుబంధింప బడ్డాడు. తనకి స్వేచ్ఛలేదు. తను జీవితంలో వేసే ప్రతి అడుగు తప్పుగానే పడుతోంది! తన శరీరం, మనసూ, ఆత్మా అన్నీ డబ్బు కోసం అమ్ముడుపోయాయి. అయినా తన క్కావలిసిన సుఖాలన్నీ అందుబాటులోనే వున్నాయి. తినడానికి ఖరీదైన తిండి, నిద్ర పోడానికి హంసతూలికా తల్పాల్ని తలదన్నే ఫోంబెడ్స్, తిరగడానికి కారు, సేవలు చేయడానికి నౌకర్లు–ఓహ్! ఇంకేం కావాలి తనకి? కాని, ఈ సుఖ సౌఖ్యాలు తనకెలా సమకూరాయి? అని ప్రశ్నించు కొంటే మాత్రం ఆ సుఖ సౌఖ్యాల మీద అతనికి తీరని వెగటూ, ఏవగింపూ కలుగుతున్నాయి.

అశాంతిగా, మూగగా రోదిస్తున్నా డతను. వెల్లువలా పొంగుకొస్తున్న ఆలోచనా ప్రవాహంలో కొట్టుకుపోయాడు. మనసులో చెలరేగిన తుఫాను తాకిడికి నిలువెల్లా కంపించిపోయాడు. మేఘాల గర్జనకి తుళ్లిపడ్డాడు. బయట వర్షం కురుస్తోంది. వాతావరణం చల్లగా వుంది. కాని, అతనిలో మాత్రం అగ్నిజ్వాలలు నాలుకలు చాచుకొంటున్నాయి. పెద్దపెద్ద అంగలు వేసుకొంటూ గది బయటకు వచ్చాడు. ఒక్క క్షణం వరండాలో నిల్చుని ... వర్షంలో తడుచుకొంటూ తర్వాత ముందుకు నడిచాడు. గమ్యంలేని బాటసారిలా ముందుకు పోతున్నాడు. అతని మనసులో వున్నది ఒకే ఒక్క ఆలోచన: అక్కణ్నుంచి, ఆ పరిసరాల నుంచి అతను దూరంగా...సుదూరంగా వెళ్లిపోవాలి! అంతే;

జ్యోతి ట్రే పట్టుకొని గదిలోనికి వచ్చే సరికి, గోపాల్ అక్కడ కన్పించలేదు. ఆమె ట్రే బల్లమీద పెట్టి... అతన్ని పిలిచింది. జవాబు లేదు. గదులన్నీ వెతికి, అతనిజాడ తెలియక నిరాశగా వచ్చి వరండాలో నిల్చింది. ఆమె మనసు పరిపరి విధాల పోతోంది! నౌకర్లందరినీ పిలిచి అడిగింది. ఎవరూ ఏమీ చెప్పలేక పోయారు. ఒకడుమాత్రం గోపాల్ అడవి కేసి వెళ్తుండటం తను చూసినట్లుగా చెప్పాడు.

ఆమె నిర్లిప్తంగా తిరిగి బల్లమీది ట్రే కేసి చూస్తూ మంచంమీద కూలబడింది. టీ పాట్‌లోంచి వెలువడుతున్న ఆవిరి నెమ్మదిగా తగ్గుతోంది. ఆ వెలోని

ఉద్రేకం కూడ నెమ్మదిగా తగ్గిపోతూ, ఆ టీ లాగే చల్లబడుతోంది. ఏమిటీ జీవితం? అసలు జీవితమంటే ఏమిటి? వ్యధలకు మారు పేరా జీవితం! భావాలు ఒకవైపు లాగితే, జీవితం మనిషిని మరోవైపు లాగుతోంది. తీరని కోరికలు అడుగడుక్కీ వస్తూనే వున్నాయి. ఆశలు, ఆశయాలు, సుఖాలు, కలవరింతలూ, గిలిగింతలూ కావాలనుకోవట మేనా జీవితం! ఎంత చిత్రమైనదీ జీవితం?— ఆమె కన్నీళ్లు బయటి వర్షంతో పోటీ పడ్డాయి.

పాపం అతనికి ఎంత ఆకలిగా వుందో ఉదయం నుండీ ఏమీ తినలేదు. తను టిఫిన్ తెచ్చేలోగా వెళ్ళిపోయాడు. కడుపు నిండి కాదు, బాధతో మనసు నిండి ఆ పాపం తనదే! అతనితో కటువుగా మాట్లాడింది, కర్కశంగా అతన్ని బయటికి నెట్టేసింది.

కాని, అతను? విశ్వాస ఘాతుకుడు. డాడీ అతని మీద పెంచుకొన్న మమతనూ, మమకారాన్నీ, ఒక్క క్షణంలో తునాతునకలు చేసేశాడు.

కోపంగా లేచి బయటకు చూసింది కొన్ని వేల జలపాతాలు ఒక్కుమ్మడిగా దూసుకొస్తున్నట్టు కురుస్తోంది వర్షం! మంచం మీద పడుకొని ఏడ్చింది జ్యోతి. అలా ఏడుస్తూనే నిద్రపోయింది.

మళ్ళీ ఆమె కళ్లు తెరిచేసరికి గది నిండా చీకటి అలుముకొని వుంది. అంతా నిశ్శబ్దంగా వుంది ఎదురుగా టీ ట్రే అలాగే పడి వుంది. వర్షం ఎప్పుడో వెలిసి పోయింది. తోటలోని కాలువలో నీరు ప్రవహిస్తోన్న ధ్వని మాత్రం మధురంగా, లయబద్ధంగా వినిపిస్తోంది. లేచి, వెళ్ళి గదిలోని దీపం వెలిగించింది. పనివాణ్ని కేకవేసి పిల్చింది. వాడొచ్చి ట్రే తీసేస్తూ సూరజ్ బాబు వచ్చారని చెప్పాడు.

"గోపాల్‌బాబు వచ్చారా" అనడిగింది జ్యోతి.

లేదని చెప్పి వాడు బయటికి వెళ్ళి పోయాడు.

జ్యోతి నీరసంగా అడుగులు వేసుకొంటూ హాల్లోకి నడిచింది.

"రామ్మారా! నిద్ర పోయావా" అంటూ లేచి నిల్చున్నాడు సూరజ్. ముకుళించుకుపోయిన ఆమె ముఖాన్ని చూసి లోలోన ఆశ్చర్యపోయాడు.

"అవును! బాగా నిద్ర పట్టేసింది" అందామె.

"బాబుగారెప్పుడొస్తారమ్మా"

"రేపు మధ్యాహ్నానికల్లా రావచ్చు"

"గోపాల్ ఎక్కడ? నిద్రపోతు న్నాడా?"

"ఇంట్లో లేదు"

"మధ్యాహ్నమే వచ్చి నట్టున్నాడు"

"మళ్ళీ వెంటనే వెళ్ళిపోయారు"

"ఎక్కడికి"

"ఏమో! వర్షంలో తడుస్తూ వెళ్ళారని మాలి చెప్పాడు"

సూరజ్ సందేహంగా ఆమెను చూసి "మీరిద్దరూ ఏమన్నా పోట్లాడుకొన్నారమ్మా?" అనడిగాడు.

"ఊఁ" అంది జ్యోతి. అతని చూపుల్ని తట్టుకోలేక తల వంచుకొంది.

"ఎందుకని"

"ఎప్పుడూ వుండేదేగా! చూడండి! అతన్ని వెంటనే ఇంటికి తీసుకురండి. ఉదయం నుంచీ ఏమీ తినలేదు"

"ఎక్కడుంటాడని తీసుకురాను"

"ఉంటే అక్కడే వుంటాడు" సాలో

చనగా అందామె.

"ఎక్కడ"

"సూరజా, ఖానూ వాళ్ళ దగ్గర"

"బింద్రా పట్టిలోనా"

"అవును! అక్కడికే వెళ్ళివుంటారు"

"కాని, నేను వెళ్ళి పిలిస్తే వస్తాడా అమ్మా"

"మరి"

"లేదమ్మా! వాడే తిరిగొస్తాడు నువ్వు చింతించకు"

"లేదు! అతను రాడు! నాకు తెలుసు మీరు జీపు రడీ చేయండి నేను కూడ వస్తాను మీతో" గబ గబా చెప్పి శాలువా తెచ్చుకోడానికి లోనికి వెళ్ళింది. సూరజ్ అనుమానంగా ఆమెను చూశాడు.

బింద్రా పట్టి అడవిలోనికి వెళ్ళేసరికి.. సురజా, ఖానూ గుడిసెల్లో లేరు. గోపాల్ ఎక్కడికి వెళ్ళిందీ చెప్పే వాళ్ళెవరూ లేరు. అక్కడే వుంటున్న ఒకరిద్దర్ని అడిగితే గోపాల్ జిప్సీల బస దగ్గర వున్నట్టు తెలిసింది.

జ్యోతి అక్కడికి దారి చూపించింది. ఆ అడవిలో ఆ మార్గాలన్నీ జ్యోతికెలా తెలుసునా అని సూరజ్ ఆశ్చర్యపోయాడు. అతనిలోని అనుమానం మరింతగా జీవం పోసుకొంది.

జిప్సీలు ఆటపాటల్లో కోలాహలంగా వున్నారు. తను పిలిస్తే గోపాల్ రాకపోవచ్చునని, జ్యోతినే వెళ్ళమన్నాడు సూరజ్. అంతా బాగా తాగి పిచ్చి వాళ్ళలా గంతులు వేస్తున్నారు. భగ భగ మండుతూన్న నెగడు దగ్గర ఓ యువతి అర్ధనగ్నంగా నడుం తిప్పుతూ డాన్స్ చేస్తోంది.

జ్యోతి ఆ గుంపు మధ్యకు చొచ్చుకుపోయి, గోపాల్ని వెదికింది. ఎవరూ ఆమెను పట్టించుకోలేదు. హఠాత్తుగా ఆమెకు కన్పించిన దృశ్యం చూస్తూ విస్తుపోయింది. నెగడుకు కొద్ది దూరంలో గోపాల్ మత్తుగా పడివున్నాడు. అర్ధనగ్న నృత్య సుందరి అతనిచుట్టూ తిరుగుతూ ఆడుతోంది. అతను లేవబోతున్నప్పుడల్లా నృత్య సుందరి అతన్ని కిందకు నెడుతోంది. అతనలా పడుతోంటే అందరూ విరగబడి నవ్వుతున్నారు. చివరికి గోపాల్ తూలుతూ లేచాడు. సుందరి అతన్ని నెట్టింది. అతను మళ్ళీ పడిపోయాడు.

జ్యోతి సహించలేక చరచరా వెళ్ళి నృత్య సుందరిని పక్కకు నెట్టి, గోపాల్ దగ్గరికి చేరుకొంది. ఒక్కసారిగా ఆటలూ, పాటలూ ఆగిపోయాయి. అందరూ ఆశ్చర్యంగా ఆమెను చూస్తున్నారు.

జ్యోతి గోపాల్ని లేవనెత్తడానికి ప్రయత్నించింది. సూరజ్ ఆ మూకను చీల్చుకొనొచ్చి గోపాల్ భుజాలు పట్టుకు లేవనెత్తి జీపుకేసి తీసుకుపోయాడు. జ్యోతి అక్కడ పడివున్న గోపాల్ మఫ్లర్, కోటూ తీసుకొని సూరజ్ వెనుక నడిచింది.

* * *

"చూడండీ! నేను జ్యోతిని"

"హుఁ!" గోపాల్ బాధగా మూల్గాడు

"నిద్రపోతున్నారా" ఆమె అతని నుదుటిమీద చేత్తో రాస్తూ అడిగింది.

జ్వరంతో అతని శరీరం కాలిపోతోంది. శాంతీదేవి పాలగ్లాసుతో లోపలికి వస్తూ "జ్వరం ఎంతుంది" అనడిగింది.

"నూటమూడు" అంటూ జ్యోతి

తల్లి చేతిలోని పాలగ్లాసు తీసుకొని బల్ల మీద పెట్టింది. అతని నుదుటి మీద చన్నీళ్ళతో తడిపిన గుడ్డ పెడుతూ అతని ఉష్ణం తగ్గించటానికి ప్రయత్నిస్తోంది ఆనాటి వర్షం రాత్రి నుండి అతని పరిస్థితి అలానే వుంది. కొన్ని నిముషాల ముందరే డాక్టర్ ఇంజక్షన్ ఇచ్చి వెళ్ళేడు.

జరిగిన విషయం తల్లిదండ్రులకు చెప్పలేదు జ్యోతి. సూరజ్‌తో ఆ 'విషయం' చెప్పవద్దంది. కేవలం వర్షంలో తడిసినందుకే జ్వరం వచ్చిందని వాళ్ళతో చెప్పింది.

గోపాల్ని అలా చూస్తోంటే అందరి కంటే జ్యోతికే ఎక్కువ బాధగా వుంది. అతను ప్రేమాగ్నిలో అంతగా వేగిపోతాడని అనుకోలేదు. అటువంటి ఊహకూడా రాలేదు. నిర్మలమైన మనసుతో అతన్తో కలిసి తిరిగింది. కాని అతనెందుకిలా చేశాడు? ఎందుకిలా జరిగింది? అతని మాటలు డాడీ వింటే పర్యవసానం ఎలా వుంటుందో అతనికి తెలియదా? డాడీ మనసు ఎంతలా దెబ్బ తింటుందో వూహించలేదా?

ఒంటరిగా కూచున్న ఆమె మనసు అదుపుతప్పి ఆలోచిస్తోంది. మరోసారి అతని నుదురుతాకి చూసింది. జ్వరం తగ్గుముఖం పట్టినట్టుంది. మూడు రోజుల నుండీ అతనిలాగే అపస్మారక స్థితిలో వున్నాడు. జ్యోతి కళ్ళు చెమర్చాయి. కన్నీళ్లు గోపాల్ బుగ్గల పైబడి మెరిశాయి.

కల్నల్‌గారు గోపాల్ని చూసి వెళ్ళిపోయారు. గోపాల్‌కు సపర్యలు చేయవల్సిన బాధ్యత జ్యోతి తీసుకొంది. తల్లి ఆమెకు తోడుగా వుంటానంది. కాని, జ్యోతి వద్దని వారించింది. దాదాపు రెండు గంటల తర్వాత జ్వరం తగ్గుముఖం పట్టింది. నెమ్మదిగా కళ్ళు తెరిచి చూశాడు గోపాల్. పక్కన జ్యోతి కన్పించింది. ఆమె చేయి అతని నుదుటిమీద వుంది. నాలుగు కళ్లూ కలుసుకొన్నాయి. జ్యోతి చేయి లాక్కోబోయింది. కాని గోపాల్ ఆమె ప్రయత్నాన్ని సాగనివ్వలేదు. వణుకుతున్న పెదవుల్తో "నువ్వా" అన్నాడు.

"ఊఁ" అనగలిగింది జ్యోతి వుబికి వస్తున్న కన్నీటిని ఆపుకుంటూ. ఆశ్చర్యంగా చుట్టూ చూశాడు అడవిలో పడి వున్న తను ఇక్కడికెలా వచ్చానా అని ఆలోచిస్తూ.

"ఇప్పుడెలా వుంది" జ్యోతి ప్రశ్నించింది.

"నాకేమయింది"

"మీకు జ్వరం వుదయానికి బాగా తగ్గిపోతుందని డాక్టర్ చెప్పారు"

మాట్లాడుతున్నప్పుడు జ్యోతి పెదవులు కంపించటం చూశాడు గోపాల్. కనుకొలకల్లో దాగిన బిందువులు ముత్యాల్లా రాలుతున్నాయి. జరిగినదంతా ఒక్క క్షణంలో సినిమా దృశ్యంలా అతని కళ్ళ ముందు కదలాడింది. జరిగింది గ్రహించాడు. తన రెండు చేతుల్తో జ్యోతి చేయిపట్టుకొని – "నన్ను క్షమించు జ్యోతీ!" అన్నాడు.

ద్వారం దగ్గర చప్పుడయింది. అతను తన చేతులు లాక్కొన్నాడు. అతను మాట్లాడ్డం విని కల్నల్ దంపతులు లోనికొచ్చారు. గోపాల్ని చూశాక వాళ్ళ ముఖాలు వికసించాయి. గోపాల్ మౌనంగా చూశాడు వాళ్ళని. జ్యోతి డాడీకి ఆ 'విషయం' చెప్పి వుండదని నిర్ధారణ చేసుకొన్నాడు.

జ్యోతి పాలు తేవటానికి బయటికి

వెళ్ళింది. ఆమె తిరిగి వస్తూ స్రావన్ సూరజ్‌లు గోపాల్ గది నుండి బయటకు రావడం చూసింది. సూరజ్ సందేహంగా ఆమెకేసి చూశాడు. ఆమె అతనిచూపుల్ని లక్ష్యపెట్టక లోపలికి వెళ్ళిపోయింది. గోపాల్ని లేవదీస్తూ– "తొందరగా తాగండి! పాలు చల్లారిపోతాయి" అంది.

"వద్దు! తాగబుద్ధికావటం లేదు"

"మందు అనుకొని తాగేయండి"

"నీ ఉపకారం..."

"అదంతా తర్వాత! ముందు పాలు తాగండి"

గోపాల్ పాలు తాగాడు. అతని దృష్టి మాత్రం జ్యోతి మీదనే వుంది. ఆమె తన మనసు తెలుసుకొని కూడ తనకు దూరం కాలేదు. సరికదా, సపర్యలు చేస్తోంది!

"అయితే నువ్వు నన్ను క్షమించినట్టే కదా" అన్నాడు.

"మీ మొదటి తప్పుగా భావిస్తూ..." అతని చేతిలోని ఖాళీ గ్లాసు తీసుకొంటూ అందామె.

"ఆవేశంలో ఏవేవో అన్నాను"

"అందుకనే నేనేమీ తప్పుగా భావించ లేదు. తెలిసి తప్పు చేస్తేనే..."

"తెలిసి చేస్తే!?"

"మీతో మరెప్పుడూ మాట్లాడేదాన్ని కాను"

గోపాల్ కాసేపు మౌనంగా వుండి పోయాడు.

"జ్యోతీ"

"ఊఁ"

"ఆ రోజు నన్నంతగా కోపగించు కొన్నావ్ కదా! మరి ఆ రాత్రి వేళ నా కోసమని ఎందుకొచ్చావు"

అతని ప్రశ్న వింటూనే ఆమెకంగారు పడింది. అక్కణ్ణుంచి వెళ్ళిపోవడానికి లేచింది. గోపాల్ లేచి, ఆమె చెయ్యి పట్టుకొని– "చెప్పు! ఎందుకిలా చేశావు" అని రెట్టించాడు.

"నాకేం తెలుసు" బేలగా అందామె.

"అంతేనా! లేక నీ మనసులోని మాట చెప్పేందుకు భయపడుతున్నావా?"

"మళ్ళీ ఏమిటిదంతా"

"ఏం! నేను నీ మనసును తెలుసు కోకూడదా?"

"మీకేమయింది! ఈ అర్థంలేని మాట లేమిటి? అసలు మీరూహిస్తున్నట్టు జర గడం సంభవమా!"

"ఏం"

"మీరూ... నేనూ... మన కలియిక మర్చిపోతున్నారా? ఈ ఇంట్లోకి మీరు 'జీవన్'గా అడుగుపెట్టారు"

"అవును! ఇప్పుడు కాదు"

"తప్పు! అలాంటి వూహ మనసు లోనికి రాకూడదు"

"కాదు, కూడదన్న ప్రసక్తి ఇప్పు డనవసరం! నీ అభిప్రాయ మేమిటో చెప్పు"

"చెప్పాల్సిందేనా! అయితే వినండి! మన మధ్య కనిపించని అడ్డుగోడ లున్నందువల్లే మనం పరస్పరం చేరు వయ్యాం. అరమరికలు లేకుండా తిరగ గలిగాం! ఈ గోడల సహాయం వల్లనే ఒకరి మనస్సు విప్పి మరొకరికి చెప్పుకో గలిగాం. బాధల్ని పంచుకోగలిగాం! ఈ అడ్డుగోడలనేవి మన మధ్య లేకుండా వుండి వుంటే..." ఆమె ఆగి ఓ క్షణం అతని ముఖం లోనికి చూసి నెమ్మదిగా అంది.

"బహుశా మనిద్దరం ఎన్నడూ ఇంత సమీపానికి వచ్చేవాళ్లం కాదు" చివరి

వాక్యం చెబుతూనే ఆమె ఆ గది దాటి వెళ్ళిపోయింది. గోపాల్ ఆమెను ఆపా లనుకొన్నాడు. కాని, అతని గొంతుక పూడుకుపోయింది. నిశ్శబ్దంగా చూస్తుండి పోయాడు. ఎవరో తన హృదయంలో చాటుగా చిచ్చు రగిలిస్తున్నట్టనిపించింది.

అతను ఆ రోజల్లా మౌనంగా, నిస్తేజంగా పక్కమీదే పడి వున్నాడు. జ్యోతి తలనొప్పి వంక పెట్టి, మళ్ళీ అతని గదిలోనికి రాలేదు. అతను కూడ ఆమెను పిలిచేందుకు సాహసించలేక పోయాడు.

కల్నల్‌గారు, శాంతీదేవి అప్పుడప్పుడూ వచ్చి గోపాల్ని పలకరించి వెళ్తున్నారు. జ్యోతి వెళ్ళినప్పట్నుంచీ అతనేమీ తినలేదు. తాగలేదు. ఎవరువచ్చి మాట్లాడినా నిర్లిప్తంగా వుండిపోతున్నాడు.

చీకటి పడింది! సాయంత్రం నుండీ వర్షం కురుస్తోంది. రాత్రివేళ— ఆ వర్షం చప్పుడు హృదయాల్ని కదిలించేస్తోంది. విపరీతంగా ఆలోచిస్తూ అతని మెదడు మొద్దుబారిపోయింది. జ్యోతి మాటలు విన్నాక, హృదయాంతరాళాల్లో ఎక్కడో మిణుకు మిణుకు మంటున్న అతని ఆశా జ్యోతి ఆరిపోయింది. తనను ఆదుకొని అన్నం పెట్టిన ఇంటికే కన్నం చేస్తూ పట్టుబడితే దోషి మానసికంగా ఎంతలా కృంగిపోతాడో అంతలా కృంగి పోతున్నాడు గోపాల్.

తొలిజాము గడుస్తోంది! వర్షం కాస్తా తగ్గింది. ఇంట్లో అందరూ గాఢ నిద్రలో వున్నారు. కాని, అతనికి నిద్రరావట్లేదు. మెదడును తొలిచేస్తోన్న ఆలోచనల్ల నుండి తప్పించుకోవటానికి, లేచి, వరండా లోనికి వచ్చాడు. వరండా చివరనున్న జ్యోతి గది తలుపులు తెరిచేవున్నాయి. ద్వారానికి వున్న కర్టెన్ గాలికి కదలాడుతోంది. నెమ్మదిగా అటుకేసి నడిచి, ద్వారం దగ్గర ఆగాడు. గాలికి కర్టెన్ కదిలినప్పుడు లోనికి చూశాడు. జ్యోతి మంచమ్మీద బోర్లగిలా పడుకొని వెక్కుతోంది. గోపాల్ నెమ్మదిగా మంచం దగ్గరికి నడిచాడు. అడుగుల చప్పుడువిని, తలెత్తకుండానే "ఎవరూ" అంది జ్యోతి.

గోపాల్ చప్పున బయటకు వచ్చేశాడు. తన గదిలోనికి వచ్చేశాక, వూపిరి బిగబట్టి ద్వారంకేసి చూశాడు. జ్యోతి తనని వెంబడించి వస్తుందన్న ఆశ!

కొన్ని క్షణాల తర్వాత మళ్ళీ కిటికీ దగ్గరకొచ్చి బయటకు చూశాడు. ఆకాశం భోరున ఏడుస్తూనేఉంది. గాలి తీవ్రంగా వీస్తోంది. అతనికేదో తోచింది. ఆ హఠాత్ నిర్ణయానికి కట్టుబడ్డాడు. ఎక్కడికో దూరతీరాలకు వెళ్ళిపోవాలను కొన్నాడు. ధైర్యం కూడగట్టుకొన్నాడు. చెవులకి జ్యోతి వెక్కిళ్ళు విన్పిస్తూనే వున్నాయి. ఆమె దుఃఖానికి కారణం తనే!

బ్యాగులో రెండు మూడు జతల బట్టలు కుక్కాడు. కాన్వాసు జోళ్ళు, ఓవర్ కోటూ తొడుక్కొన్నాడు. చాలా నీరసంగా వుంది. తుపాకి తీసి భుజానికి తగిలించుకొన్నాడు.మఫ్లర్ మెడకు చుట్టుకొంటూ, తన జీవితంలో చాలా భాగం గడిపిన ఆ గదిని ఓసారి పరికించి, చూశాడు. వరండా దాటుతూ ఒక్క క్షణం జ్యోతి గది దగ్గర ఆగాడు, కాని, అక్కడ అతనికి నిరాశే ఎదురయింది. ఆ గది తలుపులు, కిటికీల్తూ మూసి వున్నాయి. ముందుకు నడిచాడు. కల్నల్ గారి గదిముందు అతని కాళ్లు ఆగి

పోయాయి. కాని, అక్కడకూడ తలుపులు మూసి వున్నాయి. అతను తప్ప, అందరూ గాఢ నిద్రలో వున్నారు. అత నొక్కడికే నిద్ర కరువైంది!

వరండా మెట్లు దిగుతూండగా ఎవరో అతన్ని పిలిచారు. కాళ్లు ముందుకు సాగలేదు. అతను తడబడుతూ వెనక్కి తిరిగి చూశాడు. బాత్‌రూం తలుపు దగ్గర ఎవరో నిల్చునివుండటం కన్పించింది. ఆశ్చర్యంగా అటుకేసి నడిచి—

"జ్యోతి! నువ్వా" అన్నాడు.

ఆమె వెలుగులోకి రావడానికి భయ పడుతున్నట్టు చీకటిలోకి తప్పుకొంది. గోపాల్ ఆమె దగ్గరిగా నడిచాడు. కొన్ని క్షణాలు ఇద్దరూ బొమ్మల్లా నిల్చున్నారు. ముందుగా జ్యోతి తేరుకొని—

"వెళ్లిపోతున్నారా" అనడిగింది.

"అవును! ఇలా ఎన్నాళ్ళని ఒకరి మీద ఆధారపడి బతకను"

"ఈనాటికి మేం అందరం పరాయి వాళ్ళమయ్యామా?"

"నావాళ్లెవరో! పరాయి వాళ్లెవరో నాకే తెలీదు?

"మీరు వెళ్ళిపోవడం నేను చూస్తూ వూరుకోలేను"

"జ్యోతీ! నువ్వు నా స్థితిని అర్థం చేసుకోవడానికి ప్రయత్నించు! లేకుంటే నేను..."

"మీరు...?"

"నేను పిచ్చివాణ్ణయి పోతాను"

"మంచిదే! అంతకన్నా అదృష్టం ఏముంది! సుఖాలు దుఃఖాలూ బాధలూ, ఆవేదనలూ వుండవు! రండిలోపలికి"

జ్యోతి ఆ మాటలు చాలా నెమ్మదిగా, మృదువుగా అంటూ అతన్ని కట్టిపడే సింది.

ఇంత జరిగినా కూడ ఏమీ జరగ నట్టు ఆమె ఎంత ప్రశాంతంగా వుంది! ఉన్మాదిలా ఆమెకేసి చూశాడు. ఏదో చెప్దామనుకున్నాడు. కాని గొంతు పెగ ల్లేదు.

"రండి! చలిగాలి ఎక్కువవుతోంది" అంటూ ఆమె అతనిచేయి పట్టుకొని లాక్కుపోయింది. "ఓహ్! వళ్లు పేలి పోతోంది. ఇంత జ్వరంలో ఈ తెగింపా? ఆత్మహత్య చేసుకోవాలని వుందా?"

"ఆత్మహత్యా!"

"కాకుంటే మరింకేమిటి?పిరికివాళ్ళలా ప్రవర్తించకండి"

అతను మరేమీ మాట్లాడలేక మౌనంగా ఆమెతో తన గదిలోకి నడి చాడు. జ్యోతి చెప్పినట్టు జోళ్లూ, కోటూ వూడదీసి మంచమ్మీద కూలబడ్డాడు. పసి పిల్లాడు తల్లి మాటలు వింటున్నట్టు అతను ఆమె మాటల్ని పాటిస్తున్నాడు. అతని స్థితి విచిత్రంగా వుంది. జ్యోతి పరాయిదయినా కూడ తనపట్ల ఎంతటి ఆత్మీయతను ప్రదర్శిస్తోంది. నిజంగా ఆమె మానవత్వానికి ప్రతిరూపం! అతను ఇంకేమీ ఆలోచించలేకపోతున్నాడు.

అతని శరీరం మండిపోతోంది బయట ఉరుములు, మెరుపులతో వాతావరణం భయంకరంగా వుంది.

జ్యోతి మౌనంగా అతని తలదగ్గర కూర్చొని నుదుటమీద చేయివేసి రాస్తోంది.

"ఇక నువ్వు వెళ్లు" అన్నాడు గోపాల్.

"మళ్ళీ మీరు..."

"లేదు! నేను మాటిస్తున్నాను"

"సరే! ఇక మాట్లాడటం తగ్గించి నిద్రపోవటానికి ప్రయత్నించండి!" సున్నితమయిన వేళ్ళతో అతని కను

రెప్పలు మూస్తూ అంది.

"ఎవరయినా చూస్తే బాగుండదు" కంపిస్తోన్న చేతుల్తో ఆమె కోమలమయిన వేళ్ళను స్పృశిస్తూ అన్నాడు.

"పర్వాలేదు" ఆమె మాటల్లో తడబాటు కాని, భయంకాని లేవు. ఆమె హృదయం ఎంత పవిత్రమైనది? కాని తను తనకెప్పుడూ ఆలోచనలే! ప్రశాంతత లేదు. ఏదో భయం సదా తన్నావరించుకొంటూనే వుంటుంది. ఆమె నిజంగా దేవత! గోపాల్ కళ్ళు మూసుకుని తన మనోదర్పణంలో ప్రతిఫలించే ఆమె ప్రతి రూపాన్ని చూసుకున్నాడు. కొంతసేపు తర్వాత కళ్ళుతెరచి ఆమెను చూశాడు.

"నిద్రరాకపోతే చెప్పండి దీపం ఆర్పేస్తాను"

గోపాల్ తలూపాడు. జ్యోతి లేచి స్విచ్ ఆఫ్ చేసింది. గదిలో చీకటి ఆవరించింది. జ్యోతి మంచానికి దగ్గరగా కుర్చీ లాక్కొని కూర్చుంది. బయట వర్షం కురుస్తూనే వుంది. గోపాల్ని ఆ స్థితిలో వదిలి వెళ్ళిపోవడానికి ఆమెకు ఇష్టంలేదు. చీకట్లో తీవ్రంగా స్పందించే అతని గుండెల చప్పుడు వింటూ కూర్చుంది.

చీకటిలో కళ్ళు తెరిచి చూస్తే బరువేదో తొలగినట్లనిపించింది. మనసుకి కాస్త ప్రశాంతత చేకూరినట్టుగా వుంది. ఆమె కేసి చూశాడు గోపాల్. ఎంత భయరహితంగా, ప్రశాంతంగా కూర్చుని వుంది! వెలుగులోనూ, చీకటిలోనూ ఆమె ఒక్కలాగే వుంది. జీవితంలో ఎక్కడో ఒకానొక మలుపులో ఇద్దరూ కలుసుకొన్నారు. కొంత దూరం కలిసి ప్రయాణించారు. అంతే! అంతేనా? ఆమెకు తనపై ప్రేమ లేకపోతే ఎందుకని తనని వెంటాడుతోంది? ఎందుకని ఇన్ని సపర్యలు చేస్తోంది? ఇదంతా ఏమిటి? ప్రేమ కాదా? ఆమె అంతరాంతరాళాలలో వున్న రహస్యం ఏమిటి?

"ఏమిటాలోచిస్తున్నారు" జ్యోతి అతని నుదురు తాకుతూ అడిగింది.

ఉలిక్కిపడ్డాడతను— తన మనసులోని భావం పసిగట్టేసిందేమోనని.

"నిద్ర రావడం లేదా!" అతను మౌనంగా వుండడంతో మళ్ళీ అడిగింది.

"నిజం జ్యోతీ! ఇంకెప్పటికీ నిద్ర రాదేమోననిపిస్తోంది" నిట్టూర్చాడతను.

"అయితే ఓ పన్చేయండి"

"ఏమిటి"

"పనికిరాని ఆలోచనలు కట్టిపెట్టి జీవితాన్ని అర్థం చేసుకోవడానికి ప్రయత్నించండి"

"జీవితాన్ని అర్థం చేసుకోవడానికి ప్రయత్నిస్తాను. నా తప్పులు క్షమించి సహకరిస్తావా?"

"మనిషన్నవాడు తను చేసినతప్పుల్ని తలచుకొంటూ ఏడుస్తూ కూర్చోకూడదు! భవిష్యత్తులో మళ్ళీ వాటిని చేయకుండా జాగ్రత్తపడాలి"

"నేనూ అలాగే అనుకొంటున్నాను. కాని, తప్పనిసరి పరిస్థితులలో తప్పులు చేయక తప్పటం లేదు"

"తప్పనిసరి పరిస్థితులా?"

"అవును జ్యోతీ! బయట కురుస్తున్న వర్షం చూస్తున్నావు కదా! ఆ వర్షంలో కుళ్ళంతా కొట్టుకుపోయి భూమి పచ్చపచ్చగా మెరుస్తుంది రేపు! కాని, నా హృదయంలో పేరుకొన్న కల్మషం ఎప్పటికీ పోదు! రోజు రోజుకి ఎక్కువవుతూ వుంటుంది. దీన్నుండి తప్పించు

కొనే ప్రపాయం లేదు"

"మీ వుద్దేశ్యం ఏమిటో నాకర్థ మయింది"

"ఏమని?"

"మీరు దేన్నైతే వాంఛిస్తున్నారో అది దొరక్క దాని కోసం తపిస్తున్నారు. అది పోగొట్టుకుని బతకలేరు. మన మధ్య సామాజికపరమైన అడ్డు గోడలే వుంటే వాటిని మీ కోసం... మీ సుఖం కోసం భేదించేదాన్ని. కాని, ఇప్పుడు మాత్రం అది అసంభవం" గంభీరంగా అందామె.

"జ్యోతీ" ఆవేదనగా అరిచాడు గోపాల్.

జ్యోతి అతని నుదుట మీద నుండి చేయి తీసేస్తూ అంది- "అవును! అది అసంభవం! మీలో చెలరేగే తుఫాను కంటే మిమ్మల్ని తను కొడుకు ఆత్మకు ప్రతి రూపంగా భావిస్తూ మన కోసం బతుకుతోన్న తల్లిదండ్రుల గురించి ఆలోచించాల్సిన బాధ్యత నాకుంది. ఈ ఇంటి నుండి జ్యోతి బయటకు వెళ్ళిపోతే—వాళ్ళ జీవితాలకి ఓ అర్థం కలిగించేది జీవన్! జీవన్ వుంటే చాలు! వాళ్లు చావును కూడ నవ్వుతూ ఆహ్వానిస్తారు"

"జ్యోతీ! నాక్కూడ వాళ్ళే ముఖ్యం! వాళ్ళని దక్కించుకోవాలి! నన్నపార్థం చేసుకోవద్దు. నువ్వు నాతో సహకరిస్తావా?"



"ఏమిటి"

"నీకు నా జీవిత రహస్యం చెప్తాను! నీలోనే దాచుకొంటానని మాటివ్వాలి"

"ఏమిటా రహస్యం"

"ముందు నాకు మాటివ్వు! నా ఆరోగ్యం బాగుపడి నేను మీ అందరి నుండీ దూరంగా వెళ్ళిపోయే వరకూ బయట పెట్టనని మాటివ్వు"

"మీరు...?"

"అవును జ్యోతీ! బహుశా ఇది విన్నాక నువ్వు నన్ను అసహ్యించుకొంటావు కాని అసహ్యంతో నన్ను నలుగురిలో నవ్వుల పాలు చేయనని మాటివ్వు" గోపాల్ తన చేతిని ఆమెకేసి చాచాడు. ప్రమాణం చేసిందామె.

"నేను మీ 'జీవన్'నికాను! అంతేకాదు, నాకు పూర్వజన్మ జ్ఞానం కూడలేదు"

"మీరంటున్నది..."

"నిజమే! సంవత్సరాల తరబడి నా గుండెల్లో చెలరేగుతున్న జ్వాలల్ని ఈ నాడు బయటపెడుతున్నాను. నా జీవితం లోని ముఖ్యమైన రహస్యాన్ని నీముందు విప్పి చెప్తున్నాను"

"మీ మాటలు నేను నమ్మలేక పోతున్నాను"

"నేను నిజమే చెప్తున్నాను! ఇదేం సంధి ప్రేలాపనకాదు"

"మీరు మీ తప్పుల్ని ఈ తెరచాటున దాచుకోవటం లేదు కదా!"

"లేదు జ్యోతీ! లేదు! ఇదంతా నిజం! ఇదంతా ఓ కుట్ర! ఈ కుట్ర లో నేనొక్కణ్ణే కాదు"

"మరి"

"మీ గుమస్తా సూరజ్, మానాన్నా వున్నారు. సూరజ్ ఎవరో కాదు. మా నాన్న సవితల్లి కొడుకు! నాకు పెద నాన్న!"

"ఈ కుట్ర దేనికోసం" జ్యోతి విస్మయంగా అడిగింది.

"మీ డాడీ ఆస్తిని కాజేయడానికి.నేను చిన్న వాణ్ణి! ఎవరేమిచెప్తే అలాగే చేశాను"

అతనంతా చెప్పుకొంటూ పోతున్నాడు. ఆమె వింటోంది. కాని, అలా జరుగుతోందని ఆమెకు నమ్మకం చిక్కడం లేదు. డాడీ ఎంత ఘోరంగా, ఎంత తేలిగ్గా మోసపోయారు!

ఆమె తీక్షణంగా గోపాల్ కేసి చూసింది. అతని ముఖం చెమటతో తడిసి పోయింది. పదమూడు సంవత్సరాలుగా తమకంట్లో దుమ్ముకొట్టి, తమ బలహీనతలతో ఆడుకొన్నాడీవ్యక్తి! ఎందుకని? తమ ఆస్తి పాస్తులమీద అధికారం సంపాయించి జల్సాగా జీవితం గడపడానికి. ఇతని తండ్రులూ అంతే! డాడీకి ఈ విషయం తెలిస్తే అతనేం కావాలి?ఆయన ఆవేశంతో ఏమైనా చేయవచ్చు! వీళ్ళందర్నీ జైలుకు పంపించొచ్చు! గోపాల్ కూడ జైలుశిక్ష అనుభవిస్తాడా?

-చివరి ఆలోచనకు జ్యోతి ఉలిక్కిపడింది. ఆమె లేచి నిల్చుంది. గోపాల్ ఆమె చీర కొంగును పట్టుకులాగి కూర్చోమన్నాడు.

"జ్యోతీ! ఈ రహస్యాన్ని నీ మనసులోనే దాచుకొంటావు కదూ! నేను జీవితాంతం నా ఈ ముఖాన్ని నీకు చూపించను. దూరం! చాలా దూరం! మీకెవరికీ కన్పించనంత దూరం వెళ్ళి పోతాను. ఇంకెప్పుడూ రాను! ప్రమాణం చేసి చెప్తున్నాను. నా ప్రేమ మీద ప్రమాణం చేస్తున్నాను. నా మాట

నమ్మ! ప్రేమించే మనసు కల్మషంగా వుండ కూడదు! అందుకని... అందుకనే ఈ రహస్యాన్ని నీకు చెప్పగలిగాను"

జ్యోతి అతని చేతిలో చిక్కుకొన్న కొంగు విడిపించుకొని—"నా మాట కూడా మీరు విధిగా వినాలి" అంది.

"ఏమిటి"

"నేను చెప్పనంత వరకూ మీరు ఈ ఇల్లు వదిలి వెళ్ళకూడదు"

గోపాల్ మౌనంగా వుండిపోయాడు. జ్యోతి తన గదిలోనికి వెళ్ళిపోయింది. మంచంమీద పడుకొంది. మనసులో ఎన్నో ఆలోచనలు, క్రోధం, అసహ్యం, మనస్సులో సెగలు చిమ్ముతున్నాయి. కాని, ఎక్కడో ఏమూలో చిన్న సానుభూతి రేక కదులాడుతోంది. అతని ప్రేమ స్వచ్ఛమైనది. సందేహం లేదు. అతను రహస్యాన్ని బయటపెట్టి తన మనసులోని బరువును దించుకొన్నాడు. కాని, ఆ రహస్యం తెలుస్తూనే ఎంతమంది జీవితాలు పరితపిస్తాయో వూహించలేదు! ఆ నాటకంలో భాగం పంచుకొన్న ఒకో్క వ్యక్తీ ఆమె కళ్లముందు కదులాడుతున్నారు.




"నాన్నా"

"రా! గోపాల్"

"నన్ను రమ్మన్నావట" గోపాల్ పక్కనున్న ద్వారం కేసి చూస్తూ అన్నాడు. అక్కడ సూరజ్ నిలబడి అతన్నే చూస్తున్నాడు. గోపాల్ని చూస్తూనే చిరునవ్వు నవ్వాడు. అతని నవ్వు, ముఖంలో మారుతోన్న రంగులూ సూరజ్‌లో భయంకరమైన తుఫాను చెలరేగుతోందని చెప్పక చెప్తున్నాయి.

గోపాల్ కిటికీ లోంచి బయటకారులో నిరీక్షిస్తోన్న జ్యోతిని చూశాడు. వెళ్ళబోయాడు. కాని, సూరజ్ కంఠం అతన్ని ఆపేసింది.

"ఎక్కడికి ?"

"ఆ కారు ఎక్కడికి పోతేఅక్కడికి"

"ఆ కారు ఎక్కడికి వెళ్తే అక్కడికా? లేక ఆవిడ ఎక్కడికెళ్తే అక్కడికా ?"

"పెదనాన్నా ! నీకు చాలా సార్లు చెప్పాను. నాతో డొంక తిరుగుడుగా మాట్లాడొద్దని. చెప్పేదేదో సూటిగా చెప్పు"

"సూటిగాచెప్తే విరుచుకుపడిపోతావు"

"అది తరవాత"

"ఇలా నువ్వు ఆమె కొంగు పట్టుకు తిరగడం నాకేమీ నచ్చడం లేదు"

"అయితే"

"నీ జీవితం కోసం మనసుని చంపుకోమంటున్నాను"

"బాగుందయితే! నీ సుఖం కోసం నన్ను నేను చంపుకోవాలన్నమాట"

"వింటున్నావా! సావన్ ?" గర్జిస్తున్నట్టుగా అన్నాడు సూరజ్.

"డబ్బు కోసం గడ్డితినే ఆ ముసలాడితో ఎందుకు! నాతో మాట్లాడు"

"గోపాల్"

సావన్ గోపాల్ నోరు మూయించాలని చూశాడు. కాని, గోపాల్ అతనికి లొంగలేదు. తండ్రికేసి చూస్తూ—

"చూడు నాన్నా! మా ఇద్దరిలో నీ కెవరు కావాలో తేల్చుకో" అన్నాడు.

సూరజ్ వ్యంగ్యంగా ఓ కన్ను మూస్తూ– "అవును సావన్! నీకు కొడుకు కావాలా! లేక నేను కావాలా చెప్పు" అన్నాడు.

"నిజం నాన్నా! ఎవరు కావాలో తేల్చుకో" కిటికీ నుండి బయటకి చూస్తూ కోపంగా అన్నాడు గోపాల్.

"అలాగే నువ్వు కూడ తేల్చుకో! జీవితమా! జైలా!" సూరజ్ గోపాల్ భుజాన్ని చరుస్తూ అన్నాడు.

"జైలుకయితే ఒక్కణ్ణేం ఖర్మ! ముగ్గురం కలిసికట్టుగా పోదాం!" అన్నాడు గోపాల్. తర్వాత జవాబు ఆశించకుండానే గబగబా బయటికి వెళ్ళి పోయాడు. సూరజ్ కోపంగా కిటికీ లోంచి చూస్తూండిపోయాడు. గోపాల్ కారు స్టార్ట్ చేసి ముందుకు దూకాడు. సూరజ్ స్థాణువులా వుండిపోయాడు. సంవత్సరాల తరబడి పరిశ్రమించినఅతని శ్రమంతా బూడిదలో పోసిన పన్నీరవ బోతోంది.

"విన్నావా? నీ కొడుకు మనల్ని జైలుకు పంపించాలని ఆలోచిస్తున్నాడు"

"నన్నేం చేయమంటావు? ఎంత చెప్పినా వాడు వినటం లేదు"

"ఎలా వింటాడు? ఆ వయసూ, ఆ ప్రేమా, ఆకర్షణా మన మాట విన నీయవు! నాకు భయంగా వుంది"

"ఏం"

"ఆ ప్రేమ మైకంలో రహస్యాన్ని బట్టబయలు చేస్తాడేమోనని"

"అలాగే జరిగితే కొంప మునిగినట్టే"

"లేదు! అలా జరగడానికి వీల్లేదు! జరగనివ్వను" ఆవేశంగా అంటూ సూరజ్ అక్కణ్ణుంచి బయటకు వెళ్ళి పోయాడు. సావన్ పిలిచినా విన్పించు కోలేదు. తిన్నగా కల్నల్‌గారి భవనంకేసి నడిచాడు.

కల్నల్‌గారు హాల్లో కూర్చొని వార్తా పత్రిక చదువుతున్నారు. సూరజ్ అడుగుల చప్పుడు విని తలెత్తి చూశారు. అతన్ని కూచోమంటూ సౌంజ్ఞచేసి,పత్రిక చూస్తున్నారు.

"సూరజ్! బల్ల మీద పెన్సిల్ వుంది! కాస్త ఇలా తీసుకురా"

"తెస్తున్నాను బాబుగారూ!"

సూరజ్ ఇచ్చిన పెన్సిల్‌తో ఓకాలమ్ దగ్గర గుర్తు పెట్టారు కల్నల్‌గారు.

"ఏదైనా వ్యాపారం గురించి ఆలో చిస్తున్నారా బాబుగారూ!" నమ్రతగా అడిగాడు సూరజ్.

"ఈ వయసులో వ్యాపారమేమిటి? ఇప్పుడున్న పన్లకే తీరిక దొరకటం లేదు"

"మరి"

"ఇది పెళ్ళిళ్ళ కాలమ్! జ్యోతి పెళ్ళి గురించి ఆలోచించాలిగా"

"ఆ డాక్టర్‌గారి సంబంధమేమయింది బాబుగారూ!"

"నచ్చలేదని రాసేశాను"

"పత్రికల ద్వారా పెళ్ళి కొడుకులు దొరుకుతారా బాబుగారూ"

"...........

"ఆ రాణా సాబ్‌గారి సంబంధమే మయింది బాబుగారూ!"

"అనుకొన్నాం కాని, ఆఇంట్లోఎవరో చనిపోయారు. అందుకని తాత్సారం జరుగుతోంది"

"అలా అంటే ఎలా బాబుగారూ? దేని దారి దానిదే కదా!"

"ఆ విషయమే ఆలోచిస్తున్నాను. మళ్ళీ ఒకసారి శాంతీదేవిని అక్కడికి పంపా లనుకొంటున్నాను."

"ఇటువంటి విషయాల్లో ఆలస్యం ఏమంత మంచిదికాదు బాబుగారూ !"

"నిజమే! అబ్బాయికూడ గుణవంతుడు, అందగాడు."

"మరిక ఆలస్యం దేనికి బాబుగారూ?"

"కాని, వ్యవహారం ఎలా నడపడ మాని..."

"అదే నడుస్తుంది బాబుగారూ ! నా వుద్దేశ్యం ఏమిటంటే, అమ్మగారికి బదులుగా మీరే వెళ్తే మంచిదని..."

"కాని, ఆడపిల్ల తండ్రిగా వెళ్లి, వారిని అర్థించాలంటే...

"అదంతా నాకొదిలేయండి ! నేను చూసుకొంటాను. తమరు వెంటనే బయలు దేరండి"

"నాకన్నా నీకే ఎక్కువ తొందరగా వున్నట్టుంది"

"అదికాదు బాబుగారూ ! నా ఉద్దేశ్యం ఈ ఆదివారం వెళ్ళామని"

"సరే! నీ వుద్దేశ్యం బాగానేవుంది. ఈ కాస్తాబరువు తొలిగిపోతే మిగతా జీవితం ప్రశాంతంగా వెళ్ల మార్చొచ్చు"

"నిజమే బాబుగారూ ! ఎదిగిన ఆడ పిల్ల తల్లిదండ్రుల గుండెలమీద కుంపటి అన్నారు. ఆమె పెళ్ళయాక జమిందారీ చూడ్డానికి గోపాల్ ఎలాగూ వున్నాడు. ఇకమీరు నిశ్చింతంగా వుండొచ్చు"

"నేనూ అదే అనుకొంటున్నాను. నిజం చెప్పాలంటే గోపాల్ అందుకు సమర్థుడు"

"గోపాల్ కాదు బాబుగారూ! వాడు తమ కొడుకు. నా కొడుకు సమర్థుడనండి! వాడికెప్పుడూ డాడీ, మమ్మీ, జ్యోతీ ఇదేధ్యాస"

"చిన్నప్పుడు జ్యోతికి వాడికీ వచ్చే తగవులుచూసి భయంవేసేది. కాని ఇప్పుడు వాళ్లిద్దరూ ఒకర్నొకరు విడిచి క్షణం కూడ వుండలేకపోతున్నారు"

"వాళ్లిద్దరూ ఇంట్లో లేరా బాబు గారూ?" కావాలనే అడిగాడు సూరజ్.

"నది వొడ్డుకు షికారు వెళ్ళారు. వర్షకాలం కదూ ! కొండలనుంచి దూకే జలపాతాలు చూడ్డానికి అందంగా వుంటాయి. చిన్నపుడు నేను కూడ అంతే ! వర్షం వస్తేచాలు ! వాటిని చూట్టానికి పరిగెత్తేవాణ్ని ! గంటల తర బడి వాటిని చూస్తూ కాలం గడిపేసే వాణ్ని!"

"అచ్చం తండ్రిపోలికే ! జీవన్ కూడ అంతే బాబుగారూ ! వర్షం వస్తే చాలు ! నాభుజాల మీద ఎక్కి అక్కడికి పదమనే వాడు"

"అవును ! జీవన్ లేనిలోటును గోపాల్ తీరుస్తున్నాడు"

జీవన్ స్మృతి పథంలో మెదిలి కల్నల్‌గారి కళ్ళు చెమర్చాయి. సూరజ్ కూడ ఏడుపు నటించాడు.

"అమ్మాయి పెళ్ళయ్యాక తమరు ఒంటరివారైపోతారు బాబుగారూ" అన్నాడు.

అవును సూరజ్ ! అందుకే చట్ట బద్ధంగా గోపాల్‌ని నా కొడుకనిపించు కొని నా ఆస్తికి వారసుణ్ని చేయాలను కొంటున్నాను. ఈ గుక్కెడు ప్రాణం ఎప్పుడు గుటుక్కు మంటుందో ఎవరికి తెలుసు ?"

కల్నల్‌గారి మాటలు సూరజ్ చెవికి విజయ కీర్తనల్లా విన్పించాయి. అతని కళ్లల్లోనికి మెరుపు తోసుకొచ్చింది. కాని,

సంతోషాన్ని అణుచుకొన్నాడు.

"కాని, నాకు మాత్రం భయంగా వుంది. బాబుగారూ" అన్నాడు.

"ఎందుకని" కల్నల్‌గారు ఆశ్చర్య పోయారు.

"అంతవాడయ్యాక కళ్ళు మూసుకు పోతాయేమోనని"

"లేదు! వాడటువంటివాడు కాదు! ఒకవేళ అలాగే జరిగితే మానవత్వం మీద నమ్మకం వదులుకొంటాను"

"అయితే వకీల్ను కలవమంటారా"

"అదేమీ సమస్యకాదు! ఎటొచ్చీ సావన్ విషయం అనుమానంగా వుంది"

"అనుమానమా! దేనికి బాబుగారూ"

"గోపాల్ని తన వశంచేసుకొని మోస గిస్తాడేమోనని"

"ఆ విషయం గురించి తమరు చింతించకండి బాబుగారూ! అతనికి డబ్బే కావాలి! అతని ఆశను నేను ఖరీదు చేస్తాను"

"సరే అయితే ఈ విషయం ఇప్ప డప్పుడే..."

"... ఎవరితో చెప్పను బాబుగారూ!" అంటూ సూరజ్ పక్కకు తిరిగేసరికి



బయట ద్వారానికున్న కర్టన్ తొలగించుకొంటూ గోపాల్, జ్యోతి రావటం కన్పించింది. కళకళలాడుతున్న సూరజ్ మొహం వెలవెలబోయింది. వాళ్ళ దృష్టి నుండి తప్పుకొంటూ మరో ద్వారం నుండి బయటికి జారుకొన్నాడతను.

ఆదివారం ఉదయం కల్నల్‌గారు శాంతిదేవి ఎక్కడికో వెళ్ళడానికి తయారవుతున్నారు. ఏదో అత్యవసర పనిమీద బినాపూరు వెళ్తున్నట్టు చెప్పారు. సూరజ్ కూడ వెళుతున్నాడు. వాళ్ళెందుకు వెళుతున్నదీ ఎవరికీ అర్థంకాలేదు. గోపాల్‌కి కూడ అర్థం కాక ఆశ్చర్యపోయాడు.

కల్నల్‌గారు జ్యోతిని, గోపాల్ని ఇంటి దగ్గర జాగ్రత్తగా వుండమన్చెప్పి బయలుదేరారు. కారణం తెలియనివ్వకుండా వాళ్ళు వెళ్ళటం, వెంట సూరజ్ కూడ బయలుదేరడంతో గోపాల్ మనసులో ఎన్నెన్నో అనుమానాలు రేగాయి. పైకి మాత్రం గంభీరంగా వున్నాడు. మౌనంగా తన గదిలోనికి వెళ్ళిపోయాడు.

ద్వారం దగ్గర చప్పుడయింది. గదంతా సువాసనలతో నిండిపోవడం గదిలోనికి వచ్చింది జ్యోతని చెప్పక చెప్పింది గోపాల్‌కి.

"నువ్వు వెళ్ళలేదా" ఆమెకేసి చూడకుండానే అడిగాడు గోపాల్.

"లేదు" అతని ఎదుటకు వస్తూఅంది.

"వెళ్ళవలసింది. కాలక్షేపంగానూ, కొత్త వూరు చూసినట్టుగానూ వుండేది"

"నిజమే! కాని, వెళ్ళాలన్పించలేదు"

"ఏం'' అటుకేసి తిరిగాడు. నాలుగు కళ్లూ కలిశాయి. ఆమె తడబడింది.

"మీరు ఒంటరైపోతారని"

"అయితేనేం? నన్నెవరైనా ఎత్తుకుపోతారా?"

"అదికాదు! వీలుచూసుకొని మీరే పారిపోతారేమో" నని కొంటెగా నవ్వింది ఆమె. ఆమె పెదవులు తుమ్మెద తాకిన పూల రెక్కల్లా కంపిస్తున్నాయి.

"నేను పారిపోతానని ఎందుకనుకొన్నావు?"

"అలాంటివారు కాబట్టి..."

"అలా ఎన్నాడూ జరగదు జ్యోతీ! మాటిస్తే తప్పేవాణ్ణికాను! నీ అనుమతి లేందే ఎక్కడికీ వెళ్ళను"

"నిజం"

"ఊఁ"

"వీళ్ళు బినాపూరు ఎందుకు వెళ్ళినట్టు?"

"ఓ అబ్బాయిని చూట్టానికి!" కింది పెదవిని నొక్కిపెడుతూ అందామె. అతను ఆపాదమస్తకం కంపించడం చూసింది.

"ఈసారి మీ స్థానంలో సూరజ్ వెళ్ళాడు" అంది.

"ఎందుకని వెళ్ళడు? అతనికీ విషయంలో చాలా తొందరగా వుంది''

"ఎందుకని?"

"నేను నిన్ను ప్రేమిస్తున్నాను. ఈ ప్రేమలోపడి ఆ రహస్యం కాస్తా ఎక్కడ బయటపెట్టేస్తానేమో నని అతని భయం"

"అతని అనుమానం నిజమేగా! జరిగింది అదేగా!"

"అది నిజమే! ఏ రోజయితే నీకు ఆ రహస్యం చెప్పానో, ఆనాటినుండి నా మనసులో పెద్ద బరువు తొలగిపోయినట్టుగా తేలిగ్గావుంది. అతని పేరాశ బూడిదపాలైన రోజు దగ్గర్లోనే వుందన్పిస్తోంది"

"అదెలా?"

"నేను వెళ్ళిపోయాక అన్ని విషయాలూ బయటపడతాయి"

"మీరు వెళ్తే డాడీ, మమ్మీ ఏమవుతారో ఆలోచించారా?"

"ఆలోచించాను. నిజం తెలిశాక నన్ను మోసగాడిగా, నీచుడిగా, దొంగగా భావించి నన్ను మరిచిపోతారు"

"మరి మీ నాన్నా పెదనాన్నా!"

"జైలుకుపోతారు! తప్పుచేసినందుకు శిక్ష అనుభవించవలసిందే"

"మరి మీరు?"

"ఈ శిక్ష నాకు చాలదనా? నీకు దూరంగా, నిన్ను విడిచి వుండటం కన్నా కఠినమైన శిక్ష ఇంకేముంది!"

"అయితే ఎప్పుడు వెళ్ళిపోతారు?"

"నువ్వెప్పుడు అనుమతిస్తే అప్పుడు"

"మీరింక నిరీక్షించనవసరం లేదు. త్వరలో అనుమతిస్తాను"

"నువ్వేం నిర్ణయించుకొన్నావు?"

"మీరేం భయపడనక్కర్లేదు. మీకు స్వేచ్ఛ దొరికేవరకూ రహస్యం రహస్యంగానే వుంటుంది"

"అసలు నీ నిర్ణయం ఏమిటి?"

"ఏమీ లేదు! నా పెళ్ళివరకూ మీరిక్కడే వుండాలి"

"ఆరోజెప్పుడు?"

"త్వరలో! డాడీ బినాపూరు నుండి రావడం ఆలస్యం"

"ఈ సంబంధమే ఖాయమవుతుందని ఎందుకనుకొంటున్నావు?"

"మాకు కావలిసినవాళ్లు వాళ్ళుగదా! వారు 'అవును' అనడం ఆలస్యం. పెళ్ళయిపోతుంది."

"పెళ్లికొడుకు???"

"నా ఊహల్ని మించిపోయాడు."

"నువ్వతన్ని ఎప్పుడయినా చూశావా?"

"చూశాను!" జ్యోతి పెదవులో నాలికను అదుముతూ అతనికేసి పరిశీలనగా చూసింది. గోపాల్ నిశ్శబ్దంగా వుండిపోయాడు. జ్యోతి తనకేసి అలా చూస్తోంటే తనలో కలిగే కలవరాన్ని శతథా దాచుకొన్నాడు.

"నాకు తగిన శిక్షనే వేశావు! శిక్షను సంతోషంగా స్వీకరిస్తాను" అన్నాడు. విసురుగా బీరువా దగ్గరికి వెళ్లి బట్టలు సర్ద సాగాడు. జ్యోతి అతని పక్కనే నిల్చుని అతనిలో కలిగే భావ సంచలనాన్ని గమనిస్తోంది. ఆవేదనతో కూడుకొన్న నిట్టూర్పులు, తెల్లగా పాలిపోయిన మొహం,వణుకుతోన్న చేతులూ, చూస్తోంటే ఏదో నిస్పృహ అతని ప్రతి కదలికలోనూ కన్పిస్తోంది.

బట్టలు మడత పెడుతున్నప్పుడు చెయ్యి తగిలి, బల్ల మీదున్న ఫ్లవర్‌వాజ్ కింద పడి రెండు ముక్కలయింది. గోపాల్ ఆ ముక్కల్ని ఎత్తుతూ, జ్యోతికేసి బాధగా చూశాడు.

"బాధపడకండి! పాతదే కదా!" అంది జ్యోతి.

"నా దగ్గరో లోషన్ వుంది. దాన్తో అతికేయొచ్చు"

"కాని, దానికున్న అతుకులు మాసవు" జ్యోతి అన్నమాటలు సూదిగా అతని హృదయానికి తాకాయి. ఆమె ఆమాటల్ని తనపై గుప్పించినదనుకొన్నాడు. గోపాల్ మౌనంగా ఆ ముక్కల్ని కిటికీలోంచి విసిరేశాడు.

"అదేమిటి" జ్యోతి విస్మయంగా అడిగింది.

"ఇప్పుడా అతుకులుకూడా వుండవు?

శాశ్వతంగా దూరమైంది. మరిచిపోగలం"

"దేనిని?మనస్సునా?ఫ్లవర్ వాజునా?" చటుక్కున అడిగింది జ్యోతి. గోపాల్ జవాబుఇవ్వలేదు. లోలోన అతని మనసు చిత్రవధ అనుభవిస్తోంది.

చాలా సేపు ఇద్దరూ మాట్లాడుకోలేదు. అతను మౌనంగా బట్టలు సర్దుతూవుంటే, ఆమె అతని కోట్స్‌ను బ్రష్ చేస్తోంది.

"ఈ రోజు భోజనంలోనికి ఏం చేయ మంటావు?" అనడిగింది మళ్ళీ.

"నీ ఇష్టం నాకేం ఆకలిగాలేదు"

"వంటయ్యేసరికి ఆకలిపుడుతుంది లెండి"

"అప్పటికి ఏం వుం టే అ దే తింటాను"

"అదేంలేదు! ఈ రోజు మనిద్దరమే వున్నాం గనుక మనసుకు నచ్చింది చేసు కొని తినాలి"

"చెప్పానుగా! ఆ క లి గా లే ద ని" విసుగ్గా, తీవ్రంగా అన్నాడతను.

"సరే అయితే! ఆకలి వేసినప్పుడు ఆకల్నే భోంచేయండి!"జ్యోతికూడ విసు రుగా అంటూ తన గదిలోనికి వెళ్ళి పోయింది. అతను ఆమెను ఆపటానికి ఎటువంటి ప్రయత్నం చెయ్యలేదు. విరుద్ధ భావాల సంఘర్షణలో అతని మనసు చిన్నాభిన్నమైంది. అ త ని లో చెలరేగే బాధకు సాంత్వన చేకూర్చక, ఆ బాధని రెట్టింపు చేసింది జ్యోతి. తన వినాశనాన్ని కళ్ళారా చూడాలను కొంటోంది. ఆమె పెళ్లిపీటలమీదుంటే తను భరించలేని బాధను దిగమింగుతూ, నవ్వుతూ తిరగాలి! అది త న కు సాధ్యమా? హృదయంలో చితిరగుల్తూ వుంటే తను ప్రశాంతంగా ఎలా తిరుగు తాడు.

తన వల్లకాదు ! జ్యోతి ఎంత తెలివిగా తనకీ కఠినశిక్ష విధించింది ? తను జీవితాంతం మరిచిపోలేని శిక్ష! లేదు. అలా జరక్కూడదు ! ఈ రోజే కల్నల్ గారితో అన్ని విషయాలు చెప్పేస్తే ?! అయన తనను జైలుకు పంపినా, మరే శిక్ష విధించినా ఫర్వాలేదు. అంతేకాని, తన ఆత్మ అశాంతితో కొట్టుకులాడితే సహించలేడు. పిచ్చివాడయిపోతాడు.

అతను పిచ్చిగా బీరువాలోని వస్తువు లన్నీ బయటకు విసిరేశాడు. హఠాత్తుగా మరో ఆలోచన అతనికి సమ్మెట దెబ్బగా తగిలింది. 'తన రహస్యం వెల్లడి చేశాక, తనకి శాంతి లభిస్తుందని నమ్మకమేమిటి?'

ఆలోచనలను అరికట్టడానికి గోపాల్ జ్యోతిని వెతుక్కొంటూ వెళ్ళాడు. ఆమె తన గదిలో లేదు. వంటింట్లోకాని, డాడీ గదిలో కానీ లేదు. ఆశ్చర్యపోయాడు. వెతుకుతోంటే— వెనుకవైపు వరండాలో స్తంభాని కానుకొని ఏదో ఆలోచిస్తోన్న జ్యోతి కన్పించింది. గోపాల్ నెమ్మదిగా వెళ్ళి ఆమె వెనుక నిల్చున్నాడు.

"ఏమిటాలోచిస్తున్నావు ?" అడిగాడు.

"మీరా" అతనికేసి తిరిగింది జ్యోతి. కళ్ళని కొంగుతో వత్తుకొంటూ పెదిమల పైకి బలవంతంగా చిరునవ్వు తీసుకు రావటం గమనించాడతను.

"ఒంటరిగా నిల్చుని ఏమిటాలోచిస్తు న్నావు ?"

"ఇప్పుడేమవుతుంది ?"

"ఏ విషయంలో"

"డాడీ ఆ సంబంధం నిశ్చయం చేస్తారు"

"మంచిదేగా"

"అతనిలో ఏ దోషం లేనప్పుడు, నేనా

సంబంధాన్ని ఎలా కాదనాలి."

"దేనికి?" గోపాల్ ఆశ్చర్యంగా అడిగాడు.

"మీ బాధనుచూస్తూ నేనెలా బతకను"

"జ్యోతీ !"

"అవును! మనస్ఫూర్తిగాచెప్తున్నాను"

ఆమె కళ్ళనుండి చెక్కిళ్ళమీదకు జారిన నీటిబిందువు తళుక్కున మెరిసింది గోపాల్ రెండు చేతుల్తో ఆమెనులాక్కొని తన హృదయానికి గాఢంగా హత్తుకున్నాడు. ఆమె పసిపిల్లలా కరుచుకు పోయిందతన్ని !

ఏడుస్తూ ఆమె ఏదో చెప్పబోయింది. కాని, చెప్పలేకపోయింది. పెదవులు వణికాయి అంతే ! గోపాల్ తన్మయంగా అలాగే నిల్చున్నాడు. ఆమె కౌగిలినుండి విడివడి గదిలోనికి పరుగెత్తింది.

ఆమె తన కళ్ళముందు లేకపోయే సరికి అతనుకూడ పిచ్చిగా ఆమె వెనుక పరిగెత్తాడు. గది ద్వారం దగ్గరకొచ్చి ఆగిపోయాడు. జ్యోతిలో కలిగిన మార్పు మీద అతనికింకా నమ్మకం లేదు.




"లేదు ! అలా జరగడానికి వీల్లేదు"

"అలాగని చావుని కోరి తెచ్చు కొంటావా ?"

"......"

"పిచ్చిగా ప్రవర్తించకు గోపాల్ ! త్వరలో కల్నల్‌గారు నిన్ను తమ యావదాస్తికీ వారసుడిగా చేయబోతున్నారు. ఇన్నాళ్ళ మా కష్టాన్ని తృణీకరించకు."

"ఆస్తిపాస్తులేవీ నాకక్కర్లేదు."

"చూడు ! మార్గాలు వేరైనా గమ్యం ఒకటే! కొడుకుగా కాకపోతే అల్లుడిగానైనా ఆస్తిమీద అధికారం సంపాదించు ! మాకేమీ అభ్యంతరంలేదు. కాని, నిజం తెలిశాక వాళ్ళు నీ ముఖం కూడ చూడరు తెలుసా ?"

"ఆ విషయంనాకు తెలుసు."

"అంటే ఆ పిల్లమీద నీ కంత నమ్మకం వుందన్నమాట"

"పెదనాన్నా ! ఇది ప్రేమ ! నీకెలా నచ్చజెప్పను ?"

"అయితే బాగా గుర్తుంచుకో ! ఈ రహస్యం ఏ ఒక్కరికీ తెలీకూడదు."

"తెలిస్తే"

"నీ ఆశల్నీ, ప్రేమల్నీ నేలమట్టం చేస్తాను."

"అదంత తేలిక కాదు పెదనాన్నా"

"కాని, ఓ విషయం మరిచిపోకు ! నిన్ను గోపాల్‌నుండి 'జీవన్'గా మార్చ గలిగినవాడు, నువ్వే 'జీవన్' అని కూడ రుజువు చేయగలడు''

"పెదనాన్నా"

"ఏం నువ్వు ప్రేమలోపడి కల్నల్ గారితో 'జీవన్'నికానని గోపాల్నని చెప్పాలను కొంటున్నావుగా"

"అవును! ఇందులో అబద్ధమేముంది?"

"సత్యా సత్యాలు ఎవరికీ తెలియవు! ఈ ప్రపంచంలో ప్రతి విషయానికీ రుజువులుంటాయి. నువ్వు జీవన్‌వేనని, గోపాల్‌వికావని, కేవలం జ్యోతి కోసం ఇదొక నాటకమని నేను నిరూపిస్తే !"

గోపాల్‌కు మాటలు దొరక్క

కోపంగా మెటికలు విరుచుకొన్నాడు. అతనికేం తోచడం లేదు. తండ్రిని చూశాడు. తండ్రి కళ్ళలో కొడుకు పట్ల ఏ మాత్రం సానుభూతి లేదు. గోపాల్ లేచి, ఎవర్నీ పట్టించుకోకుండా బయటకు నడిచాడు. ఏదో నిశ్చయించుకొన్నట్టుగా వెళ్ళిపోయాడు.

సావన్ అతన్ని ఆపాలనుకొన్నాడు. కాని, గోపాల్ వెనుతిరిగి కూడ చూడలేదు అతని నిర్లక్ష్యాన్ని చూసి సూరజ్ ఆశ్చర్యపోయాడు. తను తీసిన గోతిలో తనే పడతానని అతను కలలో కూడ వూహించలేదు. అతని కలలన్నీ కల్లలవుతున్నాయి. అతని నమ్మకాలు సడలిపోతున్నాయి. జ్యోతీ, గోపాల్‌ల ప్రేమ బంధాన్ని విడదీయడం తేలిక కాదన్పిస్తోందతనికి. సూరజ్ గంభీరంగా ఆలోచనలో మునిగిపోయాడు. సావన్ అన్న మొహంలో మారుతున్న రంగులు చూస్తూండి పోయాడు. కొడుక్కీ, అన్నకీ మధ్య రాయిలా వున్నాడు. ఒకరు తోస్తే మరొకరి వైపు దొర్లిపోయే రాయిలా వుందతని పరిస్థితి! అంతే!

"సరే చూస్తాను!'' అన్న సూరజ్ మాటలువిని సావన్‌కు ప్రాణం లేచి వచ్చినట్టయింది.

'సావన్! నువ్వేం కంగారు పడకు? కర్ర విరక్కుండా పాము చస్తుంది. చూస్కో!' సావన్ కళ్ళల్లోకి చూస్తూ అన్నాడు సూరజ్.

"ఎలా"

"మన పద్ధతిలో మార్పురావాలి! నువ్వు గోపాల్నోకంట కనిపెట్టాలి"

"మరి నువ్వు"

"నేను నా పట్టుదల మీదుంటాను"

"దీనివల్ల లాభం ఏమిటి?"

"చెప్పాను కదా పాము చస్తుంది"

"కర్ర విరగదు! అంతేనా!" సావన్ వాక్యం పూర్తిచేస్తూ అన్నకేసి చూశాడు.

తన గదిలో ఒంటరిగా ఆలోచిస్తూ కూర్చొన్నాడు గోపాల్. జ్యోతి తన మనసు విప్పి అతని జీవన పథాన్నే మార్చివేసింది. అతని ఆశలకు జీవం పోసింది. నిరాశా నిశీథిలో వెలుగు కిరణం సోకింది ఇక తనని తాను వంచించుకోవడానిక్కాని, కల్నల్ గారిని వంచించనవసరం గానీ లేవు. తను కల్నల్‌గారితో అంతాచెప్పేస్తాడు.

కాని, సూరజ్ చేసిన హెచ్చరిక అతని ఆలోచనల్ని తలక్రిందులు చేస్తోంది. తను గోపాల్నేనని 'జీవన్'ని కానని చెప్పినట్టే, సూరజ్ తను కేవలం జ్యోతి కోసం ఈ నాటకం ఆడుతున్నట్టు నిరూపించదని నమ్మకం ఏమిటి?

కల్నల్‌గారు బినాపూర్‌లోని ఆ సంబంధాన్ని చూసివచ్చారు. కుర్రాడు అందరికీ నచ్చాడు. అన్ని విషయాలు మాట్లాడుకున్నారు. అబ్బాయి, అమ్మాయి ఒకర్నొకరు చూసుకున్నాక ఏదో ఒకటి నిర్ణయిస్తారు. అన్నిటా వుత్తముడిగా వున్న ఆ కుర్రాణ్ని జ్యోతి ఏ వంకతో కాదనగలదు? ఇటువంటి సమయంలో సూరజ్ నిప్పురవ్వ రేపితే ఏమవుతుంది?

జ్యోతి పిలుపుకి ఆలోచనల నుండి తేరుకున్నాడు. ఆమె ముఖమ్మీద ముంగురులు, చందమామను కప్పుకొన్న మబ్బుల్లా దోబూచులాడుతున్నాయి. కొన్ని క్షణాలు ఒకర్నొకరు చూసుకున్నారు. జ్యోతి చిరునవ్వు నవ్వింది.

"లోపలికి రా జ్యోతీ"

జ్యోతి కిలకిలా నవ్వింది. అతను

ఆశ్చర్యంగా ఆమెకేసి చూశాడు. ఆమె నవ్వుకు కారణం ఏమిటి?

"ఓ విషయం జ్ఞాపకం వచ్చింది" పెదవులు బిగిస్తూ అంది జ్యోతి.

"ఏ విషయం ?"

"ఆ రోజు డాక్టర్ని మనం ఏడ్పించాం గుర్తుందా ?"

"ఉంది కాని ఇప్పుడ్నీ కెందుకు జ్ఞాపకం వచ్చినట్టు ?"

"మీ ఏడుపు ముఖం చూస్తుంటేనూ.."

"ఏమయింది ?"

"సరిగ్గా అలాగే కొండముచ్చులా"

ఆ మాటలకి ఇద్దరూ విరగబడి నవ్వుకున్నారు. ఇంతలో మమ్మీ జ్యోతిని పిలిచింది. ఇద్దరి నవ్వులు ఆగిపోయాయి. ఆమె బయటకు పరుగెత్తబోయింది. గోపాల్ ఆమెను పట్టుకుని తనవైపుకు లాక్కున్నాడు.

"వదలండీ ! మమ్మీ పిలుస్తోంది"

"నే విన్నాన్లే"

"అందుకే వదలండి" జ్యోతి విడిపించుకుంది. వెళ్ళిపోయింది. గోపాల్ ఆమె వెళ్ళినవైపే చూస్తోండిపోయాడు. ఆమెకూ, తనకూ ఎంత భేదం? జ్యోతి ఎంత ప్రశాంతంగా వుంది? తనో నిరంతరం అశాంతిగానే కొట్టుకొంటాడు! ఆమె నవ్వుతూనే ఎదురయ్యే సమస్యల్ని పరిష్కరించుకుంటుంది. జ్యోతి చిరునవ్వు అతనిమీద మంత్రంలా పనిచేసింది. వరండాలోనికొచ్చి పచార్లు చేశాడు.

మూలాన పాతింట్లోంచి సూరజ్ బయటకు రావడం చూశాడు. దొంగలా నలువైపులా చూసుకొంటూ, గబగబా వెళ్ళిపోయాడు. సూరజ్ అలా వెళ్ళడం గోపాల్ కేదో అనుమానం కలిగింది. అతను తండ్రి దగ్గరకు బయల్దేరాడు. తండ్రికి తనమీద ప్రేముంది ! కాని అన్నగారికెందుకో భయపడ్తున్నాడు. అందుకు కారణం ఏమిటి ?

గోపాల్ ఇంట్లోకి వస్తోంటే, ద్వారం దగ్గర చప్పుడు విని బీరువా తలుపు మూస్తూ చప్పున ఇటు తిరిగాడు సావన్. ఎదురుగా గోపాల్ని చూశాక అతని మొహంలోని ఆందోళన, చిరునవ్వుగా మారిపోయింది. బీరువా తెరిచి ఆపిల్ పండు తీసి తినమంటూ,గోపాల్ కిచ్చాడు. గోపాల్ ఆపిల్ అందుకొన్నాడు. సావన్ మొహం వికసించింది. తన మీద కొడుక్కి ఎటువంటి కోపమూ లేదని నిర్ణయించుకున్నాడు.

"నాన్నా !" గోపాల్ ఆపిల్ కొరికాడు.

"ఏం బాబూ !"

"నిజంచెప్పు నాన్నా! నేను నీ కొడుకు నేనా ?"

"అలా అడిగావేం బాబూ ? నా సర్వస్వం నువ్వే! నువ్వు తప్పించి నాకింకెవరున్నారు ?"

"నేనంటే నీకిష్టమేనా ?"

"ఎందుక్కాదు ? నా కంటి వెలుగు నువ్వే బాబూ !"

"అయితే మరి నా కోసం చితినెందుకు పేరుస్తున్నావు ?"

"బాబూ! ఎంతమాటన్నావు"

"నీ పాపానికి ప్రాయశ్చిత్తం చేసుకోవాలి నాన్నా !"

"గోపాల్ !"

"అవున్నాన్నా ! పెదనాన్నని వదిలి నాతో రా! కొడుకు మేలు కోరితే ఈ త్యాగం నువ్వు చేసి తీరాలి"

"లేదుబాబూ ! లేదు అలా ఎన్నటికీ జరగదు"

"ఎందుకని ?"

"నేనసమర్థుణ్ణి"

"అదే ఎందుకని అడుగుతున్నాను"

"అదో రహస్యం"

"రహస్యమా ?" ఆశ్చర్యంగా తండ్రి కేసి చూశాడు.

"రహస్యమే ! నేనేమీ చెప్పలేను ! నన్నేమీ అడక్కు"

"అలాకాదు! ఆ రహస్యం ఏమిటో చెప్పి తీరాలి"

సావన్ కొన్ని క్షణాలు నిశ్శబ్దంగా వుండిపోయాడు. అతని మొహం తెల్లగా పాలిపోయి వుంది. నుదుటినిండా చెమట పట్టేస్తుంది. కొడుకు ముఖం చూశ్శేక, తల దించుకొని, నెమ్మదిగా వణుకుతున్న గొంతుకతో,

"నేను హంతకుణ్ణి బాబూ !" అన్నాడు.

"హంతకుడివా?" గోపాల్ విస్మయంగా తండ్రికేసి చూశాడు.

"అవును! నేను హంతకుణ్ణి! హత్య చేశాను ! ఈ రహస్యం మీ పెద్దనాన్నకు తప్ప, మరెవరికీ తెలీదు"

"ఎవర్ని హత్య చేశావు ?"

"నీకు జ్ఞాపకం వుండొచ్చు ! మన వీధిలో ఓ హత్య జరిగింది. నథ్యూ హత్యచేయబడ్డాడు."

"అవును ! నథ్యూలాల్! ఓ రాత్రి అతన్నెవడో దొంగ చంపేశాడు."

"అతన్ని చంపింది దొంగకాదు ! నేనే !"

"కారణం"

"ఇప్పుడా విషయాలన్నీ అడక్కు గోపాల్!నేను పిచ్చి వాణ్ణయి పోతాను"

"అయితే పెదనాన్న!"

"అతనికి రహస్యం తెలుసు! నన్నా హత్యనుండి కాపాడింది ఆయనే"

"అర్థమయింది! ఆయన చేసిన ఉపకారానికి ప్రత్యుపకారం ఇదన్నమాట! జీవితాంతం ఇలా జరగవలసిందేనా?"

"పేదవాణ్ని! అసమర్థుణ్ని! నేనేం చేయలేను! కన్నకొడుకువై నువ్వు కూడ ఎదురు తిరుగుతున్నావు"

"ఇంతకూ అతనికక్కావల్సిందేమిటి? నా ప్రాణమా?"

"ఈ రహస్యాన్ని రహస్యంగా వుంచడానికి అతను పదివేల రూపాయలు కావాలన్నాడు. అంత మొత్తం ఇవ్వగలిగే స్తోమత నాకెక్కడిది? నేను ఒంటరి గాణ్నయితే ఎప్పుడో పోలీసులకు తల వంచే వాణ్ని! కాని, నువ్వూ, నీ భవిష్యత్తూ నాకా అవకాశాన్నివ్వలేదు. నేను జైలు పాలయితే నువ్వేమయ్యేవాడివి! ఖూనీకోరు కొడుకువని ఈ సమాజం నిన్ను కాకిలా పొడుచుకు తినేది. ఇప్పుడు చెప్పు నన్నేం చేయమంటావ్" అతని గొంతు పూడుకుపోయింది.

తండ్రి రహస్యం వింటూనే గోపాల్ కోపంతో పళ్ళు నూరాడు. కొరుకుతున్న ఆపిల్‌ను గోడకేసి కొట్టి గబగబా బయటికి నడిచాడు. తిన్నగా సూరజ్ ఇంటికి వెళ్ళాడు. సూరజ్ వరండాలో కూచొని చెప్పులు తుడుచుకొంటున్నాడు.గోపాల్ని చూసి, తిన్నగా ఇంట్లోనికి వెళ్ళిపోయాడు. గోపాల్ అతని వెనుకనే వెళ్ళాడు.

"నువ్వు మా నాన్న జీవితాన్ని ఎంతకి ఖరీదు చేశావ్" అనడిగాడు గోపాల్.

"పదివేల రూపాయలు"

"అంత డబ్బు ఇవ్వకపోతే"

"నేనెలా చెప్తే మీరలా నడుచుకోవాల్సుంటుంది"

"నీకసలు జాలీ దయా తెలుసా?"

"జాలీ! దయా! వ్యాపారంలో ఇటువంటి పదాలకు తావులేదు"

"వ్యాపారం! నీకు పదివేల రూపాయాలు కావాలి! అంతేనా! నేనిస్తాను"

"అయితే ఇవ్వు"

"కాని, డబ్బిచ్చాక నువ్వు నోరు మూసుకొంటావని నాకు నమ్మకం ఏమిటి?"

"నేను ఆడినమాట తప్పేవాణ్ని కాను! అంతే కాదు ఆ ఉత్తరం కూడా ఇచ్చేస్తాను"

"ఏఉత్తరం?"

"హత్య చేశాక, నీ తండ్రి నా సాయం కోరుతూ రాసిన ఉత్తరం"

"ఈ హత్యకు సాక్ష్యాధారాలు కూడ నీదగ్గర వున్నాయన్నమాట"

"లేకుంటే మాటలతో తేలే వ్యవహారమా ఇది"

"సరే! నీ డబ్బు నీకు ముడుతుంది"

"ఎలా"

"అదంతా నీ కనవసరం! కొద్ది రోజులు మాత్రం టైం కావాలి"

"ఎన్నిరోజులు! అప్పటికి నీకూ జ్యోతికీ పెళ్లయిపోతుంది.నేనూ మీనాన్న జైలుకు పోతాం! అంతేనా!"

"ఆ భయం మీకక్కర్లేదు"



"గోపాల్ బాగా ఆలోచించుకో! నేనంత తేలిగ్గా మోసపోయేవాణ్ని కాను! మీ తండ్రీ కొడుకులిద్దరూ నా నుంచి వేరు కావాలనుకొంటే, ముందు నా చేతిలో పది వేల రూపాయలు పడాలి! తెలిసిందా?"

"తెలిసింది.కాని, అంత మొత్తం..."

"మనసుంటే మార్గముండకపోదు! లక్ష మార్గాలున్నాయి. సాహసం కావాలి! అయినా అదంతా నాకనవసరం. నువ్వే విధంగా సంపాదించినా సరే! నాక్కావల్సింది పదివేల రూపాయలు. నిజానికి నాకీ లోకంలో ఎవరున్నారు? డబ్బులేక పోతే ముసలితనంలో నన్నెవరు ఆదరిస్తారు?"

"నిన్నిక్కణ్నుంచి వెళ్ళి పొమ్మని ఎవరన్నారు?"

"అధికారం నీ హస్తగతమయ్యాక నాగతేమిటో నాకు బాగా తెలుసు"

"అయితే నన్నేం చేయమంటావు?"

"ఏమయినా చెయ్యి! నాక్కావల్సింది డబ్బు!"

"అందుకు కొంత 'టైం' కావాలని చెప్పాను"

"కల్నల్‌గారిని అడుగు" విషపు నవ్వు నవ్వుతూ అన్నాడు.

"అది అసంభవం"

"లేకుంటే జ్యోతిని"

"అంత డబ్బు ఆమె ఎక్కణ్నుంచి తెస్తుంది...."

"ప్రేమ కోసం ఎక్కణ్నుంచైనా"

"దొంగతనం చేస్తుందా"

"చేసినా తప్పులేదు" వ్యంగ్యంగా నవ్వుతూ అన్నాడు సూరజ్.

"పెదనాన్నా?" పిడికిలి బిగిస్తూ అరిచాడు గోపాల్.

"ఆమె చేయవలిసిన అవసరంలేదు! నువ్వుచేస్తే చాలు!"

"నువ్వేమంటున్నావో తెలుసా?"

"దారి చూపిస్తున్నాను"

"పెదనాన్నా! ఈ పని నా చేత కాదు"

"అధైర్యపడకు!అంత త్వరగా నిరాశ చెందకు! ప్రేమికులు తమ ప్రేమ కోసం ఏమైనా చేస్తారు"

"అటువంటి ప్రేమ నాకక్కర్లేదు"

"అయితే మరి సమస్యే లేదు, గోపాల్ కావటానికి ప్రయత్నించకు! జీవన్‌గానే వుండిపో! నీ చేతులతో జ్యోతి పెళ్ళిచేసి ఈ జాగీరునంతా హాయిగా అనుభవించు"

"లేదు పెదనాన్నా!అలా జరగదు! నేను ఎవరిని మోసం చేసినా, జ్యోతిని మాత్రం మోసం చేయలేను"

"అయితే నేనూ ఏమిచేయలేను"

."విన్నాను పెదనాన్నా! నువ్వేం చేయలేవు! నాన్నేంచేయలేడు! నేనూ ఏమీ చేయలేను! సరే!"

"మరో మాట! ఈ రోజే పంట సొమ్ము పదిహేనువేల రూపాయలు కల్నల్‌గారి చేతికందాయి. మొత్తం సొమ్ము ఇనప్పెట్టెలో క్షేమంగావుంది. అవసరం అనుకొంటే..." అంటూ మార్గం చూపాడు సూరజ్.

"పెదనాన్నా!" ఆవేశంగా అరిచాడు గోపాల్.

సూరజ్ నెమ్మదిగా పక్కకు తప్పుకొంటూ అన్నాడు—

"మార్గం చూపించాను! ఆపై నీఇష్టం!"

గోపాల్ బయటకి వెళ్ళిపోయాడు. వెనుక ద్వారం నుండి సావన్ లోని కొచ్చాడు. అంత వరకూ అతను అక్కడి తలుపుదాటున నిల్చుని సంభాషణంతా

విన్నాడు.

అన్నదమ్ములిద్దరూ నవ్వుకొన్నారు. ఆ నవ్వులో ఎంత విషముందో! ఎంత కుటిలత్వముందో ఎవరికి తెలుసు?

* * *

"ఏం నిర్ణయించుకొన్నావ్ గోపాల్"

సూరజ్ పక్కన నిల్చుని తన నిర్ణయం వినడానికి ఎదురు చూస్తూన్న- తండ్రిని చూశాడు గోపాల్. అతని కళ్ళల్లో తన అసమర్థతా, భయం కొట్టొచ్చినట్టుగా కన్పిస్తున్నాయి. అతను హంతకుడు, అయినా కన్న తండ్రి! అతను- తన నేరాన్ని కప్పిపుచ్చి తనను 'ఉరి'నుండి కాపాడే బాధ్యత కొడుక్కి అప్పగించాడు. గోపాల్ ఏవగింపుగా తండ్రిని మరోసారి చూశాడు.

"ఈరోజు రాత్రి ఏదో ఒకటి తేలిపోతుంది! నాకోసం మీరిద్దరూ ఎదురు చూడండి" అన్నాడు.

"ఎక్కడ?"

"ఊరిబయట! మీర్జాజీ పొలాలదగ్గర! సరిగ్గా పన్నెండు గంటలకు"

"అయితే నువ్వు..."

"నీక్కావలిసిన డబ్బు ఇవ్వడమో, లేక, నీ నిర్ణయాలకు తల వొగ్గడమో ఏదో ఒకటి అక్కడే తేలిపోతుంది"

"ఒకవేళ నువ్వు..."

"నేను అది తప్పను! మీరిద్దరూ రావాలి! ఆ ఉత్తరంకూడ తీసుకురావాలి!"

"తీసుకొస్తాను! నాకు డబ్బు ముట్టిన మరుక్షణం ఆ ఉత్తరం నీ చేతుల్లో కొస్తుంది"

గోపాల్ వెళ్ళిపోయాడు. సూరజ్ తమ్ముడి భుజం తడ్తూ, "ఎలావుంది" అనడిగాడు.

"బాగానే వుంది కాని, వాడు దొంగతనానికి పాల్పడతాడేమోనని..."

"దొంగతనమా! వాడి చేతకాదు! దొంగతనానికి ధైర్యసాహసాలు కావాలి! పిరికివాడు ఆపని చేయలేడు."

"వాడాపని చేయలేడని నీకు గట్టి నమ్మకం కదూ!"

"అవును ఈ రాత్రి తనకుతానే మనకు లొంగి, మన మాట ప్రకారం నడుస్తాడు చూడు! అంతకు మించి మరో ఉపాయం లేదు. ఒకవేళ దొంగతనం చేయాలనుకున్నా, ఈ రోజు కాకపోయినా, రేపైనా పోలీసుల దృష్టి లోనికిరాక తప్పదు. మనంకూడ ఎక్కడికి పారిపోలేం కదా! ఇదంతా వాణ్ణి భయపెట్టడానికే! ఈ దెబ్బతో వాడి ఆట కట్టు."

అన్నమాటలువిని సావన్ నిట్టూర్చాడు. చిలుములో పొగాకు దట్టించాడు.

గోపాల్ వాళ్ళకి విరుద్ధంగా ఆలోచిస్తున్నాడు. శాశ్వతంగా తన తండ్రిని సూరజ్ కబంధ హస్తాల నుండి విముక్తి చేయాలని నిశ్చయించుకున్నాడు. అందుకోసం, తను మరో నేరం విశ్వాసఘాతుకం చేయడానికి సిద్ధమయ్యాడు. తన తండ్రి నేరం కప్పిపుచ్చడానికి తను ఖూనీకోరు కొడుగ్గా ప్రజల దృష్టిలో పడకుండా వుండడానికి ఈ పాపం చేయక తప్పదు!

అతను తన 'పని' నిర్విఘ్నంగా జరుగుతుందనే ఆశతో వున్నాడు. కల్నల్‌గారి ఇనప్పెట్టె తాళాలు సంపాదించి, అందరూ నిద్రపోయేవరకూ వేచి చూశాడు.

పదివేల రూపాయలు దొంగిలించి

మరి, సూరజ్ చేతుల్లో పెట్టడానికి నిర్ణయించుకున్నాడు. తన తండ్రి మీద హత్యానేరం శాశ్వతంగా రూపుమాపాలి. కాని, డబ్బు తీసుకొంటూనే సూరజ్ ఎక్కడికయినా పరారయితే...

అలా అయితే తనేం చేయబోతున్నాడు? ఆ వూహకే అతని శరీరమంతా వణికిపోయింది. గదిలో ఒంటరిగా కూర్చుని పరిపరి విధాల ఆలోచిస్తున్నాడు. భోజనం కూడ చేయలేదు. ఆ రోజెవర్నీ పలకరించలేదతను. అందుకతనికి ధైర్యం చాల్లేదు. అతను అదోలా వుండటాన్ని గమనించి జ్యోతి కారణం అడిగితే ఏదో చెప్పి సమాధానపర్చాడు.

పాలు తీసుకొచ్చింది జ్యోతి. గ్లాసును బల్లమీద పెట్టింది.

"ఈ రోజు చివరి డిష్! తీసుకోండి" అంది.

గోపాల్ ఆమెకేసి చూసి నవ్వాడు. ఆమెను కూచోమని కూడ చెప్పలేదతను. తియ్యని కబుర్లు కూడ కట్టిపెట్టేశాడు. అతని మౌనం చూసింది. జ్యోతి 'గుడ్ నైట్' చెప్పి వెళ్ళిపోయింది.

ఆలోచనలు అతన్ని పిచ్చివాణ్ణి చేస్తున్నాయి. అతని శరీరంలోని అణువణువూ మరిగిపోతోంది. వుండుండి వులిక్కిపడుతున్నాడు. విచిత్రమైన పరిస్థితిలో ఇరుక్కొన్నాడు. ఒక వైపు జ్యోతి! మరోవైపు తండ్రి! ఎవర్నీ వదులుకోలేడు.



రాత్రి మించి పోతోంది. అతను లేచి కిటికీలోంచి బయటకి చూశాడు. ఆకాశం నిర్మలంగా వుంది. చుక్కలు మెరుస్తున్నాయి. చేతికున్న వాచీ చూసుకొన్నాడు. రేడియం ముళ్లు పిల్లికళ్ళల్లా మెరుస్తున్నాయి.

పదకొండు దాటింది!

నిశ్శబ్దంగా వుంది!

అతను ఇనప్పెట్టె తాళాల గుత్తి బయటకు తీసి, గుప్పెట్లో పట్టుకున్నాడు. ఎక్కడో కుక్క మొరిగింది. వులిక్కిపడి, పట్టుబడినట్టుగా గడగడలాడాడు. ధైర్యం కూడదీసుకొన్నాడు. కిటికీ దగ్గరకి వెళ్లిమళ్ళీ బయటకు చూశాడు. ఎవరూ కనిపించలేదు. కప్పల బెకబెకలు మాత్రం విన్పిస్తున్నాయి. కిటికీ రెక్కలు మూసేశాడు. నుదుటికి పట్టిన చెమటని రుమాల్తో అద్దుకొని, అదే రుమాల్తో తాళాల గుత్తిచుట్టి జేబులో వేసుకొన్నాడు. అతని కాళ్లు భయంతో వణుకుతున్నాయి.

ఇనప్పెట్టె వున్న గదికి జ్యోతి గదిలోంచి వెళ్ళాలి నెమ్మదిగా జ్యోతి గది దగ్గరకు చేరుకున్నాడు. కర్టెను చాటున నిల్చుని గదిలోనికి చూశాడు. అంతా చీకటిగావుంది. జ్యోతి నిద్రపోయింది. అతను తలుపుమీద నెమ్మదిగా చప్పుడు చేశాడు. ఆమెలో చలనంలేదు. గోపాల్ ముందుకు నడిచాడు. నెమ్మదిగా అడుగులు వేస్తూ ఇనప్పెట్టె గల గది కిటికీ దగ్గరకు చేరుకున్నాడు. ఇంతలో ఏదో శబ్దమయింది. అతను జ్యోతి పడుకొన్న మంచం వైపు నడిచాడు. జ్యోతి నిద్రలో వొత్తిగిల్లింది. గోపాల్ వూపిరి బిగపట్టి నెమ్మదిగా శరీరాన్ని కిటికీలోనికి చేరవేశాడు. లోపలివైపు గది కిటికీ రెక్కలు శబ్దం కాకుండా దగ్గరగా మూసేశాడు. నెమ్మదిగా చీకట్లో తడుముకుంటూ ఇనప్పెట్టె దగ్గరకు నడిచాడు. కాళ్ళు తడబడి పోతున్నాయి.

జేబులోంచి టార్చి తీసి వెలిగించాడు. తాళపు గుత్తులోంచి తాళం చెవిని ఎంచి, తాళానికి తగిలించాడు. టార్చి ఆర్పేశాడు. తాళం విప్పి, ఇనప్పెట్టె తెరిచాడు. మళ్ళీ టార్చి వెలిగించాడు. ఆ వెలుగులో అమర్చివున్న నోట్లకట్టలు కనిపించాయి. ఎందుకనో అతని శరీరం గగుర్పొడిచింది. లైటార్పి చేయిముందుకు తోశాడు.

అతని వేళ్లు నోట్ల కట్టలను తాకుతున్న సమయంలో బయటేదో చప్పుడయింది. ఆపాదమస్తకం గజగజలాడిపోయాడు. చేతిని వెనక్కు లాక్కొని. వెనుతిరిగి చూశాడు. తలుపులు మూసేవున్నాయి. అతని గుండెల చప్పుడే అతన్ని భయపెడుతోంది.

కొన్ని క్షణాలు గడిచాక, అతను ధైర్యం కూడదీసుకుని చేతిని మళ్ళీ ముందుకు చాచాడు. టార్చి వెలిగించాలని ఆ ప్రయత్నాన్ని విరమించుకొన్నాడెందుకో! ఆ చీకట్లో కూడ నోట్ల కట్టలు అతనికి స్పష్టంగా కన్పిస్తున్నాయి. హఠాత్తుగా ఆనోట్ల కట్టలు ఆకాశంలోని చుక్కల్లా మారిపోయి, ఆ చీకట్లో మెరుస్తున్నాయన్పిస్తోంది.

తనెంత పాపానికి ఒడిగట్టాడు. అంతే కాదు, తన సర్వస్వాన్ని అంకితం చేసిన జ్యోతి పవిత్రప్రేమకూడ ద్రోహం చేస్తున్నాడు. లోతు తెలిని వూబిలోనికి కూరుకుపోతున్నట్టుగా వుందతనికి.

అతని ఆలోచనలు తండ్రి కేసి మళ్ళాయి. తన కోసం, తన భవిష్యత్తు

కోసం తండ్రి ఆ దుర్మార్గుడి రాక్షస హస్తాల్లో చిక్కుకొన్నాడు. వాటినుండి అతన్ని విడుదల చేయాలి! వణుకుతోన్న చేతుల్తో నోట్ల కట్టలుతీసి జేబులో పెట్టుకున్నాడు గోపాల్.

అంతే!

ఎవరో వెయ్యి గొంతుల్తో నువ్వు ప్రేమకు ద్రోహంచేస్తున్నావంటూ అరచినట్టైంది. ఆ అరుపు అతన్ని అచేతనుణ్ని చేసింది. నిమిషం తర్వాత నోట్లకట్టలు తిరిగి యధాస్థానంలో వుంచేశాడు. చెయ్యి వెనక్కి తీసుకొంటుంటే కిటికీ దగ్గర ఏదో శబ్దమయింది. వెంటనే "ఎవరది?" అన్న మాటలు కూడ విన్పించాయి.

గోపాల్ వణికిపోతూ గబగబా ఇనప్పెట్టె మూసి తాళం వేయబోయాడు. కాని, అంతలోనే ఆ ఆకారం తలుపు తోసుకొని లోపలికి వచ్చింది. గోడకున్న స్విచ్ నొక్కింది. గది వెలుతురుతో నిండిపోయింది. గడ్డిపోచలా వణికిపోతున్న గోపాల్ అటుకేసి తిరిగి చూశాడు. ఆకాశం విరిగి మీదపడినట్లు, నేల చీలి తను పాతాళానికి జారి పోతున్నట్టుగా కుంగిపోయాడు.

ఎదురుగా జ్యోతి!

అసహ్యంగా, ఆశ్చర్యంగా అతన్నే చూస్తోంది. తను చూస్తూన్న దృశ్యాన్ని తనే విశ్వసించలేక పోతోంది. ఏమో అడగాలనుకొంది. కాని, పెదవులు కదల లేదు. కళ్లు విప్పార్చుకొని చూస్తోండిపోయింది. చివరకు గోపాల్ తేరుకొని-

"జ్యోతీ" అని పిల్చాడు.

"ఆ నోటితో మరి నన్ను పిలవకు." కోపంగా అరిచిందామె.

గోపాల్ ముందుకు దూకాడు. ఆమె నోరు మూసి-

"అరవకు ! ఎవరయినా వింటారు ! ముందు నా మాట..."

అతని మాటలింకా పూర్తికాలేదు. అతని చేతిని విసిరికొట్టి-"రాకు నా దగ్గరికి రాకు! పో! పో!" అంటూ అరిచిందామె.

"జ్యోతీ నా మాట విను"

"ఇంకేం వినాలి ! నేనేమీ వినను ! వినవలసిన అవసరం లేదు. నిన్ను పెంచి పెద్దచేసిన వాళ్ళన్ని,నిన్ను నమ్మిన వాళ్ళని అందర్నీ దోచుకోవాలను కొన్నావు! దుర్మార్గుడివి ! మోసగాడివి" ఆమె ఆవేశంగా అరిచింది.

"జ్యోతీ! అరవకు ప్లీజ్"

"అరుస్తాను! ఇంకా అరుస్తాను! నువ్వు దొంగవి, మోసగాడివి ! జీవన్ పేరుతో అమ్మనీ, నాన్ననీ, వంచించింది గాక నన్నుకూడా మోసం చేశావు"

ఇంతలో గది తలుపులు పెద్ద శబ్దంతో తెరుచుకున్నాయి. ఆవేశంగా కల్నల్‌గారు లోపలికి అడుగుపెట్టారు. అతని వెంట శాంతీదేవి కూడవున్నారు. వాళ్ళని చూశాక గోపాల్ దొరికిన దొంగలా నిల్చుండిపోయాడు.

"డాడీ" పూడుకుపోతున్న గొంతుతో అంది జ్యోతి.

"నేనంతా విన్నానమ్మా"

"డాడీ! ఇతను మన జీవన్ కాడు! ఇతని తండ్రి సూరజ్ ఇద్దరూ..."

"ఆఁ! ఇద్దరూ..."

"అన్నదమ్ములు ! వీళ్ళు ముగ్గురూ కలిసి మన ఆస్తిని దోచుకోవాలని ఈనాటకం ఆడారు" తల్లి భుజమ్మీద వాలిపోయింది జ్యోతి.

"నువ్వు చెప్పింది నిజమేనా! నా కళ్ళముందే ఇంత కుట్ర జరిగిందా? ఈ

విషనాగుని నా కొడుకనుకున్నానా?" బాధపడ్డారు కల్నల్‌గారు.

"డాడీ" గోపాల్ ఏదో చెప్ప బోయాడు.

"నోర్మూయ్! నన్ను పిలవకు"

"నన్ను నమ్మండి డాడీ! నేను నిర్దోషిని"

"అవును! దోషమంతా నాది! దోషిని నేను! పాముకి పాలుపోసి పెంచాను. మీవాళ్లంతా నాకు ద్రోహం చేశారు. నువ్వు కూడ చేశావు. నిన్ను క్షమించలేను"

"తప్పనిసరి పరిస్థితుల్లో..."

"ఏమిటా తప్పనిసరి పరిస్థితులు." కల్నల్‌గారు ఉద్రేకంగా అరిచారు. "జ్యోతీ! ఎవర్నయినా పంపించి సూరజ్‌ను రమ్మను" ఆజ్ఞాపించారు.

"అతను ఇంటి దగ్గర లేడు" గోపాల్ కల్పించుకొన్నాడు.

"ఎక్కడున్నాడు?"

"మీర్జారీ పొలాల దగ్గర"

"మీర్జారీ పొలాల దగ్గరా!?" కల్నల్ గారు ఆశ్చర్యపోయారు.

"అవును! అక్కడ నాకోసం ఎదురు చూస్తున్నారు. నేనీ డబ్బు వాళ్ళ కోసమే దొంగతనం చేశాను."

"ఎందుకని?"

"మా నాన్నను దక్కించుకోవాలి! అలాగే ఆ పుత్తరం కూడ"

"ఏ పుత్తరం?" కల్నల్‌గారికి అయోమయంగా వుంది.

"మా నాన్న హంతకుడు! ఓ హత్య చేశాడు. ఆ విషయం పెదనాన్నకే తెలుసు. హత్యా నేరాన్ని నిరూపించే పుత్తరం సూరజ్ దగ్గరుంది. ఆపుత్తరం నాక్కావాలి"

"సావన్ హంతకుడా?"

"అవును! అతని ప్రాణం ఖరీదు పదివేల రూపాయలు లేకపోతే..."

"లేకపోతే"

"లేకపోతే జీవన్‌గా మీ యావదాస్తికి నేను వారసుణ్ని కావడం! నేనందుకు హర్షించలేను. నేను గోపాల్నే! మీకూ, నాకూ ఎటువంటి సంబంధమూ లేదు. అంతా సూరజ్ పన్నిన కుట్ర!"

గోపాల్ కళ్ళలోంచి కన్నీళ్ళు ధార కట్టాయి. అతనికి ఏమాత్రం బాధకలిగినా తల్లడిల్లిపోయే కల్నల్‌గారు ఆ కన్నీరు చూసి కూడ ఏ మాత్రం చలించలేదు. అందరి దృష్టి గోపాల్ మీదనే వుంది.

కల్నల్‌గారు ముందుకు వెళ్ళి నోట్ల కట్టలు తీసి గోపాల్‌కు అందించారు.

"దాదాపు పదివేలుంటాయి చాలా?" అనడిగారు.

"వద్దు! నేను పాపాత్ముణ్ని! నాకీ ఆదరణ వద్దు! నన్ను శిక్షించండి"

"శిక్షా!? అది తర్వాత! ముందు నీ తండ్రిని రక్షించుకో"

"అక్కర్లేదు! హంతకుడతను. శిక్ష ననుభవించాల్సిందే"

"తండ్రి చస్తుంటే చూడాలనివుందా?"

"అవును"

"కన్న తండ్రి మీదే అభిమానం లేని వాడివి! నిన్ను నేనెలా నమ్మను?"

"డాడీ"

"అయితే ఇది నీకు పరీక్ష"

"పరీక్షా! ?" విస్మయంగా అన్నాడు గోపాల్.

"అవును! పరీక్షే! నిన్ని పాపకూపం లోనికి నెట్టేసిన తండ్రిని రక్షించు కొంటావా? లేక నేను కావాలా?"

"నేనేం చేయాలి?" బాధగా మూల్గాడు.

"హత్య"

"హత్యా !?"

"అవును ! నీకు మనసంటూ వుంటే దాన్ని చంపుకొని ఈ డబ్బును వాళ్ళ కివ్వు"

"........."

"పోలీసులకు సాక్ష్యం కావాలి" సాలోచనగా అన్నారు కల్నల్‌గారు. నోట్ల కట్టలు అతని చేతిలో పెట్టారు.

"కాస్త నెమ్మదిగా వెళ్ళు! ఈ లోగా నేను పోలీసులను తీసుకొస్తాను"

పోలీసుల పేరు వింటూనే గోపాల్ అయోమయమైపోయాడు.

"ఈ విషయంలో ద్రోహం చేస్తే మాత్రం నువ్వు మనిషివికావు." గోపాల్ భుజం తట్టి అన్నారు కల్నల్.

గోపాల్ అక్కణ్నుంచి బయటికి వచ్చేశాడు. రోడ్డు మీద నిల్చున్నాడు. ఇప్పుడు తనేం చేయాలి ? ఆలోచించాడు. ఆలోచించటానికి సమయం లేదు.కల్నల్ గారి పరీక్ష నెదుర్కోవాలి !

గోపాల్ ముందు నుండి కల్నల్‌గారి కారు పోలీసు స్టేషన్‌కేసి పరుగు తీసింది.




చీకటిగా వుంది ! పంట పొలాల మీది నుంచి రివ్వునగాలి వీస్తోంది!

గోపాల్ చీకట్లో తడబడుతూ ముందుకు నడుస్తున్నాడు. నోట్లకట్టలు భరించలేని బరువుగా తోస్తున్నాయి.

సరిగ్గా పన్నెండు గంటలకు మీర్జాజీ పొలాల దగ్గరికి చేరుకోవాలి! పెదనాన్న, నాన్న తనకోసం అక్కడ నిరీక్షిస్తుంటారు. జీవితంలో మొట్టమొదటి సారి తన కర్తవ్యాన్ని నిర్వహించుకోవలసిన సమయం వచ్చింది. తనకర్తవ్యాన్ని పూర్తిగా నిర్వహించి, కల్నల్‌గారి విశ్వాసాన్ని గెల్చుకోవాలి ! అందుకోసం తన తండ్రి ఉరితాటిని కౌగిలించుకొన్నా సహించాలి !

అతను వెనక్కి తిరిగి చూశాడు– కల్నల్‌గారు వెనుకే వస్తున్నారేమోనని ! కాని, కనుచూపు మేర దూరం వరకూ ఎవరూ కన్పించలేదు. వరిచేలు చీకట్లో భయంకర నృత్యం చేస్తున్నట్టు గాలికి తలలూపుతున్నాయి.

మీర్జాజీ పొలాల దగ్గరికి చేరుకొన్నాడతను వేగంగా నడవటంతో బాగా అలసి పోయాడు. క్షణం నిల్చుని ఊపిరి పీల్చుకొన్నాడు. కొంచెం దూరంలో రెండు ఆకారాలు కన్పించాయి. వాళ్ళకి దగ్గరగా నడిచాడు.ఆ ఇద్దరూ లేచి నిల్చున్నారు.

"నేను గోపాల్ని"

"నువ్వు తప్పకుండా వస్తావనే అనుకొంటున్నాం" ఇద్దరూ ఒకేసారి అన్నారు.

గోపాల్ ఒకసారి నలువైపులా చూసి, ఎవరూ లేరని నిశ్చయించుకొని నోట్ల కట్టలను బయటికి తీశాడు. సూరజ్ కేసి విసిరాడు.

"లెక్క పెట్టుకో"

"నువ్వు దొంగతనం చేశావా?"

"అవును! నా తండ్రిని రక్షించుకోడానికేమైనా చేస్తాను ! ముందు ఆ ఉత్తరం ఇలా ఇవ్వు"

"తిల్లరమా ! బాబూ నాకోసం ఎంత పని చేశావు! అబద్ధం ! ఇదంతా అబద్ధం బాబూ నేనే హత్య చేయలేదు ! ఇదంతా మీ పెదనాన్న పన్నాగం" అరిచాడు సావన్. అతన్ని మరి మాటాడనివ్వక నోటిమీద గట్టిగా కొట్టాడు సూరజ్. సావన్ వెనక్కు తూలాడు. అది చూసి గోపాల్ కోపంతో సూరజ్ మీదకి చూశాడు. ఇంతలో—తీక్షణమైన వెలుగు ఆ ముగ్గుర్నీ కట్టిపడేసింది.

పోలీస్ ఇనస్పెక్టర్ ఎదురుగా వస్తూ టార్చి వెలుగుని వాళ్ళమీద గుప్పించాడు ఆయనతో పాటు కల్నల్‌గారు కూడ ముందుకొచ్చారు. వాళ్ళని చూస్తూనే సూరజ్ చేతిలోని నోట్లకట్టలు నేలమీదికి జారిపడ్డాయి. పిడుగు విరిగి మీద పడినట్టు



స్తంభించి పోయాడు. కల్నల్‌గారి కాళ్లు పట్టుకొన్నాడు.

"బాబుగారూ! క్షమించండి" అన్నాడు.

"అదంతా న్యాయస్థానంలో జరుగుతుంది" కల్నల్‌గారు కర్కశంగా అన్నారు. దూరాన వున్న జీపుకొన్ని క్షణాల్లో దగ్గరకొచ్చింది.

జీపులోంచి నలుగురు పోలీసులు కిందకి దిగి వాళ్ళని చుట్టు ముట్టారు. పోలీసులు సూరజ్‌కు సావన్‌కు బేడీలు వేశారు. గోపాల్ కూడ వాటిని బిగించ

బోయారు.

"అతను నా ఖైదీ" అన్నారు కల్నల్ గారు. కిందపడివున్న నోట్లనుతీసి కల్నల్ గారికి అందిస్తూ ఆ మాటలకి నవ్వాడు ఇనస్పెక్టర్.

"థ్యాంక్యూ మిస్టర్ జోన్స్!" కల్నల్ గారు ఇనస్పెక్టర్‌కు కృతజ్ఞతలు చెప్పేరు. గోపాల్ని తనతో రమ్మని సౌంజ్ఞ చేశారు. జీపు దగ్గరికి నడిచారు.

ఇద్దరూ ఇంటికి చేరుకొనేసరికి వరండాలో నిరీక్షిస్తోన్న జ్యోతి, శాంతీదేవి, నౌకర్లూ కనిపించారు. జీప్దిగి తిన్నగా హాల్లోనికి నడిచారు.

కల్నల్‌గారు సోఫాలో కూచుని ఆలోచిస్తున్నారు. గోపాల్ ద్వారం దగ్గర తలవాల్చుకొని నిల్చున్నాడు. జ్యోతి, శాంతీదేవి కుర్చీలమీద కూచుని కల్నల్‌గారిని, గోపాల్ని మార్చి మార్చి చూస్తున్నారు. గదిలో నిశ్శబ్దం అందర్నీ వేరు చేస్తోంది.

చివరికి కల్నల్‌గారు గంభీరంగా — "గోపాల్" అన్నారు నిశ్శబ్దాన్ని చీలుస్తూ. గోపాల్ తలొంచుకొనే ఆయన్ని చూశాడు అతని కళ్ళు చెమరుస్తున్నాయి.

"నిన్ను నేను స్వయంగా శిక్షించాలనుకొంటున్నాను".

"మీ ఇష్టం" నెమ్మదిగా విడివడ్డాయి పెదవులు.

"వెళ్ళు! నీ తుపాకి తీసుకురా"

తుపాకీ అన్నమాట వింటూనే తల్లీ, కూతుళ్ళ గుండెలు గుభేలు మన్నాయి. గోపాల్ వెళ్ళి తుపాకీ పట్టుకొచ్చాడు. అందరూ మౌనంగా చూస్తున్నారు. జ్యోతి కలవర పడుతోంది. "డాడీ ఏం చేస్తారు?" గోపాల్ తుపాకిని కల్నల్‌గారి కందించాడు. ఆయనందుకోలేదు.

"ఇది నా కోసం కాదు! దీని అవసరం నీకెప్పుడయినా వుంటుంది. అందుకే దీన్ని నీకు బహుమతిగా ఇస్తున్నాను. ఈ రోజునుండి నువ్వు మాకు శాశ్వతంగా దూరం కాబోతున్నావు. నీ ఒంటరి బ్రతుకులో కష్ట సుఖాలు పంచుకునే వాళ్ళెవరూ లేరు! ఒంటరితనాన్ని భరించలేక పోయినప్పుడు ఇది నీకెంతో ఉపకరిస్తుంది. ఇంతవరకు జంతువుల్ని గురి చూసి పేల్చావు. ఇక ఆత్మహత్య అవసరమనుకొన్నప్పుడు నీ పై నువ్వే గురి చూసుకో" అన్నారు.

గోపాల్ స్థాణువులా నిల్చున్నాడు. తర్వాత రెండడుగులు ముందుకేశాడు. కల్నల్‌గారి పాదాల్ని, శాంతీదేవి పాదాల్ని కళ్ళకద్దుకొన్నాడు. జ్యోతిని చూశాడు. ఆమె కళ్ళు వర్షిస్తున్నాయి.

గోపాల్ వాళ్ళందరి నుండి శాశ్వతంగా దూరం అవుతున్నాడు. ఈ వియోగం అతనికి జీవితాంతం భరించలేని కఠిన శిక్ష! తన హృదయంలో ఎన్నటికీ చెరగని ఆవేదనా ముద్రలను ముద్రించుకొని మరీ వెళ్తున్నాడు.

గోపాల్ నెమ్మదిగా మాటలు పెగల్చుకొని అన్నాడు కల్నల్‌గారితో

"మీరు కాదననంటే మరో వస్తువు తీసుకొంటాను"

"ఏమిటది?"

కల్నల్‌గారి ఫోటో కేసి చూపించాడు గోపాల్. ఆయన కళ్ళు చెమ్మగిల్లాయి. తలూపి 'సరే' నన్నారు. గోపాల్ ఫోటో తీసుకొని బయటకు వెళ్ళిపోయాడు.

జ్యోతి ఆందోళనగా లేచి నిల్చుంది. ఆమె గొంతు తడారిపోయింది. గొంతును

ఎవరో నొక్కి పెట్టినట్టు మాటలు బయటికి రావటం లేదు. ఆమె గోపాల్ వెనుకనే ద్వారం వరకు వెళ్ళింది. గోపాల్ బయట గేటు దాటి వెళ్ళిపోయాడు. అలాచూస్తూ అక్కడే నిల్చుంది జ్యోతి. అంతే! హఠాత్తుగా "డాడీ" అని అరుస్తూ నేల కొరిగింది.

కల్నల్‌గారు ఆత్రంగా వెళ్ళా రక్కడికి. ఏడుస్తూ "డాడీ! అతన్నా పండి! అతన్ని వెళ్ళనివ్వకండి" అంది.

"వద్దు తల్లీ వద్దు! అతనుమన 'జీవన్' కాడు. పచ్చి దగాకోరు"

"కాదు డాడీ"

"జ్యోతీ" కల్నల్‌గారు కోపంగా అరిచారు. జ్యోతి భయంతో వణికింది.

"డాడీ ఇంతవరకూ నేను మీకేమీ చెప్పలేకపోయాను. కాని, ముందతన్ని ఆపండి డాడీ! ఆపండి!"

"లేదు! అలా జరగడానికి వీల్లేదు"

"డాడీ! మీకెలా చెప్పాలి! అతను మీ 'జీవన్' కాడు. కాని, అతనే నా 'జీవన్'! అంటూ పిచ్చిదాన్లా గదిలోనికి పరుగు తీసింది. తలుపులు మూసుకొంది. లోపలి నుంచి ఆమె ఏడుపు విన్పిస్తోంది.

"అతను మీ 'జీవన్' కాడు! నా 'జీవన్'!" జ్యోతి మాటలు కల్నల్‌గారి చెవుల్లో ప్రతిధ్వనించాయి.

ఆయన భార్యకేసి చూశారు. ఆమె అయోమయంగా నిల్చుంది. కూతురి కోసమైనా గోపాల్ని వెళ్ళనివ్వవద్దని భర్తతో చెప్పలేక మథనపడుతోంది. జ్యోతి గదికేసి ఓసారి చూసి కల్నల్ గారు బయటికి నడిచారు.

గమ్యం తెలీక నడుస్తున్నాడు గోపాల్! నలువైపులా చీకటి! ఆ చీకటి అతన్నే కాదు, అతని జీవితాన్ని కూడ చుట్టుముడుతోంది. ఎప్పుడో ఒకప్పుడు బ్రతుకులోనికి వెలుగురాదా అన్న ఆశ ఏ కోశానా లేదు! అందుకే చీకటిలో ముందుకు పోతున్నాడు. ఒక చేతిలో తుపాకీ! మరో చేతిలో కల్నల్‌గారి ఫోటో వున్నాయి! ఆయన మాటలు అతని చెవుల్లో ప్రతిధ్వనిస్తున్నాయి.

"ఒంటరితనాన్ని భరించలేకపోయి నప్పుడు ఇది నీకెంతో వుపకరిస్తుంది. నీ కష్టాల్ని దూరం చేస్తుంది"

అకస్మాత్తుగా ఏదో వెలుగు అతన్ని నిలేసింది. ఆశ్చర్యంగా వెనుతిరిగి చూశాడు. ఓ కారు వేగంగా వస్తోంది. వెలుగుని భరించలేక అటుగా నడిచాడు గోపాల్! అంతలోనే కారు అతని పక్కగా వచ్చి ఆగింది. కల్నల్‌గారు కారులోంచి దిగారు.

"ఇంటికి రా గోపాల్" అన్నారు.

గోపాల్ కంగారుగా కల్నల్‌గారిని చూశాడు.

"లేదు! నేనెక్కడికీ రాను! నన్ను వదిలేయండి! నేను 'జీవన్'నికాను! గోపాల్‌ని! నాకీ శిక్షచాలు! వదిలేయండి! నన్నొదిలేయండి! నేనురాను!" ఏడుస్తు న్నాడతను.

"బాధపడకు గోపాల్! నేను నా జీవన్ కోసం రాలేదు! వాడు నాకెప్పుడో దూరం అయిపోయాడు. నన్ను మరిచి పోయేడు. నేనొచ్చింది నా జ్యోతి 'జీవన్' కోసం"

"డాడీ!!" గోపాల్ కల్నల్‌గార్ని కరుచుకుపోయాడు.

"డాడీ కాదు! అంకుల్!" గోపాల్ని ఆప్యాయంగా హత్తుకొన్నారాయన!

★

# గోల్డ్ మెడల్



ఏ ఆఫీసులోనయినా ఆడపిల్లలుంటేనే అందం. మిగతా సెక్షన్స్‌లో లేడీ క్లర్కులు, స్టెనోలు వున్నారు గానీ మా సెక్షన్ మాత్రం ఆ అదృష్టానికి నోచుకోలేదు. ఎపుడైనా విసుగెత్తి ఫైళ్ళలోంచి తలెత్తితే టక్ టక్‌మని టైప్ మిషన్ వాయిస్తూ పళ్ళికిలించుకుని సదానందం



దర్శనమిస్తాడు. ఏ దేవతలు కరుణించారో తెలీదు గాని సదానందానికి ప్రమోషనిచ్చి పర్సనల్ డిపార్టుమెంటుకి మార్చారు. మా సెక్షన్లో స్టెనో సీటు ఖాళీ. టకటకల మోత తగ్గి కాస్త మనశ్శాంతిగా వుంది. ఇంతలో మా బావమరిది పెళ్ళి అనుకోకుండా కుదరడంతో నాల్రోజులు శలవు పెట్టి కాకినాడ వెళ్ళి వచ్చాను. తీరావచ్చి చూస్తే సెక్షన్లో గాజుల గలగలలు, నవ్వుల కిలకిలలు. స్టెనో సీట్లో ఓ సుందరాంగి కూర్చుని వుంది. సెక్షన్లో అందరి మొహాలూ కళకళలాడిపోతున్నాయి. రోజంతా చెయ్యాల్సిన పని లంచ్ లోపలే పూర్తి చేసేశాను. అందరి పనీ అలాగే వుందని తర్వాత లంచ్ హాల్లో తెలిసింది. ఆ అమ్మాయి పేరు స్వప్న అనీ, చదువులో ఫస్టనీ, బోల్డన్ని గోల్డ్ మెడల్స్ కొట్టేసిందనీ చాలా వివరాలు చెప్పారు మావాళ్ళు. మా ఆఫీసరు మనోహర్‌కి 30 ఏళ్ళపైనే వుంటాయి. కానీ పెళ్ళవ

## చతుర

లేదు. ఘోటక బ్రహ్మచారి. పేరుకు తగ్గట్టే అందగాడు, మంచివాడు. మమ్మల్ని తన క్రింది ఉద్యోగులుగా ఎప్పుడూ చూళ్ళేదు. సహోద్యోగులుగానే ట్రీట్ చేసేవాడు. మా ఎకౌంటెంట్ పాణి అంటే ఆయనకి ప్రత్యేకాభిమానం. ఆ చనువుతో ఓ రోజు తన పెళ్ళి శుభలేఖ ఇస్తూ "ఏమిటి సార్! మాఅందరి పెళ్ళిళ్లు అయిపోతున్నాయి. మీరింకా ఇలాగే వుండిపోవడం ఏం బాలేదు" అన్నాడు.

ఆరోజు స్వప్న ఆఫీసుకి శలవు పెట్టింది.

"నాకు తగ్గ అమ్మాయి ఇంకా దొరకలేదోయ్. అంతే అంతకు మించి ఏం



లేదు" అన్నాడు నవ్వుతూ.

"మన కొత్త స్టెనో స్వప్న అందగత్తె, చదువుకుంది. పైగా ఆవిడకి వచ్చిన గోల్డ్ మెడల్స్ లెక్కబెట్టడమే కష్టంట. మరి మీ తెలివికీ, అందానికీ ఆమె సరిపోతుందని..." నసిగాడు చివర్లో.

"అందుకే నేను ప్రయత్నించలేటోయ్. ఆవిడ కొచ్చిన బంగారు పతకాలన్నీ 'డిబేటింగ్'లో వచ్చినవేతెల్సా" అన్నాడు నవ్వుతూ. "రేపు పెళ్ళైతే నేను కూడా ఓ గోల్డు మెడల్ ఇవ్వాల్సొంటుంది గదా! అందుకే అలాంటి సంబంధాలు మనకొద్దు"

—లక్ష్మి

## కతలు

## సబ్బులు

నాగరాజు ఓ సబ్బుల కంపెనీలో సేల్స్ రిప్రజెంటేటివ్‌గా విశాఖపట్నంలో ఉన్నాడు. వీధులన్నీ తిరుగుతూ, ఇంటింటికి పోతూ సబ్బులను ప్రచారం చేయడమే అతనిపని. ఓ రోజు మహారాణీ పేటలో తిరుగుతూ ఎదురుగా ఉన్న లేడీస్ హాస్టల్‌లోకి నడిచాడు.

చేతిలో ఉన్న మైక్‌ను ఆన్ చేసి "చూడండి అమ్మాయిల్లారా – ఇది బట్టల సబ్బు-అద్భుతంగా ఉతుకుతుంది. ఎంత మురికిగా ఉన్న బట్టలనైనా నిముషాలలో మిలమిలా మెరిపిస్తుంది. చూడండి కావాలంటే ఈ మురికి కర్‌ఛీఫ్‌ను ఉతికి చూపిస్తాను" అన్నాడు.

కొందరమ్మాయిలు అతడిని ఏడిపిద్దామని "అబ్బే అది వద్దు మా బట్టలు ఉతికి చూపెట్టు" అనిలోనికిపోయి తమలంగాలు వగైరా అంటరాని వస్తువులు తీసుకొచ్చి అతనికిచ్చారు.




నాగరాజు మొహం కంద గడ్డ అయ్యింది. చేసేది లేక అవే ఉతికి తెలుపు చేసిచ్చాడు.

తర్వాత పెట్టెలో నుండి మరో సబ్బు తీసాడు. "చూడండి ఇది మనుషులు వాడే అతి మృదుమధురమైన సోపు దీనితో వళ్ళు తోముకుంటే అందమైన శరీరాలకు చక్కని సువాసన వస్తుంది. కావాలంటే

ఇందాక బట్టలు ఉతికి చూపినట్లే ఎవరేనా ముందుకు వస్తే వారి మీద ఇది ప్రయోగించి ప్రత్యక్షంగా చూపెడతాను" అన్నాడు.

బట్టలు వేసిన అమ్మాయిలంతా గాభరాగా రూములలోనికి పరుగెత్తారు.

—పినిశెట్టి శ్రీనివాస్



# అతని కంటే ఘనుడు

పీనాసిరావు సార్థక నామధేయుడు కాదు! ఆ పేరుకే సార్థకత తెచ్చినవాడు!!

అతడి అసలు పేరు బంధువులకి, మిత్రులకి, సన్నిహిత పరిచయస్థులైన కొద్ది మందికి మాత్రమే తెలుసు.

పీనాసిరావు ఎన్నో రకాలుగా ధన సంపాదన చేసినా, పైసా ఖర్చు పెట్టేందుకు కూడా పాతిక సార్లు ఆలోచిస్తాడు.

పీనాసిరావుకి కొడుకును వదిలిపెట్టి, తను ఈ లోకాన్ని వదలి వెళ్ళిపోయిందతడి భార్య చాలా కాలం క్రితమే!

పోతపాలతో పాటే కొడుక్కి పిసినారితనం కూడా నూరిపోసి పెంచాడు పీనాసిరావు. అందుకు తగ్గట్లే కొడుకు కూడా అతడిననుసరిస్తూనే పెరిగాడు.

రాత్రిపూట పీనాసిరావు "వీలైనంత పొదుపు ఎట్లా చెయ్యాలన్న" విషయం మీద కొడుక్కి "కొంచెం" చెప్పదల్చుకొన్నాడు.

ఉపన్యాసం ప్రారంభిస్తూ, "మాట్లాడుకొనేప్పుడు లైటు అనవసరం! ఒకరికొకరం కన్పించనక్కరలేదు కదా - మాటలు వినబడటం ముఖ్యంగాని! అందుచేత మన మాటలు పూర్తయ్యేంతవరకూ లైటు తీసేద్దాం" అంటూ లైటు ఆర్పేశాడు. ఓ గంటన్నర తర్వాత చెప్పటం పూర్తయింది.

"ఇంక లైటు వెలిగిద్దాం" అంటూ పీనాసిరావు స్విచ్ వద్దకు నడవబోయాడు.

అప్పుడు "ఆగు నాన్నా!" అంటూ కంగారుగా వినబడింది అతని పుత్రరత్నం గొంతుక.

"ఏం?" అంటూ ఆశ్చర్యపడ్డాడు పీనాసిరావు.

"చీకటిలో ఒకరి కొకరం కనపడం కదా! ఇంక బట్టలతో అవసరమేమిటి అని ఒంటిమీద ఉండటం దండగ నలిగిపోతాయని విప్పేశాను!" అన్నాడు పీనాసిరావు కొడుకు తిరిగి బట్టలు వేసుకోనేందుకు ఉపక్రమిస్తూ.

—మోనాలిసా

Edited, Printed and Published by Ramoji Rao Ch. for Vasundhara Publications. Printed at Colorama, Offset Printers, Hyderabad. CHATURA Telugu Monthly. Eenadu Compound, Hyderabad - 500 004.


మీ డబ్బుకి
ఇంతకంటె
మంచి రక్షణ
అవసరం !